శ్రీమతే రామానుజాయ నమః



# భగవన్నామవైభవము

**(ఆచమనమంత్రనామ - కేశవాదిద్వాదశనామవివరణము)**

"పండితరత్న" శ్రీమాన్. డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు

పరిష్కరణము

న్యాయవేదాంతవిద్వాన్

ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు

ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి

**తిరునక్షత్రోత్సవజ్ఞాపిక - 2009**

భగవన్నామవైభవము

"పండితరత్న" డా. ఈ.ఏ. శింగరాచార్యులు

ప్రథమముద్రణ : ఏప్రియల్ -2009, విరోధి-మేషమాసం

ప్రతులు : 500

వెల : రూ. 25/-



ఆవిష్కరణము : ఆచార్య తిరునక్షత్రోత్సవ సందర్భంగా- 12-3-2009.

వేదిక : శ్రీభాష్యకారభవనం, నరసాపురం.

ఈగ్రంథం శ్రీమతి దాట్ల శారదాదేవిగారు,
శ్రీమాన్ దాట్ల సుబ్బరాజుగారు దంపతులు
భక్తితో సమర్పించిన పవిత్రద్రవ్యంతో ముద్రింపబడింది

ప్రతులకు : శ్రీమతి. ఈ. జయలక్ష్మి,
18-3-58/7, శాంతినగర్,
కె.టి.రోడ్, తిరుపతి - 517 507
ఫోన్ : 0877-2232091

డి.టి.పి. : శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి
భవానినగర్, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్,
ప్రకాశంరోడ్, తిరుపతి



న్యాయవేదాంతవిద్వాన్,
ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు,
భారద్వాజభవనం, నరసాపురం.

## మంగళాశాసనము

**"దేవో నామసహస్రవాన్"** అని, **"పేరాయిరమ్ కొణ్డదు ఓర్ పీడుడైయన్"** అని, **"పలపలవే ఆబరణమ్ పేరుమ్ పలపలవే"** అనే రీతిలో అసంఖ్యాకాలైన నామాలను కలవాడుగా భగవానుడు కీర్తింపబడుతున్నాడు. ఈ నామాలలో కొన్ని భగవానుని స్వరూపాన్ని, మఱికొన్ని దివ్యమంగళ విగ్రహవైభవాన్ని, మఱికొన్ని కల్యాణగుణాలను, ఇంకా మఱికొన్ని భగవచ్చేష్టితాలను కీర్తిస్తున్నవి. **"యాని నామాని గౌణాని"** అనే భీష్మాచార్యసూక్తిని వ్యాఖ్యానిస్తూ శ్రీపరాశరభట్టర్ ఈ సంగతిని వివరించారు.

భగవానునకు ఎన్నో నామాలు ఉన్నా, వాటిలో ప్రపన్నులు ప్రతిదినం ఎన్నోమార్లు తమ నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానాలలో అనుసంధించుకొనే నామాలు కొన్నే ఉన్నాయి. వాటిలో, ఆచమనసమయంలో అచ్యుత, అనంత, గోవిందనామాలు పఠింపబడుతున్నాయి. తరువాత, ఊర్ధ్వపుండ్రధారణలో, అర్చనాదులలో, హోమాదులలో చివర చేసే షాడ్గుణ్యహోమంలోనే కాక, ప్రతిదినం లేవగానే అనుసంధించవలసినవిగా చెప్పబడ్డ కేశవాదిద్వాదశనామాలు ముఖ్యంగా లెక్కించదగినవి.

ఈ నామాలను వాటికి మహర్షులు, ఆళ్వార్లు, పూర్వాచార్యులు తెల్పిన అర్థాలను అనుసంధిస్తూ చెప్పుకొంటే కలిగే ఆనందం అపరిమితంకదా ! అందువల్ల ఈ కేశవాది ద్వాదశనామాలకు, ఆచమనంలో అనుసంధించే మూడు నామాలకు వివరణం ప్రస్తుతం ప్రపన్నజనానుసంధానంకోసం ముద్రింపబడుతున్నది.

కేశవాదినామాల ద్వాదశసంఖ్యనుగూర్చి ప్రస్తావిస్తే, **"ఓం నమో భగవతే వాసుదేవాయ"** అనే ద్వాదశాక్షరిలో పన్నెండు అక్షరాలున్న అంశం గుర్తుకు వస్తుంది. కేశవాది దామోదరాంతంగా గల పన్నెండు నామాలు పరవాసుదేవమూర్తినుండి అవతరించిన వ్యూహవాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధమూర్తులను

ఆధారంగా చేసికొని అవతరించాయి. ఈ అంశాన్ని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు తత్త్వత్రయంలోని ఈశ్వరప్రకరణంలో (193వ సూత్రంలో) **“కేశవాది మూర్త్యంతరముమ్”** అని సంగ్రహంగా సూచించగా, దానిని శ్రీమద్వరవరమునులు **“కేశవాదిమూర్త్యంతరమ్”** - అంటే, **“ఏతదంతర్గతా స్సర్వే మూర్త్యంతర సమాహ్వయాః, కేశవాద్యా ద్వాదశ చ లలాటాదిషు నిష్ఠితాః, శరీరరక్షకా స్సర్వే ధ్యాయినాం తాపశాంతయే”** అని, **“కేశవాద్యం త్రయం తత్ర వాసుదేవాద్విభావ్యతే, సంకర్షణాచ్చ గోవిందపూర్వం త్రితయ మద్భుతమ్, త్రివిక్రమాద్యం త్రితయం ప్రద్యుమ్నాదుదితం మునే!, హృషీకేశాదికం తద్వదనిరుద్ధాన్మహామునే!”** అని చెప్పే రీతిలో లలాటాదిస్థానాలలో నిలచి ఉండి శరీరరక్షణాన్ని చేస్తూ, ధ్యానం చేసేవారి తాపశాంతికోసం ఉన్నవై, నాల్గు వ్యూహాలలో ఒక్కొక్క వ్యూహంనుండి పుట్టినవై, మూర్త్యంతరనామాలను కల కేశవాది వ్యూహాంతరాలు” అని వివరించారు. దీనినిబట్టి కేశవ, నారాయణ, మాధవ మూర్తులు వ్యూహవాసుదేవ మూర్తినుండి, గోవింద, విష్ణు, మధుసూదన రూపాలు సంకర్షణమూర్తినుండి, త్రివిక్రమ, వామన, శ్రీధరరూపాలు ప్రద్యుమ్నమూర్తినుండి, హృషీకేశ, పద్మనాభ, దామోదరరూపాలు అనిరుద్ధమూర్తినుండి అవతరించాయని తెలుస్తున్నది. ఊర్ధ్వపుండ్రధ్యానవిధి స్తోత్రంలో వరుసగా కేశవాదిద్వాదశమూర్తుల ధ్యేయరూపాలను తెలిపి, చివరగా ఈ రూపాలకు మూలం అయిన వాసుదేవమూర్తినిగూర్చి **“సర్వాభీష్టప్రదాధీశం మూర్ధ్ని సర్వాయుధం విభుమ్, వాసుదేవ ముపాసేఽహమ్”** అని పల్కడంకూడా ఇక్కడ స్మరణీయం. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రంలో కేశవనామం రెండుసార్లు (149, 581), మాధవనామం మూడుమార్లు (206,280,638), గోవిందనామం రెండుమార్లు (295,518), విష్ణునామం మూడుమార్లు (108, 333, 585), పద్మనాభనామం రెండుమార్లు (299, 384) పఠింపబడడం వీటి ప్రాధాన్యాన్ని తెలుపుతున్నది. “ప్రధానక్షేత్రజ్ఞపతిః గుణేశః” అని శ్రుతి పల్కిన రీతిలో చిదచిత్తులకు పతి సర్వేశ్వరుడు. కనుక 12 సంఖ్యలో 1 అనే అంకె అద్వితీయపతి అయిన సర్వేశ్వరుని, 2 అనే అంకె చిదచిత్తత్త్వాలను సూచిస్తుందని, ఈవిధంగా ఈ ద్వాదశసంఖ్య తత్త్వత్రయ సూచకమని భావించడంలో విప్రతిపత్తి లేదు. ద్వాదశసంఖ్యలోని అంకెలను కలిపినా మూడేకదా వస్తుంది.



ఇటువంటి వైశిష్ట్యాన్ని కల కేశవాది ద్వాదశనామాల వైభవాన్ని, ఆచమనం చేసేటపుడు ఉచ్చరించే అచ్యుతాది మూడు నామాల వైభవాన్ని శ్రుతిస్మృతీతిహాస పురాణదివ్యసూరిపూర్వాచార్య సూక్తులను ఆధారంగా చేసికొని వివరించే ఈగ్రంథం ప్రపన్నులకు కరదీపిక కాగలదని నా విశ్వాసం. ఈ భగవన్నామాల వివరణను వ్రాసి స్వరూపానురూపం అయిన వాచికకైంకర్యాన్ని చేసికొన్న కుమారుడు చి.శింగరాచార్యులకు అనేక మంగళాశాసనాలు. ప్రస్తుతగ్రంథాన్ని ముద్రించడానికి తమ పవిత్ర ద్రవ్యాన్ని వినియోగించడంద్వారా తమకుండే భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠను వ్యక్తం చేసిన పుణ్యదంపతులు **శ్రీమాన్ దాట్ల సుబ్బరాజుగారిని, శ్రీమతి దాట్ల శారదాదేవి** గారిని హార్దికంగా అభినందిస్తున్నాను. వీరికి శ్రియఃపతి అనుగ్రహంవల్ల సర్వశుభాలు కలగాలని మంగళాశాసనం చేస్తున్నాను. శ్రీమాన్ సుబ్బరాజుగారు బి.హెచ్.ఇ.ఎల్ కంపెనీలో ఛీఫ్ మేనేజరుగా పనిచేస్తున్నారు. ఈ గ్రంథముద్రణను శ్రీమతి శారదాదేవిగారు పరమపదవాసులు, తమ మాతా మహీమాతామహులైన శ్రీమతి రుద్రరాజు బంగారమ్మగారు, శ్రీమాన్ సీతారామరాజుగార్ల సంస్మరణార్థంగా చేస్తున్నారు. శ్రీమతి బంగారమ్మగారు, శ్రీమాన్ సీతారామరాజుగారు- వీరిద్దరూ తిరునారాయణపురవాస్తవ్యులు, సుప్రసిద్ధవిద్వాంసులు, **ఉ.వే.శ్రీమాన్ వంగిపురం వీరరాఘవాచార్యస్వామివారిని,** ఆశ్రయించి ఉజ్జీవించిన ధన్యులు. అంతేకాక, మాపితృపాదులైన **మహావిద్వాన్, ఉ.వే.** శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామి వారి విషయంలో గొప్ప భక్తిప్రపత్తులను కలవారు. అందువల్ల ఈ గ్రంథం ఈ ఏడు శ్రీమాన్ పితృపాదుల తిరునక్షత్రమహోత్సవ సందర్భంగా ఏప్రియల్ 11వ తేదినుండి 13వ తేదివరకు నరసాపురంలో జరిగే శ్రీరామానుజదర్శన ప్రచారకసభలలో ఆవిష్కరింపబడడం చాలా సముచితం. ప్రపన్నులందఱు ఈ భగవన్నామవైభవామృతాన్ని మనసార ఆస్వాదించి తృప్తులవుతారని ఆశిస్తూ, సెలవు.

నరసాపురం, ఇట్లు విన్నవించు

12-3-09. భాగవతవిధేయుడు

**ఈ. రంగాచార్యులు**

శ్రీమతే రామానుజాయ నమః



# భగవన్నామవైభవము

## ప్రవేశిక

ఞానత్తాల్ నన్గుణర్న్దు నారణన్ఱన్ నామజ్గళ్
తానత్తాల్ మఱ్ఱవన్పేర్ శాఱ్ఱినాల్ - వాన
త్తణియమరర్ ఆక్కువిక్కు మవదన్ఱే నజ్గళ్
పణియమరర్కోమాన్ పరిశు

(ఇరణ్డామ్తిరువన్దాది - 2)

(శ్రీమన్నారాయణుని స్వరూప రూపగుణాలను తెలిపే నామాలను, ఇంకా ఆస్వామియొక్క విభూతి విస్తృతికి వాచకాలైన తిరునామాలను భక్తిరూపాపన్న జ్ఞానంతో బాగా తెలిసికొని, భక్తిపరాకాష్ఠలో నిలిచి అనుసంధిస్తే, మనకు బంధువులు గాను, సదా కైంకర్యనిష్ఠులుగాను ఉండే నిత్యసూరులకు నాథుడైన భగవానుని స్వభావం, పరమపదానికి అలంకారభూతులైన నిత్యసూరులతో సమానంగా మనలను చేస్తుందిగదా!)

శ్రీనాథ! నారాయణ! వాసుదేవ! శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణే!
శ్రీ పద్మనాభాచ్యుత! కైటభారే! శ్రీరామ! పద్మాక్ష! హరే! మురారే!

అనంత! వైకుంఠ! ముకుంద! కృష్ణ! గోవింద! దామోదర! మాధవేతి ।
వక్తుం సమర్థోఽపి న వక్తి కశ్చిత్ అహో! జనానాం వ్యసనాభిముఖ్యమ్

(ముకుంద మాల-36, 37)



వైభవం భగవన్నామ్నా మద్భుతం సూరిసంమతమ్ ।
యత్కించిల్లిఖ్యతే శ్రీమన్నారాయణముదే మయా ॥

**"అచ్యుతానంతగోవిందనామోచ్చారణభేషజాత్, నశ్యంతి సకలా రోగా సత్యం సత్యం వదామ్యహమ్"** (అచ్యుత, అనంత, గోవింద-అను తిరునామములను ఉచ్చరించుట అనెడి మందుతో వ్యాధులన్నియు నాశము పొందును. ఇది నిజము, ఇది నిజము- అని రెండు మార్లు శపథము చేసి పల్కుచున్నాను) అని అచ్యుత, అనంత, గోవింద అను తిరునామముల మహిమ విష్ణుధర్మములో వివరింపబడినది. **"ఆర్తా విషణ్ణా శిథిలాశ్చ భీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః, సంకీర్త్య నారాయణశబ్దమాత్రం విముక్తదుఃఖా స్సుఖినో భవంతి"** (ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములనబడు తాపత్రయముచే బాధింపబడువారు, భయపడువారు, ఘోరములైన వ్యాధులలో చిక్కుకొనినవారును నారాయణ అను నామము మాత్రమునే కీర్తించినవారైనచో, వారు అన్ని దుఃఖములనుండి విముక్తులై, సుఖమును పొందుదురు) అని భారతములో (నామమహిమ) తెలుపబడినది.

**"నారాయణేతి శబ్దోఽస్తి వాగస్తి వశవర్తినీ, తథాఽపి నరకే ఘోరే పతంతీతి కిమద్భుతమ్"** (నారాయణుడు అను శబ్దము ఉన్నదే! నోరు వశములో నున్నదే! అయినను ఘోరమైన నరకములో పలువురు పడుచున్నారనుట ఎంత ఆశ్చర్యకరము!) అని పురాణములందును చూపబడినది. పేయాఴ్వార్లును దీనినే- **నావాయిలుణ్డే నమో నారణా వెన్ఱొ, ఓవాదురైక్కుమ్ ఉరై యుణ్డే, మూవాద మాక్కదిక్కణ్ శెల్లుమ్ వకై యుణ్డే, ఎన్నొరువర్ తీక్కదిక్కణ్ శెల్లుమ్ తిఱమ్,** (నాలుక నోటిలో ఉన్నదికదా! నిరంతరము "నమో నారాయణాయ" అని చెప్పు తిరుమంత్రమున్నదికదా! పునరావృత్తి లేని, గొప్ప మోక్షమార్గమున పోవు ఉపాయమున్నది కదా! అయినను, కొందఱు నరకమునకు పోవుచున్నారనుట ఎంత ఆశ్చర్యకరము !) అని సాయించిరి. **"అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః , పుమాన్ విముచ్యతే సద్యః సింహత్రస్తై ర్మృగై రివ, యన్నామ కీర్తితం భక్త్యా విలాయన మనుత్తమమ్, మైత్రేయాశేషపాపానాం ధాతూనా మివ పావకః" (వి.పు. 6-8)** (ఆ భగవానుని తిరునామములు యదృచ్ఛయా- అనగా- అనుకోకుండ

కీర్తింపబడినను, వానిని కీర్తించినవాని పాపములు, సింహముచే భయపెట్టబడిన మృగములు పాఱిపోవునట్లే పాఱిపోవును. మైత్రేయా ! బంగారము మొదలగు ధాతువులలోని కాలుష్యమును అగ్ని పోగొట్టునట్లు, భక్తితో ఆ స్వామి తిరునామముల కీర్తనము చేయుట అన్ని పాపములను పోగొట్టుటలో సాటి లేని మేటి సాధనమగును) అనియు, **"ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞై స్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్, యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్"** (భగవానుని కృతయుగములో ధ్యానించుటచేతను, త్రేతాయుగమున యజ్ఞములతో ఆరాధించుటచేతను, ఆ ఫలమునే కలియుగములో కేశవుని సంకీర్తనము చేసి, పొందును) అనియు, **"కిం చిత్రం తదఘం ప్రయాతి విలయం తత్రాచ్యుతే కీర్తితే"** (అచ్యుతుని నామము కీర్తింపబడగానే అచటినే పాపములన్నియు నాశమును పొందుచున్నవి అను ఈ విషయములో ఆశ్చర్య మేమి?) అనియును విష్ణుపురాణమునందును వివరింపబడినది.

**"అజ్ఞానతో జ్ఞానతో వా వాసుదేవస్య కీర్తనాత్, తత్సర్వం విలయం యాతి తోయస్థం లవణం యథా"** (తెలిసియో, తెలియకనో వాసుదేవుని తిరునామమును పల్కినవాడైనచో, అతని పాపమంతయు నీటిలోనున్న ఉప్పువలె కఱగి, రూపు మాసిపోవును) అనియు, **"శమాయాలం జలం వహ్నే స్తమసో భాస్కరోదయః, శాంతిః కలే రఘౌకస్య నామసంకీర్తనం హరేః"** (నిప్పును ఆర్పుటకు నీరు, చీకటిని తొలగించుటకు సూర్యోదయము సమర్థములు. అట్లే, కలికోలాహలమువలన ఏర్పడిన పాపప్రవాహమును నశింపచేయుటకు హరినామసంకీర్తనము సమర్థము) అనియు, **"యన్నామ సంకీర్తనతో విముచ్యతే"** (ఎవని తిరునామసంకీర్తనము వలన మోక్షమును పొందునో) అనియు, **"యన్నామ సంకీర్తనతో మహాభయా ద్విమోక్ష మాప్నోతి న సంశయం నరః"** (ఎవని తిరునామసంకీర్తనముతో మానవుడు గొప్ప ఆపదనుండి నిస్సందేహముగా విడివడునో.)అనియు, **"సకృదుచ్చరితం యేన హరి రిత్యక్షరద్వయమ్, బద్ధః పరికర స్తేన మోక్షాయ గమనం ప్రతి"** (హరి అను ఈ రెండు అక్షరములును ఎవనిచే ఉచ్చరింపబడినవో, అతడు మోక్షమునకు పోవుటకు అవసరమైన పరికరములను సిద్ధము చేసికొన్నవాడు) అనియు, **"యస్య నామ్ని స్మృతే మర్త్యః సముత్క్రాంతే రనంతరమ్, ప్రాప్నోతి వైష్ణవం స్థానం పునరావృత్తివర్జితమ్....."** (ఎవని తిరునామమును స్మరించిన మానవుడు



మరణించిన పిదప పునరావృత్తి లేని, విష్ణువుయొక్క పరమపదమును పొందుచున్నాడో.....) అనియు విష్ణుధర్మములో పలు చోట్ల చెప్పబడినది. వేఱొక చోట- **"సర్వాన్ కామాన్ ప్రాప్నువంతే విశాలాన్ త్రైలోక్యేఽస్మిన్ కృష్ణనామాభిధానాత్"** (ఈ ముల్లోకములందున్న మిక్కిలి గొప్ప, ప్రియమైన వస్తువులనన్నిటిని కృష్ణనామ సంకీర్తనము మూలముగానే పొందును) అనియును ఘోషింపబడినది. **"సంకీర్తయే జ్జగన్నాథం వేదం వాపి సమీరయేత్"** (జగన్నాథుడగు భగవానుని నామసంకీర్తనము చేయవలెను. లేనిచో, వేదమునైనను చెప్పవలెను) అని నారాయణనామసంకీర్తనము వేదాధ్యయనముకంటెను గొప్పది- అని తెలుపబడినది. వీటికన్నిటికిని మూలమైన వేదమునందుకూడ- **"ధ్రువాసో అస్య కీరయో జనాసః"** (ఇతనిని కీర్తించు జనులు స్థిరమైన మోక్షస్థానమును పొందుచున్నారు) అని ఉద్ఘోషింపబడినది.

**"కెడు మిడరాయ వెల్లామ్ కేశవా వెన్న నాళుమ్ కెడు వినై శెయ్యుమ్ కూఱ్ఱిన్ తమర్కళుమ్ కుఱుకకిల్లార్"** (కేశవా ! అని అనగానే దుఃఖములన్నియు నశించును. ప్రతిదినము క్రూరకర్మలను చేయుచున్న యముని దూతలును దగ్గరకు రారు.) అని నమ్మాళ్వార్లు పల్కిరి. **"కావలిఱ్పులనై వైత్తు కలితన్నై క్కడక్కప్పాయ్న్దు, నావలిట్టుళి తరుకిన్ఱోమ్ నమన్తమర్ తలైకళ్మీదే, మూవుల కుణ్డుమిళ్న్ద ముదల్వ! నిన్నామమ్ కఱ్ఱావలిప్పుడైమై కణ్డాయ్ అరఙ్గమానకరుళానే!"** (ఆశ్రితసంరక్షణార్థము శ్రీరంగమున నిత్యవాసమును చేయువాడా ! ముల్లోకములను ప్రళయకాలమున ఆరగించి, మఱల సృష్టించిన జగత్కారణభూతుడా ! నీ నామమును ఆచార్యముఖమున అభ్యసించిన బలాతిశముచే పంచేంద్రియములను తగని విషయములలో వ్యాపించకుండ నిరోధించి, పాపసమూహములను నిశ్శేషముగా పోగొట్టి, యముని తలపైన, వాని దూతల శిరస్సులపైన "నావల్ ! నావల్ !" అను జయజయ ధ్వనిని ఉచ్చరించుచు సంచరించుచున్నాము) అనియును, **"పచ్చై మామలైపోల్ మేని పవళవాయ్ కమల చ్చెఙ్గణ్ అచ్చుతా! అమరరేఱే! ఆయర్తమ్ కొళున్దే! ఎన్నుమ్, ఇచ్చువై తవిర యాన్ పోయ్ ఇన్దిరలోక మాళుమ్, అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్ అరఙ్గమానకరుళానే!"** (శ్రీరంగనాయకా ! గొప్ప మరతకపర్వతమువంటి తిరుమేనును, పగడమువంటి అధరమును, తామరలవంటి ఎఱ్ఱని నేత్రములను గల, ఆశ్రితులను విడువని అచ్యుతా ! నిత్యసూరినిర్వాహకా ! గోపాలురకు, గోవులకు నియామకుడా ! అని

ఈ విధముగా అనుభవించు రసమును విడచి, నేను చాలా దూరము పోయి, ఇంద్రాది లోకములను పాలించుటవంటి ఆ భోగములు లభించినను వానిని కోరను.) అనియును, "మొయ్త్త వల్ వినైయుళ్ నిన్ఱు మూన్ఱెఴుత్తుడైయ పేరాల్ కత్తిరబన్దు మన్ఱే పరాఙ్కతి కణ్డుకొణ్డాన్" (దట్టమైన ఏనాటికి నశింపని పాపములనుండి మూడక్షరములను కల "గోవిన్దా !" అను తిరునామాను సంధానముచే విడివడి క్షేత్రబంధువు పరమపదమును పొందెను.) అనియును, "నమనుమ్ ముఙ్కలనుమ్ పేశ నరకిల్ నిన్ఱార్కళ్ కేట్క నరకమే శువర్క్కమాకుమ్ నామఙ్గళుడైయ నమ్బి" (యమధర్మరాజు, ముద్గలమహర్షి భగవన్నామములనుగూర్చి సంభాషించగా, నరకములోనున్నవారు ఆ సంభాషణను వినగా ఆ నరకముకూడ స్వర్గమైనట్టి నామములను కల పూర్ణుడు) అనియును తొణ్డరడిప్పొడియాఴ్వార్లు తిరునామసంకీర్తన వైభవమును తిరుమాలై ప్రబంధములో పలు మార్లు వివరించిరి. తిరుమఙ్గైయాఴ్వార్లును పెరియతిరుమొఴి ప్రబంధములోని మొదటి శతకములోని మొదటిదశకములో "నారాయణా ఎన్నుమ్ నామమ్" అని పలు రీతులలో పాడిరి కదా!

'ఇత్తిరునామన్దాన్ ప్రయోజనాన్తరపరర్క్కు ప్రయోజనత్తై క్కొడుక్కుమ్, ఉపాయాంతరనిష్ఠర్క్కు ప్పావనమా యిరుక్కుమ్, ప్రపన్నర్క్కు దేహయాత్రాశేషమా యిరుక్కుమ్, ముత్తుప్ప డుమ్ తుఱైయిల్ ముఴుకువార్ ముత్తత్తై క్కొడుత్తు ప్పఴమ్ కొళ్ళువార్కళ్. శెఴుముత్తు వెణ్ణెల్కెన చ్చెన్ఱు మాఱువర్కళితే. విలై యఱియుమ్ శెట్టికళ్పక్కల్ పుకున్దవాతే పెరువిలైయనామ్. శెరుక్కరశర్ ఇత్తై ప్పూణ్డు అనుభవిప్పార్కళ్. అప్పడియే ప్రయోజనాన్తరపరర్క్కుమ్ ఉఱుప్పాయ్, సాధనాంతరనిష్ఠర్క్కుమ్ ఉఱుప్పాయ్, ప్రపన్నర్క్కు స్వయం ప్రయోజనము మాయ్త్తు ఇత్తిరునామ మిరుప్పదు" (ఈ నామము అన్యప్రయోజనములను ఆశించువారికి ఆ ప్రయోజనములను ఇచ్చును. అన్యోపాయములను ఆచరించువారికి పావనమైయుండును. ప్రపన్నులకు దేహయాత్రాశేషమై ఉండును. ముత్యములు దొరుకు రేవులో మునుగువారు ఆ ముత్యములను ఇచ్చి, పండ్లను కొందురు. మంచి ముత్యములను వెన్నకొఱకు వినియోగింతురు కదా ! ఆ ముత్యముల వెలను తెలిసిన వర్తకులవద్దకు పోయినచో వానికి తగిన వెలను కల్గినదగును. దర్పమును కల ప్రభువులు వీనిని కొని ధరించి



ఆనందింతురు. అదేవిధముగా వేఱు ప్రయోజనములను ఆశించువారికిని తగినదై, సాధనాంతరములను అనుష్ఠించువారికిని తగినదై, ప్రపన్నులకుకూడ స్వయం ప్రయోజనమై ఈ తిరునామముండును- అని, "ఇప్పడి చ్చేతనన్ తాన్ మూలైయడియే తిరున్దాలుమ్, అవన్ దోషఙ్గళై ప్పోక్కి మేల్ శొల్లుకిఱ నన్మైకళై క్కొడుక్కుమ్బడి యాయ్త్తు తిరునామత్తినుడైయ ప్రభావ మిరుప్పదు" (ఈ విధముగా ఈ చేతనుడు తాను అధోగతిలో తిరిగినను, అతని దోషములను పోగొట్టి, ఆ పిమ్మట చెప్పబడు మంచిని ఇచ్చునది ఈ తిరునామముయొక్క ప్రభావము) అనియు, "భక్తియినుడైయ దుష్కరతైయోపాది ప్రపత్తినిష్ఠాహేతువాన మహావిశ్వాసముమ్ శిలర్క్కు క్కిట్టుకై యరితాకైయాలే ఇదిల్ ఇఴియ క్కూశినవర్కళుక్కు సర్వాధికారమాన యాదృచ్ఛిక భగవన్నామసంకీర్తనమే చేతనరుడైయ పాపత్తై ప్పోక్కి, సుకృతానుకూలమాక కర్మయోగాదికళిలే మూట్టుదల్, ప్రపత్తియిలే మూట్టుదల్, విరోధియై ప్పోక్కి, ప్రాప్యత్తై కొడుక్కైక్కు త్తానే నిర్వాహకమాకలామ్బడియాన వైభవత్తై ఉడైత్తాయ్త్తు తిరునామత్తినుడైయ వైభవ మిరుప్పదు" (భక్తియొక్క దుష్కరత్వమువలె ప్రపత్తినిష్ఠకు కారణమైన మహావిశ్వాసముకూడ కొందఱికి ఏర్పడుట అరుదు కనుక, ఈ ప్రపత్తిని అనుష్ఠించుటకు సంకోచించినవారికి సర్వాధికారమైన యాదృచ్ఛిక భగవన్నామ సంకీర్తనమే చేతనుల పాపములను పోగొట్టి, పుణ్యములకు అనుకూలముగా కర్మయోగాదులలో ప్రవర్తింపజేయుట, ప్రపత్తిలో ప్రవర్తింపజేయుట, విరోధిని పోగొట్టి ప్రాప్యమును ఇచ్చుటకు తానే నిర్వాహకమగుటవంటి గొప్పతనములను ఈ తిరునామ వైభవమును కల్గియున్నది.) అని పరమకారుణికులగు పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిరి. వీనినన్నిటిని వేదాంతాచార్యులగు భట్టర్కూడ శ్రీసహస్రనామ భాష్యములో పరపక్షప్రతిక్షేపపూర్వకముగా విశదముగా అనుగ్రహించిరి. అభియుక్తాగ్రేసరులగు శ్రీపిళ్ళైలోకాచార్యులవారును "వాచ్యప్రభావమ్పోలన్ఱు వాచకప్రభావమ్, అవన్ దూరస్థనానాలుమ్ ఇదు కిట్టి నిన్ఱు ఉదవుమ్. ద్రౌపదిక్కు ఆపత్తిల్ పుడవై శురన్దదు తిరునామమితే. శొల్లుమ్ క్రమమొఴియ చ్చొన్నాలుమ్ తన్ స్వరూపమ్ కెడనిల్లాదు. ఇదుదాన్ "కులన్దరుమ్" ఎన్గిఱపడియే ఎల్లా అపేక్షితఙ్గళైయుమ్ కొడుక్కుమ్. ఐశ్వర్యకైవల్య భగవల్లాభఙ్గళై ఆశైప్పట్టవర్కళుక్కు అవత్తై క్కొడుక్కుమ్. కర్మజ్ఞానభక్తికళిలే ఇఴిన్దవర్కళుక్కు విరోధియై ప్పోక్కి,

**అవ*ఱ్ఱై* త్తలైక్కట్టి కొడుక్కుమ్. ప్రపత్తియిలే ఇ*ఴి*న్దవర్కళుక్కు స్వరూపజ్ఞానత్తై ప్పిఅప్పిత్తు, క్కాలక్షేపత్తుక్కుమ్, భోగత్తుక్కుమ్ హేతువాయిరుక్కుమ్"** (వాచ్యప్రభావమువంటిది కాదు వాచకప్రభావము. అతడు దూరములోనున్నను ఇది దగ్గర ఉండి సహాయపడును. ద్రౌపదికి ఆపదలో వస్త్రమును అనుగ్రహించినది తిరునామమే కదా ! అనుసంధింపతగిన క్రమమును వీడి పల్కినను తన (జీవుని) స్వరూపమును చెడనివ్వదు. ఇది **"కులమ్ తరుమ్"** అనునట్లు అన్ని కోరికలను ఇచ్చును. ఐశ్వర్య- కైవల్య భగవల్లాభములను ఆశపడినవారికి వానిని ఇచ్చును. కర్మజ్ఞానభక్తులలో ప్రవేశించినవారికి (వాని) విరోధులను పోగొట్టి, వాటిని పూర్తిచేయును. ప్రపత్తిలో ప్రవేశించినవారికి స్వరూపజ్ఞానమును కల్గించి, కాలక్షేపమునకు, భోగమునకు కారణమైయుండును.) అని ముముక్షుప్పడిలో అనుగ్రహించిరి.

ఇక, అమృతముకంటెను తీయనివి అగు ఆచమనసమయములో ఉచ్చరింపబడు అచ్యుతాదినామముల అపూర్వార్థములు కొంతవరకు తెలుపబడు చున్నవి.

## అచ్యుతః

**(అచ్యుతః) - "యస్మాత్ ప్రాప్తా న చ్యవంతే"** అను రీతిలో దాసులను జారవిడువనివాడు. అందఱిని అన్ని సమయములందును రక్షించువాడు అని దీనిభావము. **"యస్మా న్నచ్యుతపూర్వోఽహ మచ్యుత స్తేన కర్మణా"** (దాసులను ఏనాడును విడువకుండనుండువాడను. కావున నేను అచ్యుతుడను అనబడు చున్నాను) అని భగవానుడన్నట్లు శాస్త్రము ఈ నామవ్యుత్పత్తిని తెల్పినది. **(అచ్యుతః)** - దాసులు నిప్పులో పడినను, వారికి కీడు రాకుండునట్లు కాపాడువాడు. **"అఱియుమ్ శెన్దీయై త్త*ఴు*వి అచ్చుత నెన్నుమ్ మెయ్‌వేవాళ్"** అనిరి కదా ఆ*ఴ్వా*ర్లు. **(అచ్యుతః)** - ప్రళయకాలములో జీవులు పడు పలు దుఃఖమునుచూచి సహింపలేక, తన ఉదరమున నుంచుకొని రక్షించువాడు. సృష్టికాలములో అచిత్సములైనున్న వీరిని చూచి, జాలిపడి కరణకళేబరములను (శరీరేంద్రియములను) వారికి ప్రదానముచేయువాడు. **"ఆదు మిల్ కాలత్తైై అచ్చుతన్"** అని ఈ అర్థమును ఆ*ఴ్వా*ర్లు అనుగ్రహించిరి. **(అచ్యుతః)**- తన దాసులను యమదూతల చేతులలో



అప్పగించకుండ కాపాడువాడు. **"అయర వాఙ్గు నమన్‌తమర్క్కు అరు నఞ్జినై అచ్చుతన్ తన్నై"** (మోహమును పొందు రీతిలో ప్రాణములను పట్టి లాగు యమభటులకు పరిహారము లేని విషమువంటివాడు, అచ్యుతుడు) ఆ*ఴ్వా*ర్లు అనిరి. **(అచ్యుతః)** చేతనులరక్షణను వారి చేతులకు అప్పగించకుండ, వారిని రక్షించుటకై వారిలో ఒకడుగా అవతరించువాడు. **"తేవకి తన్ వయి*ఱ్ఱి*ల్ అత్తత్తిన్ పత్తామ్ నాళ్ తోన్ఱియ అచ్చుతన్"** (దేవకిగర్భమున హస్త నక్షత్రమునకు పదియవనాడు అవతరించిన అచ్యుతుడు) అని పెరియా*ఴ్వా*ర్లు. **"అచ్యుతభానునా దేవకీపూర్వసంధ్యాయా మావిర్భూతమ్"** (అచ్యుతుడనెడి సూర్యుడు దేవకి అనెడి ప్రాతఃసంధ్యాకాలములో ఆవిర్భవించెను) అని పరాశరమహర్షియు అనుగ్రహించిరి. **(అచ్యుతః)** - తనపట్ల (ప్రేమను) భక్తిని కలవారిని చేయిజార విడువనివాడు. **"అరిముక నచ్చుతన్ కైమేల్ ఎన్ కై వైత్తు"** (సింహముఖమును కల అచ్యుతుడు తన చేతిపై నా చేతిని వైచి) అని గోదాదేవి నాయ్చ్చియార్ తిరుమొ*ఴి*లో పల్కిరికదా !

**(అచ్యుతః) - "శంఖచక్రగదాపాణే ! ద్వారకానిలయాచ్యుత!"** (శంఖచక్రగదలను చేతిలో దాల్చినవాడా! ద్వారకను నివాసముగా కలవాడా! దాసుల చేయి విడువని అచ్యుతా!) అని పిలిచిన ద్రౌపదికి వస్త్రప్రదానము చేసినది ఈ తిరునామమే కదా ! **(అచ్యుతః) - "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన"** (మైత్రి అనెడి వేషముతో నన్ను చేరినవారినికూడ నేను ఏనాడు విడువను) అనియు, **"ఆనయైనం హరిశ్రేష్ఠ ! దత్తమస్యాభయం మయా, విభీషణో వా సుగ్రీవ ! యది వా రావణ స్స్వయమ్"** (వానర ప్రభువగు సుగ్రీవా! ఇతడు విభీషణుడైనను, రావణుడైనను, ఇతనికి నేను అభయ మిచ్చితిని. నీవు ఇతనిని పిలుచుకొని రమ్ము) అనియు, **"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ"** (ఒక మాఱు నన్ను శరణు పొందినవానికిని, నీ దాసుడను నేనని యాచించువానికిని, సకల ప్రాణులనుండి అభయమును ఇచ్చెదను. ఇదియే నా వ్రతము) అనియు ఆశ్రయించినవారిని రక్షించుటయే వ్రతముగా కల శ్రీరామునిగా అవతరించినవాడు. **"అచ్చుతన్‌తన్నై త్తయరతఙ్కు మకన్‌తన్నై యన్ఱి మ*ఱ్ఱి*లేన్ తఞ్జమాకవే"** (అచ్యుతుడు, దశరథపుత్రుడు తప్ప వేఱొకనిని రక్షకునిగా కలవాడను కాను) అని శ్రీశఠకోపులును పల్కిరికదా!

**(అచ్యుతః)- "అచ్యుతభానునా ఆవిర్భూతమ్", 'తేవకితన్ వయిఱ్ఱిల్ తోన్టియ అచ్చుతన్"** (దేవకి గర్భమున అవతరించిన అచ్యుతుడు) అను రీతిలో చేతనులను చేయి విడువనివాడు కావున కృష్ణుడై అవతరించి, **"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"** (అన్ని మోక్షసాధనములను సవాసనగా విడచి, నన్నే శరణు పొందుము. నేను నిన్ను అన్ని పాపములనుండి విడిపింతును. దుఃఖింపకుము) అని పల్కినవాడు. **(అచ్యుతః)-** స్వాశ్రితులను అజ్ఞాన- అన్యథాజ్ఞాన- విపరీత జ్ఞానములను పొందకుండ, వాటి బారినుండి కాపాడువాడు. **"నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత"** (అచ్యుతా! విపరీతజ్ఞానమగు మోహము నశించినది. నీ కృపతో నిజమైన జ్ఞానము నాచే పొందబడినది) అని కదా అర్జునుని మాట.

**(అచ్యుతః)-** ఈ లోకమునుండి ముక్తిని పొందిన ముక్తులను, నిత్యసూరులను, **"పుణై కొడుక్కిలుమ్ పోకవొట్టారే"** (నిచ్చెనను ఇచ్చినను పోనివ్వరు) అనునట్లు అచటనుండి (పరమపదమునుండి) పోనివ్వనివాడు. **"అచ్చుతన్ ..... అనన్దన్ తన్మేల్ నణ్ణి నన్గు ఉఱుకిన్ఱానై...."** (అచ్యుతుడు .... అనంతునిపై సమీపించి చక్కగా పరుండినవాడు) అని నమ్మాళ్వార్లు, **"అచ్చమ్ నోయోడల్లల్ పల్ పిఱన్ద వాయ మూప్పివై వైత్త శిన్దై వైత్త వాక్కై మాఱ్ఱి వానిలేఱ్ఱువాన్ అచ్చుదన్ అనన్ద కీర్త్తి ఆది యన్ద మిల్లవన్ నచ్చరావణై క్కిడన్ద నాదన్"** (భయము, శరీరవ్యాధితో కూడిన మనోవ్యాధి, అపాయములకు స్థానమైన వార్ధకము, పలు రీతులలోని జన్మలు - అను వీనిని అనుభవించుటకై గల మనస్సును, పూర్వము పేర్కొన్నవానికి ఆశ్రయమైన శరీరమును నశింపజేసి, పరమపదమునకు చేర్చువాడు, ఆశ్రితులను ఏనాడూ విడువని అచ్యుతుడు, అంతులేని కీర్తిని కలవాడు, ఆద్యంతము లేనివాడు, విరోధులపై విషమును ఉమియు ఆదిశేషుని పడుకగా గల సర్వస్వామి) అని తిరుమళిశై యాళ్వార్లను, **"అచ్చుతా! అమరరేఱే!"** (అచ్యుతా ! నిత్యసూరి నిర్వాహకా!)అని తొణ్డరడిప్పొడి యాళ్వార్లు ఈ అర్థమును అనుసంధించిరి.

**(అచ్యుతః)-** ఈ నామమువలన ఆశ్రితులకు దుఃఖములు కల్గినపుడు వారిని విడిచిపోవు రుద్రాదులుకంటే వ్యావృత్తి చెప్పబడుచున్నది. కావున **"శివమ్"** అని చెప్పిన నారాయణానువాకమును ఇది రుద్రుని తెలుపు పదము కాదు అని తెల్పుటకై **"అచ్యుతమ్"** అని వెంటనే పఠించినది కదా ! **"పరి విన్ది వాణనై క్కాత్తు**



**మెన్టెన్ఱు పడైయెడుమ్ వన్దెదిర్న్ద, తిరిపురమ్ శెఱ్ఱవనుమ్ మకనుమ్ పిన్నుమ్ అజ్గియుమ్ పోర్ తొలైయ, పొరు శిఱై పుళ్ళై క్కడావియ మాయనై ఆయనై పొఱ్చక్కరత్తరియనై అచ్చుతనై పఱ్ఱి యాన్ ఇఱైయేనుమ్ ఇడరిలేనే"** (కొంచమైనను శ్రమ లేకుండ బాణాసురుని రక్షించెదను- అని తలచి అపుడు సాయుధుడై వచ్చి ఎదిరించిన త్రిపురారి అయిన రుద్రుడు, అతని కుమారుడు కుమారస్వామి, మఱియు అగ్ని ఓడిపోవునట్లు యుద్ధమును చేయుచున్న ఱెక్కలను కల గరుత్మంతుని నడపించిన ఆశ్చర్యభూతుడు, గోపాలుడు, అందమైన చక్రాయుధమును కలవాడు, శత్రువులను జయించువాడును అగు అచ్యుతుని ఆశ్రయించి నేను కొంచెముకూడా దుఃఖమును కలవాడను కాను) అని **"వేదమ్ తమిళ్ శెయ్ద మాఱన్"** గా ప్రసిద్ధిచెందిన నమ్మాళ్వార్లును ఈ విషయమును తెలిపిరి. **(అచ్యుతః)-** "ఆశ్రితులను నశింపనీయనివాడు" అను ఈ గొప్ప గుణమును తెలుపు తిరునామమగుటచే, దీనిని వేదము, వైదికులు, భక్తులును మిక్కిలి ఆదరించిరి. ఆళ్వార్లు ఈ నామమును ఆదరించిన విధము పూర్వమే వివరింపబడినది. **"యన్నామ భగవాన్ బ్రహ్మా జానాతి పరమం పదమ్, తన్నతాస్మ జగద్ధామ తవ సర్వగతాచ్యుత"** (అచ్యుతా! సర్వవ్యాపీ ! గొప్ప ప్రాప్యమగు ఏ నీ స్వరూపమును భగవానుడగు బ్రహ్మకూడ తెలియలేడో, లోకమునకంతటికిని నివాసస్థానమగు నీయొక్క ఆ స్వరూపమునకు నమస్కరింతుము) అనుచు ప్రయోజనాంతరపరులైన దేవతలు, **"సర్వేశ ! సర్వభూతాత్మన్ ! సర్వ ! సర్వాశ్రయాచ్యుత"** అని వారికి నాయకుడగు బ్రహ్మ, **"అవలోకనదానేన భూయో మాం పాలయాచ్యుత"** అని అనన్యప్రయోజనుడగు ప్రహ్లాదాళ్వాన్, **"ద్వారకా నిలయాచ్యుత"** అని ద్రౌపది, **"త్వత్ప్రసాదాన్మయాచ్యుత"** అని నరుడగు అర్జునుడు, **"హతవీర్యో హతవీక్షో దమితోఽహం త్వయాఽచ్యుత"** అని కాళియుడును ఈ తిరునామమును అనుసంధించిరికదా ! **"తీర్న్ద అడియవర్తమ్మై త్తిర్త్తి ప్పణికొళ్ళవల్ల ఆర్న్ద పుకళ్ అచ్చుతన్"** (దృఢమైన నమ్మకమును కల భక్తులను సంస్కరించి, వారినుండి సేవలను స్వీకరించగలవాడు, పూర్ణమైన కీర్తిని కలవాడు, భక్తుల చేతిని విడువని అచ్యుతుడు) అను నమ్మాళ్వార్లు శ్రీసూక్తి ఈ వ్యుత్పత్తిని అనుసంధించుచున్నది.

ఇంతవరకు అచ్యుతనామమునకు "దాసుల చేయి విడువనివాడు'' అను అర్థము వివరింపబడినది. ఇక, నశింపని స్వరూపరూపగుణవిభూతులను కలవాడు అను ఈ నామముయొక్క అర్థము వివరింపబడుచున్నది.

**(అచ్యుతః)** - **"న చ్యవతే ఇత్యచ్యుతః"** అను రీతిలో బ్రహ్మరుద్రాదులవలె కాక, ఏవిధముగా నైనను నాశము లేనివాడు. **"చ్యవనోత్పత్తియుక్తేషు బ్రహ్మేంద్ర వరుణాదిషు, యస్మా న్న చ్యవతే స్థానాత్ తస్మాత్ సంకీర్త్యసేఽచ్యుతః"** (భ్రంశము చెందుట అనెడి మరణము, జన్మ -అను వీనిని కల బ్రహ్మ, ఇంద్రుడు, వరుణుడు మొదలగు దేవతలలో నీవు నీ స్థానమునుండి భ్రంశము లేనివాడవగుటచే నీవు అచ్యుతుడవనబడుచున్నావు) అని శాస్త్రము తెల్పినది. **"జాయతేఽస్తి, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతి ఇతి షడ్భావవికారహితత్వాదచ్యుతః"** (పుట్టుచున్నాడు, అస్తిత్వమును కల్గియున్నాడు, వృద్ధిచెందుచున్నాడు, మాఱుచున్నాడు. క్షీణించుచున్నాడు, నశించుచున్నాడు- అను ఆఱు వికారములను లేనివాడగుటచే అచ్యుతుడనబడుచున్నాడు) అను శంకరభాష్యము ప్రకారము ఇచట వినాశమును పల్కినది షడ్భావవికారములకును ఉపలక్షణము అని చెప్పవచ్చును. ఆళ్వార్లును ఈ అర్థమును పలు చోట్ల అనుగ్రహించిరి. **"పచ్చై మామలైపోల్ మేని పవళవాయ్ కమలచ్చెజ్గణ్ అచ్చుతా!"** (పచ్చని గొప్ప పర్వతమువంటి తిరుమేనిని కలవాడా ! పగడమువంటి అధరమును కలవాడా ! కమలములవంటి ఎఱ్ఱని నేత్రములను కలవాడా ! నిత్యసూరినిర్వాహకుడా !) అనుచు తొణ్డరడిప్పొడియాళ్వార్ నశింపని దివ్యమంగళవిగ్రహమును కలవాడని సూచించిరి. **"అచ్చుదన్ అనన్త కీర్త్తి"** అని తిరుమళిశైప్పిరాన్. **"ఆర్న్ద పుకళ్ అచ్చుతన్"** (పూర్ణమైన విస్తరించిన కీర్తిని కల అచ్యుతుడు) అని నమ్మాళ్వార్లును నశింపని కీర్తిని కలవాడనుచు అచ్యుతశబ్దమును వ్యాఖ్యానించిరి. **"శంఖచక్రగదాపాణే ! ద్వారకానిలయాచ్యుత''** అని ద్రౌపదియు సర్వేశ్వరుడు నిత్యవిభూతిలో, లీలావిభూతిలో వేంచేసియుండు స్థితికి ఏనాడు నాశము లేదని తెల్పినది. **(అచ్యుతః)** - సకలచేతనాచేతనములలో దేనిని విడువక అన్నిటిలో వ్యాపించియు, ధరించియు నుండువాడు అను అర్థమునుకూడా చెప్పవచ్చును. దీనిచే సర్వవ్యాపకత్వము, సర్వధారకత్వమును చెప్పబడినవి. "ఆశ్రితులను నశింపకుండ రక్షించువాడు'' అను అర్థమును తెలుపునది అగుటచేతను, ఇంకను పలు అరుదైన అర్థములను



కల్గియుండుట చేతను, వేదముచేతను, ఇతిహాసపురాణముచే, ఆళ్వార్లచే మిక్కిలి ఆదరింపబడుటచేతను ఈ తిరునామము ఆచమనము ఆరంభములో అనుసంధింపబడుచున్నది.

ఆళ్వార్ల శ్రీసూక్తులకు పెరియవాచ్చాన్‌పిళ్ళై మొదలగు మహాచార్యులు వివరింపని కొన్ని అర్థములుకూడ ఇచట చెప్పబడినవే ! అవి ఎట్లు పొసగును? అను ప్రశ్నను కొందఱు అడుగవచ్చును. అందులకు సమాధానము ఏమనగా- ఆళ్వార్లు సాయించిన, లోతైన సముద్రమువంటి శ్రీసూక్తులలోని భావములనెడి రత్నములను అన్నిటిని గ్రంథస్థము చేయుట సాధ్యము కాని పని. కావున మన పూర్వాచార్యులు వానిలోని సారమైన అర్థములను మాత్రము ఎత్తి చూపిరి. ఆ ఆళ్వార్ల, ఆచార్యుల శ్రీసూక్తులకు అవిరుద్ధముగా నున్నవి, ప్రకరణానుగుణముగా నున్నవి అగు అర్థములను స్వీకరించుటలో తప్పు లేదుకదా! ఆళ్వార్లయొక్క అమృతముకంటె తీయని శ్రీసూక్తులలోని గంభీరార్థములు ఇంతియేనని పరిచ్ఛేదించి ఎవరు పూర్తిగా తెలియగలరు ?

## అనంతః

ఇకపై, **"అనంతః"** అను నామముయొక్క అరుదైన అర్థములు కొన్ని తెలుపబడును. ఈ తిరునామము అచ్యుతనామమువలెనే వేదముచే ఆదరింపబడినది. **"అచ్చుతన్ అనన్తకీర్త్తి"** (అచ్యుతుడు, అంతులేని కీర్తిని కలవాడు) అని అచ్యుత నామమునకు అర్థమును అనుగ్రహించిన తిరుమళిశైప్పిరాన్ **"ఆదియన్త మిల్లవన్"** (ఆది, అంతము లేనివాడు) అనుచు అనంతనామమును పిమ్మట వివరించిరి. నమ్మాళ్వార్లును **"అణ్ణలై అచ్చుదనై అనన్దనై"** అని ఈ రెండు తిరునామములను కలిపి అనుసంధించిరి. **"అచ్యుతః"** అను తిరునామము ఆశ్రితులను నశింపనీయనివాడని వివరించుచున్నది. ఆశ్రితులను చేయివిడువకుండుటకై అనేక అవతారములను ఎత్తియు, తన అవధి లేని గుణములను ప్రకటించియు, అన్నిటియందు వ్యాపించియు ప్రకాశించు వాడనెడి అర్థమును ఈ అనంతనామము తెలుపుచున్నది. **"గంధర్వాప్సరసస్సిద్ధాః కిన్నరోరగచారణాః, నాంతం గుణానాం గచ్ఛంతి తేనానంతోఽయ మవ్యయః"** (వి.పు. 2-5-24) (గంధర్వులు, అప్సరసలు, సిద్ధులు, కిన్నరులు, నాగులు,

చారణులు- అను అందఱును వీని గుణముల అంతమును చూడలేరు. అందుచే ఇతడు అనంతుడనబడుచున్నాడు) అని శ్రీవిష్ణుపురాణమునందు అనంతశబ్దార్థము తెలుపబడినది. దీనినిబట్టి గుణములచేతను, (శరీరము) దివ్యమంగళవిగ్రహముల చేతను, ఐశ్వర్యముచేతను అంతు లేనివాడు కావున అనంతుడని చెప్పబడు చున్నాడు- అని తెలియుచున్నది. **"నాస్య దేశకాలవస్తుతోఽవధయః సంతి ఇతి అనంతః"** అని భట్టర్ ఈ నామమును వివరించిరి.

**"నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షిశిరోరుబాహవే, సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటీయుగధారిణే నమః"** (లెక్కలేనన్ని శరీరములను కలవాడు, అంతులేని పాదములను, కన్నులను, శిరస్సులను, ఊరువులను, బాహువులను కలవాడు, అవధి లేని నామములను కలవాడు, నిత్యుడు, పురుషుడును, లెక్కలేనన్ని యుగములను ధరించువాడును అగు అనంతునకు నమస్కారము) అని బ్రహ్మచే అనంతుడను తిరునామముయొక్క అర్థము అనుసంధింపబడినది. **(అనంతః)** - కాలముచేతను, దేశముచేతను, వస్తువుచేతను పరిచ్ఛేదము లేని స్వరూపమును కలవాడు. **"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"** (బ్రహ్మము వికారరహితము, జ్ఞానస్వరూపము, త్రివిధపరిచ్ఛేద రహితమునై యున్నది) **"అథైతస్యైవాంతో నాస్తి యత్ బ్రహ్మ"** (బ్రహ్మ మనునది ఏది కలదో అది అంతు లేనిది) **"అనంతం సముద్రేఽంతమ్"** (పాలకడలిలో తూగునట్టి అనంతుని) అని వేదములందును, **"నాస్త్యంతో విస్తరస్య మే"** (నా ఐశ్వర్య విస్తృతికి అంతము లేదు) అని గీతలో. **"అన్దమిల్ పుకழ் అనన్దపురనకరాది"** అని, **"కణక్కఱు నలత్తనన్ అన్దమిలాది"** అని, **"ఆదియన్ద మిల్లవన్"**, **'అచ్చుదనై అనన్దనై'** అని ఆழ்వార్ల చేతను అనుగ్రహించబడినవి ఈ విషయములో ప్రమాణములు. ఈ అనంతనామముచే ప్రతిపాదింపబడిన గుణవిభూతుల అనంత్యమును విష్ణుసహస్రనామములోని అనంతరనామమగు **"ధనంజయః"** అను నామము వివరించుచున్నది.

## గోవిందః

అనంతరము గోవిందశబ్దార్థము వివరింపబడుచున్నది. **"అనంతః"** అని పురుషోత్తముని పరత్వము చెప్పబడినది. అట్టి మహిమను కలవానిని అతిహీనులమగు మనకు దరిచేర వీలగునా ? అని ఆశ్రితులు భయపడకుండుటకు "కుడి చేయి



ఏదో, ఎడమ చేయి ఏదో తెలియని గోపాలురతో, ఎట్టి వివేకము లేని పశువులతో ఏ భేదము లేకుండ కలసి వర్తించువాడను అర్థమును కల ఈ గోవింద నామార్థమికపై ఘోషింపబడుచున్నది. **"అచ్చుతా! అమరరేఱే !"** అని అచ్యుత, అనంత శబ్దార్థములను అనుసంధించిన తొణ్డరడిప్పొడియాழ்వార్లను **"ఆయర్తమ్ కొழுన్దే!"**అనుచు పిమ్మట గోవిందశబ్దార్థమును అనుగ్రహించిరికదా ! (గోవిందః)- **"గావః విందతి"** (పశువులను పొందుచున్నాడు) అను వ్యుత్పత్తిప్రకారము నిత్యసూరుల నాథుడైయున్న స్థితిలో నిలుకడగా నుండలేక, జ్ఞానహీనములగు పశువులదరికి చేరుటకై కృష్ణుడై అవతరించినవాడు- అను అర్థము ఏర్పడును. **"అహం కిలేంద్రో దేహినాం త్వం గవా మింద్రతాం గతః, గోవింద ఇతి లోకా స్త్వాం స్తోష్యంతి భువి శాశ్వతమ్"** (నేను దేవతలకందఱకును ఇంద్రుడనై యున్నాను, నీవు పశువులకు ఇంద్రుడవైయుండు స్వభావమును నీకు నీవే పొందితివి. అందుచే ఈ లోకములోనివారు నిన్ను గోవిందుడని శాశ్వతముగా స్తుతింతురు) అని హరివంశములో గోవర్ధనధారియగు గోపాలునిగూర్చి దేవేంద్రుడు స్తుతించెనుకదా ! **"గావః విందంత్యేనమ్"** అనునట్లు పశువులకు శరణము అను అర్థమునుకూడ గ్రహింపవచ్చును. **"శట్టిత్తయిరుమ్ తడావినిల్ వెణ్ణెయు మున్ పట్టిక్కన్డే!"** (చట్టిలో పెట్టి ఉంచిన పెరుగును, గుండిగలలో పెట్టిన వెన్నను దొంగతనముగా తిను గిత్తవంటివాడా) అని, **"పట్టి మేయ్‌న్దోర్ కారేఱు పలదేవఱ్కోర్‌కీழ் క్కన్దాయ్"** (దొంగతనముగా మేయు కారెద్దువంటివాడు, బలదేవునకు అద్వితీయుడైన అనుజుడు) అనియు అనుగ్రహించిన రీతిలో కదా ఇతడు (గోవిందుడు) పశువులతో ఎట్టి భేదము లేకుండ కలసిపోవును. ఈ మహాగుణమును అనుసంధించిన దివ్యసూరులు మాటిమాటికి దీనిని నోరాఱ కీర్తించిరి. **"కోవిన్దన్ కుణమ్ పాడి ఆవి కాత్తిరుప్పేనే"** (గోవిందుని గుణములను పాడి ప్రాణధారణచేయుదును) అని గోదాదేవి ఈ ఆ గుణానుసంధానమునే తనకు ప్రాణధారకముగా తలచెనుకదా! **"కఱ్ఱినమ్ మెయ్‌క్కిలుమ్ మెయ్‌క్కపెఱ్ఱాన్ కాడువాழ் శాదియుమ్ ఆక ప్పెఱ్ఱాన్, పఱ్ఱియురవిడై ఆప్పు ముణ్డాన్ పావికాళ్ ఉఙ్గళుక్కే చ్చుక్కొలో"** (గోసమూహమును మేపుటయే వృత్తిగా కల్గివాడయినాడు. ఇంటిని వదలి అరణ్యములోనే నివసించు జాతిలో (గోపాలజాతిలో) జన్మించిన వాడయినాడు. వెన్నను దొంగలించుటలోను లెక్కించు పాపిష్ఠివారలారా ! మీకు

ఇవి దూషించుటకు కారణములైనవా ! ఇంతవరకు పల్కిన దూషణములు చాలు. ఇకపై అయినను మీరు అభ్యసించిన శాస్త్రములనుగూర్చి పల్కి, నావలన తిట్లు తినకుండ, పశువులు రక్షింపబడునట్లు గొప్ప శిలావర్షమునుండి వానిని రక్షించి, జయసూచకమైన ఛత్రముగా ఎత్తి పట్టిన గోవర్ధనగిరి సమీపమునకు నన్ను తీసికొనిపొండు.) అనియు, **"కొమ్మై ములైకళ్ ఇడర్ తీర క్కోవిన్దఱ్కు ఓర్ కుఱ్ఱేవల్ ఇమ్మై ప్పిఱవి శెయ్యాదే ఇని ప్పోయ్ చ్చెయ్యుమ్ తవన్దానెన్?"** (వృద్ధిచెంది, దృఢముగా నున్న నా స్తనముల బాధ తీరునట్లు గోవిందునకు అంతరంగకైంకర్యమును ఈ జన్మలో చేయకుండ ఇక ఈ జన్మ తీరిన పిదప వేఱొక లోకమునకు పోయి చేయు తపస్సు ఎందులకు?) అనియు, **"కొఙ్గైత్తల మివై నోక్కి క్కాణీర్ ! కోవిన్దనుక్కల్లాల్ వాయిల్ పోకా"** (నా స్తనతటములను గమనించి చూడుడు. అవి గోవిందుని కొఱకు తప్ప వేఱొకరికొఱకు- అను మాట నోటరాదు) అనియు పల్కు రీతిలోకదా గోదాదేవి గోవిందునిపట్ల ప్రేమను పొందినది.

**"కూట్టిలిరున్ద కిళి యెప్పోదుమ్ కోవిన్దా! కోవిన్దా ! ఎన్ఱఴైక్కుమ్"** (గూటిలోనున్న చిలుక ఎల్లప్పుడు గోవిందా ! గోవిందా ! అని పిలచును) అని ఈమె చిలుకయు ఈ తిరునామమునే కదా నోరార కీర్తించును. నమ్మాఴ్వార్లును **"కోవిన్దన్ కుడక్కూత్తన్ కోవలన్ ఎన్ఱెన్ఱే కునిత్తు"** (గోవిందుడు, కుంభనృత్యమును చేసినవాడు, గోపాలుడు- అని ఈ విధముగా పల్కి, నమస్కరించి) అని తమకు ఈ తిరునామములో తమకు గల అభినివేశమును ప్రకటించిరి. **"గోవిన్దేతి యదాక్రందత్ కృష్ణా మాం దూరవాసినమ్, ఋణం ప్రవృద్ధ మివ మే హృదయా న్నాపసర్పతి"** (మిక్కిలి కడుదూరములోనున్న నన్ను గోవిందా! అనుచు ద్రౌపది పిలుచుట వడ్డి పెరిగిన అప్పువలె నా మనస్సులోనుండి ఇప్పటికిని బయటకు పోవుటలేదు) అనునట్లు నామాంతరములను ఎన్నిటినో ఆమె ఉచ్చరించినను, స్వామి ఉల్లమున నాటుకొని, గాయపఱచినది ఈ తిరునామమేకదా !

వాస్తవమున ఈ తిరునామముయొక్క మహిమనుగూర్చి విస్తరించినచో వేఱొక మహాభారతమే అగును. **(గోవిందః)** గోశబ్దము భూమినికూడ తెలుపును, కావున **"గాం విందతి"** అని భూమిని జలమునుండి ఉద్ధరించిన వరాహమూర్తిని చెప్పుచున్నదనియు అర్థమును గ్రహింపవచ్చును. **"మహావరాహో గోవిందః"** అని



ఈ అర్థము శ్రీవిష్ణుసహస్రనామమునందుకూడ ఆదరింపబడినది. **"నష్టాం వై ధరణీం పూర్వ మవిందం వై గుహాగతామ్, గోవింద ఇతి తేనాహం దేవై ర్వాగ్భి రభిష్టుతః"** (పాతాళములో మఱుగుపఱచబడిన భూమిని పూర్వమొకానొక సమయమున నేను వెదకి పొందితిని. కావున, దేవతలచే గోవిందుడని స్తోత్రము చేయబడినవాడనైతిని) అని భారతములో మోక్షధర్మమునందు భగవానునిచేతనే చెప్పడినది. ఇందుచే ఆపత్కాలమునందు రక్ష్యవస్తువుయొక్క అపేక్షను ఆశింపక, ఎదురుచూడక, వారిని చేరి, తన గొప్పతనమునకు తగని రూపమును సైతము పరిగ్రహించి, రక్షించు భగవానుని మహాగుణము వర్ణింపబడినది. **"ఉద్ధృతాఽసి వరాహేణ కృష్ణేన శతబాహునా"** (భూదేవీ! నూఱు బాహువులను కలవాడు, ఆనందస్వరూపియును అగు వరాహమూర్తిచే నీవు ఉద్ధరింపబడినదానవైయున్నావు) అని సంస్కృతవేదమునందును, **"ఈన చ్చొల్లాయినుమాక ఎఱి తిరై వైయమ్ ముఱ్ఱుమ్ ఏనత్తురువాయ్ ఇడన్ద పిరాన్, ఇరుమ్ కఱ్పకమ్ శేర్ వానత్తవర్క్కుమ్ అల్లాదవర్క్కుమ్ మఱ్ఱెల్లాయవర్క్కుమ్ ఞానప్పిరానై యల్లా లిల్లై నాన్ కణ్డ నల్లదువే"** (నేను పల్కునది హీనమైన మాటగా మీకు తోచినను అట్లే కానిండు. ఎగసిపడు కెరటములను కల, సముద్రపరివేష్ఠితమైన లోకమునంతటిని ప్రళయకాలమున మహావరాహమై, అండభిత్తినుండి పట్టు విడపించి ఎత్తిన ఉపకారకుడగు పరిపూర్ణజ్ఞానస్వరూపుడైన భగవానుడు తప్ప, గొప్ప కల్పవృక్షమును కల దేవతలకు, మిగిలిన నిత్యసూరులకు, మనుష్యాదులకు వేఱొక ఉజ్జీవనము లేదు. నేను చూచిన మంచి ఇదియే) అని తిరువిరుత్తప్రబంధములో, **"నీలవరై ఇరణ్డు పిఱై కవ్వి నిమిర్న్దదొప్ప క్కోల వరాక మొన్ఱాయ్ నిలమ్ కోట్టిడై క్కొణ్డ ఎన్దాయ్"** (నల్లని పర్వతము రెండు చంద్రవంకలను నోటితో కఱచుకొని లేచినట్లున్న, అందమైన, అద్వితీయమైన మహావరాహమై, భూమిని కొమ్ముపై ధరించి వచ్చిన నా స్వామీ !) అని తిరువాయ్మొఴిలోను, **"పాశి తూర్త్తు క్కిడన్ద పార్మకట్కు ప్పణ్డొరు మాశుడమ్బిల్ నీర్ వారా మాన మిలా ప్పన్ఱియామ్ తేశుడైయ తిరువరఙ్గచ్చెల్వనార్ పేశియిరుప్పనకళ్ పేర్క్కవుమ్ పేరావే"** (పూర్వము ఒకానొక సమయమున పాచి పట్టి పడిఉన్న భూదేవికొఱకు బురద అంటుకొనిన శరీరమున జలము కారునట్టి, ఏ లజ్జయు (ప్రమాణమును) లేనట్టి మహావరాహరూపమును దాల్చినవాడు, గొప్ప తేజస్సును కల స్వామి అయిన శ్రీరంగనాథుడు పూర్వము

పల్కిన మాటలు మనస్సులోనుండి మఱచిపోవుదమన్నను వీలుకాదే) అని నాయ్చ్చియార్ తిరువెమొళ్రిలోను- ఇట్లు ద్రావిడవేదమునందును ఈ స్వామియొక్క మహిమ ప్రశంసింపబడినవికదా !

**"గా రేవైషా తథా వాణీ తాం చ యద్విందతే భవాన్, గోవింద స్తు తతో దేవ ! మునిభిః కథ్యతే భవాన్"** (దేవా ! శబ్దము "గౌః" అని చెప్పబడుచున్నది. అర్థములనన్నిటిని నీవు పొందుటచే నీవు గోవిందుడవని మునులచే చెప్పబడుచున్నావు) అను నిర్వచనానుసారము సర్వశబ్దవాచ్యుడను అర్థముకూడ ఈ తిరునామమునకు చెప్పవచ్చును. **"శొల్లినాల్ తొడర్చ్చి నీ, శొల్లప్పడుమ్ పొరుళ్ నీ"** (వేదాంత శాస్త్రముఖమున వేదైకసమధిగమ్యుడవైన, పరమాత్మవగు నిన్ను తెలిసి దానిని పొందుటకు ఆశపడువారికి ప్రారంభదశలో రుచిని కల్గించువాడవు నీవు. శ్రుతి స్మృత్యాదులలో చెప్పబడు దేవతలకు ఆత్మవు నీవు) అనుచు తిరుమళ్రిశైయాళ్వార్లు ఈ అర్థమును తిరుచ్చందవిరుత్త ప్రబంధమున అనుసంధించిరి.

**(గోవిందః)**- గోశబ్దము వేదవాక్యములను నిర్దేశించుచున్నదని గ్రహించి, గోవిందనామమునకు వేదవాక్యములచే ప్రతిపాదింపబడువాడను అర్థమును కూడ చెప్పవచ్చును. **"అచ్చుమ్... ఏర్రిఙువాన్ అచ్చుదన్ అనన్త కీర్త్తి ఆది యన్త మిల్లవన్ నచ్చరావణైక్కిడన్ద నాదన్"** (అచ్యుతుడు, అనంతమైన కీర్తిని కలవాడు, ఆది, అంతము లేనివాడు, విషమును గ్రక్కు ఆదిశేషునిపై పరుండినవాడు) (తిరుచ్చంద- 117) అని అచ్యుత, అనంతనామములకు అర్థమును వివరించిన తిరుమళ్రిశైయాళ్వార్లు **"వేదకీతనై"** అనుచు గోవిందశబ్దార్థమును అనుగ్రహించిరి. **(గోవిందః)** - ఏ దేవతనుగూర్చి స్తోత్రము చేసినను ఆ స్తోత్రములన్నియు భగవానునే చేరుటచే గోవిందుడనబడుచున్నాడనియు చెప్పవచ్చును. **"నుమ్ ఇన్ కవికొణ్డు నుమ్ నుమ్ ఇట్టా దెయ్వ మేత్తినాల్, శెమ్మిన్ శుడర్ముడి ఎన్ తిరుమాలుక్కు చ్చేరుమే"** (మీ కవిత్వముతో మీ మీ ఇష్టదైవములను స్తుతించినచో, అవి చక్కగా ప్రకాశించు, తేజోమయమైన కిరీటమును కల నా శ్రియఃపతికే చేరును) అని నమ్మాళ్వార్లు సాయించిరికదా! **(గోవిందః)** గోశబ్దము కాంతిని చెప్పుచున్నదన్నచో, పరంజ్యోతిస్స్వరూపుడను అర్థమునుకూడ చెప్పవచ్చును. **"పరఞ్జోతి నీ పరమాయ్ నిన్నికళ్రన్దు పిన్ మత్రోర్ పరఞ్జోతి యిన్మైయిన్ పడియోవి నికళ్రకిన్ఱ పరఞ్జోతి నిన్నుళ్ళే పడరులకమ్ పడైత్త ఎమ్ పరఞ్జోతి కోవిన్దా! పణ్బురైక్కమాట్టేనే"** (పరాత్పరుడవైన నీవే నిరతిశయ జ్యోతిస్స్వరూపుడవు. నీవు తప్ప వేఱొక శ్రేష్ఠమైన తేజస్సు నిజమునకు లేకపోవుటవలన, ఇంకొక ఉపమానము లేక ప్రకాశించు పరంజ్యోతిస్స్వరూపా ! నీ సంకల్పముతో వ్యాపించియుండు లోకములను సృష్టించి, నాకు సేవను అనుగ్రహించిన గొప్ప తేజోరూపా ! గోవిందా ! నీ ఈ ప్రకారములను వర్ణింప నాకు సాధ్యము కాదు) అనుచు ఈ అర్థమును నమ్మాళ్వార్లు సాయించిరి. **"నారాయణః పరో జ్యోతిః"** అని, **"పరంజ్యోతి రుపసంపద్య"** అని, **"ఆదిత్యవర్ణమ్"** అనియు, **"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతో౽య మగ్నిః, త మేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి"** (ఆ పరమపురుషునకుముందు సూర్యుడుకూడ ప్రకాశింపడు. చంద్రుడు, నక్షత్రములు, ఈ విద్యుత్తును ప్రకాశింపవు. ఇక అగ్నినిగూర్చి చెప్పవలసినదే మున్నది? ప్రకాశించు అతనిని అనుసరించియే అన్నియు వెల్గుచున్నవి. అతని ప్రకాశముచేతనే ఇవి అన్నియు వెల్గుచున్నవి) అని వేదములందు, **"దివి సూర్యసహస్రస్య భవే ద్యుగపదుత్థితా, యది భాః సదృశీ సా స్యాత్ భాస స్తస్య మహాత్మనః"** (ఆకాశములో ఒకే సమయమున వేయి సూర్యుల వెలుగు ప్రకాశించినచో, ఆ వెల్గు ఆ మహాపురుషుని ప్రకాశముతో సరిపోవును) అని గీతలోను కీర్తింపబడినదికదా ! దేవతల స్తుతులను స్వీకరించువాడను అర్థమును భట్టర్ **"తద్గవాం స్తుతిగిరాం పతిః"** అని తెల్పిరి. ఈ అర్థమును **"తామరైక్కణ్ణనై విణ్ణోర్ పరవుమ్ తలైమకనై"** ఇత్యాది దివ్యసూరిసూక్తులలో గమనించవచ్చును.



## ద్వాదశనామములు

ఇక, యథామతి కేశవాది ద్వాదశనామముల రస్యరహస్యార్థవివరణము చేయబడుచున్నది. ఈ పండ్రెండు నామములను దివ్యసూరులు మిక్కిలి ఆదరించి, అనుసంధించిరి. **"పారార్ తొల్ పుకళ్రాన్ పుదువై మన్నన్ పన్నిరునామత్తాల్ శొన్న ఆరాద అన్దాది"** (భూమి అంతయు వ్యాపించిన అనాది అయిన కీర్తిని కలవారు, శ్రీవిల్లిపుత్తూరుకు నాథులు అయిన పెరియాళ్వార్లు ద్వాదశనామములతో పల్కిన,

అనుసంధించిన కొలది తృప్తిని కల్గింపని అందాది) అని, **"పణ్ణిల్పన్నిరునామ పాట్టు అణ్ణల్ తాళ్ అణైవిక్కుమే"** (గానయోగ్యములైన, ద్వాదశాది నామముల క్రమములో అనుగ్రహించిన ఈ పండ్రెండు స్వామి శ్రీపాదములను పొందించును.) అని నమ్మాళ్వార్లను ఈ ద్వాదశనామములను వరుసగా అనుసంధించు పాశురములను అనుగ్రహించిరి. ద్వాదశోర్ధ్వపుండ్రధారణ సమయమునందుకూడ ఈ పండ్రెండు నామములే అనుసంధింపబడుచున్నది. ఈ అంశమును వివరించుచు దేశికులు **"పన్నిరునామమ్"** అను ద్రావిడప్రబంధమును రచించిరి. పురుషోత్తముని అంశమును పొందిన ద్వాదశాదిత్యులకును ఈ పండ్రెండు నామములే పెట్టబడినవి. భగవానునకు పర,వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చ- అను అయిదు అవస్థలు కలవని సకలశ్రుతిస్మృతీహాసపురాణ పాంచరాత్ర శాస్త్రములలో ఘోషింపబడుచున్నది. ఈ అయిదు అవస్థలును ఈ పన్నెండు నామములందు అనుసంధింపబడుచున్నది. **"మాలరి కేశవన్ నారణన్ శీమాదవన్ కోవిన్దన్ వైకున్దన్"** (ఆశ్రితవ్యాముగ్ధుడు, పాపహారి, కేశవుడు, నారాయణుడు, శ్రియఃపతి, గోవిందుడు) అని నమ్మాళ్వార్లు సాయించుటచే కేశవ, నారాయణ, మాధవ, గోవింద నామములు నాల్గును శ్రీవైకుంఠనాథుడు వేంచేసియుండు పరావస్థను తెలుపుచున్నవని తెలియుచున్నది. **"విష్ణుః"** అను తదనంతరనామము అనిరుద్ధనారాయణుడగు వ్యూహమును తెలుపుటద్వారా మిగిలిన వ్యూహములను సూచించుచున్నది. **"మధుసూదన"** నామము ఆ వ్యూహముల చేష్టితములను తెలుపుచున్నది. త్రివిక్రమ, వామన, దామోదర నామములు మూడును విభవావతారములను చెప్పుచున్నవి. శ్రీధరనామము ఆ విభవావతారములందును భగవానుడు లక్ష్మీసహితుడై అంతరించుననుటను చూపుచున్నది. హృషీకేశ నామము అంతర్యామియై యుండి, ఇంద్రియములను నియమించు స్థితిని పేర్కొనుచున్నది. శ్రీధరాది నామములన్నియు తిరుమల మొదలగు దివ్యదేశములందు వేంచేసియున్న శ్రీనివాసాది అర్చామూర్తులను నిర్దేశించుచున్నవి. పద్మనాభనామము ఈ అవతారములకన్నిటికిని మూలకందమైన క్షీరాబ్ధినాథుని చెప్పుచున్నది. ఇట్లు భగవానుని పరవ్యూహాది అయిదు రూపములును ఈ తిరునామములలో అనుభావ్యములు.



## (1) కేశవః

**పురస్తాత్ కేశవః పాతు చక్రీ జాంబూనదప్రభః**

ఇకపై ఈ ద్వాదశనామముల అర్థవిశేషములను కొన్నిటిని గమనించెదము. ముందుగా మొదటిది అగు కేశవనామముయొక్క అర్థగౌరవము విన్నపింపబడుచున్నది. **(కేశవః)-** కకారముచే నిర్దేశింపబడు బ్రహ్మను, ఈశశబ్దముచే చెప్పబడు శివుని సృష్టించినవాడు అని ఈ నామవ్యుత్పత్తి. **"క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినామ్, ఆవామ్ తవాంగే సంభూతౌ తస్మా త్కేశవనామవాన్"** ('కః' అని బ్రహ్మకు పేరు, దేహమునందభిమానమును కల అందఱికిని నేను ఈశ్వరుడను. బ్రహ్మరుద్రులమగు మేము ఇద్దఱము నీ శరీరమునుండి జన్మించితిమి. అందుచే నీవు కేశవుడను నామమును కల్గినవాడవైతివి) అని హరివంశములో శివునిచే చెప్పబడినది. **"నారాయణాత్ బ్రహ్మా జాయతే, నారాయణా ద్రుద్రో జాయతే"** (నారాయణునివలన బ్రహ్మ జన్మించుచున్నాడు, నారాయణునివలన రుద్రుడు జన్మించుచున్నాడు) అను మొదలగు వేదవాక్యములు, మిగిలిన ఇట్టి ప్రమాణములును, **"విణ్ణోర్ తలైవా ! కేశవా !", "తెయ్వ నాన్ముక కొழுముళై ఈన్ఱ ముక్కణీశనొడు తేవు పల నుదలి"** మొదలగు దివ్యసూరిసూక్తులను ఇచట అనుసంధేయములు. **"కః ఇత్యభిఖ్యా తవ నాభిజన్మనః తథా య మీశో భువి కథ్యతే భవః, ఉభే తవాంగా శుభసంభవౌ పురా తతో భవాన్ కేశవ ఇత్యుదీర్యతే"** అను కేశవపంచాశత్ స్తుతిలోని శ్లోకముకూడ ఇచట అనుసంధేయము. **(కేశవః)-** బ్రహ్మను, శివుని తన వశములో నుంచుకొనువాడను అర్థమును చెప్పవచ్చును. **"నారాయణాత్ ప్రజా ప్రజాయంతే, నారాయణాత్ ప్రవర్ధంతే, నారాయణాత్ ప్రలీయంతే"** (బ్రహ్మమొదలగు అందఱును నారాయణునివలన జన్మించుచున్నారు, నారాయణునివలన వృద్ధిజెందుచున్నారు, నారాయణునివలన లయమును పొందుచున్నారు)అని వేదమును పల్కినది. **"కళ్వా ! ఎమ్మైయుమ్ ఏழுలకుమ్ నిన్నుళ్లే తోற்றియ ఇఱైవ ! ఎన్ఱు వెళ్ళేఱన్ నాన్ముకన్ ఇన్దిరన్ వానవర్ పుళ్ళూర్ది కழల్ పణిన్దేత్తువరే"** (నీ మహిమను నీయందే మఱుగుపఱచుకొని కృత్రిమస్వభావుడా ! మమ్ములను, సప్తలోకములను నీ సంకల్పముతో సృష్టించిన స్వామీ ! - అని పల్కి, తెల్లని వృషభమును వాహనముగా కల రుద్రుడు, బ్రహ్మ, ఇంద్రుడు, దేవతలు గరుత్మంతుని వాహనముగా కల

పరమాత్మ శ్రీపాదములను నమస్కరించి స్తుతింతురు) అనియు, **"నెఱ్ఱియుళ్ నిన్టైన్నై యాళుమ్ నిఱైమలర్ పాదజ్గళ్ శూడి కఱ్ఱై త్తుళాయ్ ముడి క్కోల క్కణ్ణపిరానై త్తొళువార్ ఒఱ్ఱై ప్పిఱై యణిన్దానుమ్ నాన్ముకను మిన్దిరనుమ్"** (నా ఫాలములోనుండి నన్ను పాలించు వాని అందమైన పూలవంటి శ్రీపాదములను తమ శిరస్సులపై ఉంచుకొని, కూర్చిన తులసీమాలను కిరీటమును కలవాడు, అందమైనవాడు, ఉపకారకుడు అయిన శ్రీకృష్ణుని చంద్రకళను అలంకరించుకొనిన రుద్రుడు, చతుర్ముఖుడు, ఇంద్రుడు నమస్కరింతురు) అనియును ఆళ్వార్లు ఈ నామముయొక్క అర్థమును వివరించిరి. **"కేశవా! పురుడోత్తమా"** అని పెరియాళ్వార్లును పల్కిరి. ఉత్కృష్టపురుషులగు బ్రహ్మరుద్రాదుకంటే అధికుడని దీని తాత్పర్యము.

**(కేశవః)** - జ్యోతిర్మయుడగు సూర్యుడు మొదలగువారి కిరణములు కేశశబ్దముచే చెప్పబడుచున్నవి. వానిని తన వశములో కలవాడగుటచే కేశవుడనబడు చున్నాడనియు చెప్పవచ్చును. **"అంశవో యే ప్రకాశంతే మమ తే కేశసంజ్ఞితాః, సర్వజ్ఞాః కేశవం తస్మా న్మామాహుః ద్విజసత్తమాః"** (లోకములో ప్రకాశించు నా కిరణములు కేశశబ్దవాచ్యములు. అందుచే అన్నిటిని తెలిసిన బ్రాహ్మణశ్రేష్ఠులు నన్ను కేశవుడనని పిలుచుచున్నారు) అని మహాభారతములో చెప్పబడినది. గోవిందనామవ్యాఖ్యానములోగ్రహింపబడిన "న తత్ర సూర్యో భాతి" ఇత్యాది ప్రమాణములును ఇచట అనుసంధేయములు. **"తిరువడియై నారణనై క్కేశవనై ప్పరఞ్జుడరై"** అని ఆళ్వార్లు కూడ ఈ అర్థమును తెలిపిరి. **(కేశవః) - "కేశాద్వోఽ న్యతరస్యామ్", "భూమనిందాప్రశంసాసు భవంతి మతుబాదయః"** అనెడి వ్యాకరణసూత్రముల ప్రకారము కేశశబ్దముపై 'వః' అను ప్రత్యయము వచ్చి రూపొందిన కేశవనామము, **"ప్రశస్తకేశవాన్"** (పొగడతగిన కేశములను కలవాడు) అను అర్థమునిచ్చును. అనగా- **"య ఏషోఽ న్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః"** (సూర్యుని మధ్యలో స్వర్ణవర్ణుడగు ఏ పురుషుడు ప్రకాశించుచున్నాడో, అతడు బంగారమువంటి ఆకర్షణీయమైన, అందమైన మీసములను, కేశములను కలవాడు) అని వేదముచేతను కీర్తింపబడునట్టి కేశములను కలవాడని అర్థము. **"కాళ్కిన్ట కోళిరుళై చ్చుకిర్న్దిట్ట కొళుమ్ శురుళిన్ ఉళ్ కొణ్డ కోల నన్నూల్ తన్గైకొల్ ? అన్ఱు, మాయన్ కుళల్, విరికిన్ట పూన్దణ్డుళాయ్ విరైనాఱు వన్దెన్నుయిరై క్కొళ్కిన్టవాఱియార్ అన్నైమీర్! కళఱానిఱ్ఱిరే"** (లోకములను గ్రసించునట్టి బలమును కల చీకటిలోని పైపై అసారమైన భాగమును తీసివేసినచో మిగిలి ఉండు సారభూతమైన ఉండలోని సారాంశముతో తీసిన (మిక్కిలి నల్లని) విలక్షణమైన దారముల సమూహమై స్వామికేశములు ఉండునా! కాదు కాదు. వికసించు పూలను కల, చల్లని తులసియొక్క సుగంధము పరిమళించు శ్రీకృష్ణుని కేశములు వచ్చి నా ప్రాణములను అపహరించు తీరును. ఓ తల్లులారా ! మీకు తెలియలేదు. కనుక, నన్ను పరుషభాషణములతో బాధించుచున్నారు) అనియు, **"మున్నముకత్తణియార్ మెయ్ కుళల్కళ్"** (ఫాలభాగములో మిక్కిలి అందమైన, దట్టమైన ముంగురులు) (పెరియా-1-5-5) అనియును, **"శురుణ్డిరుణ్డ కుళల్ తాళ్న్ద ముకత్తాన్"** (గుండ్రని, నల్లని ముంగురులు వేలాడు ముఖమును కలవాడు) (పెరియా-3-6-9) అనియును, **"మైవణ్ణమ్ నఱుఙ్కుఞ్జి కుళల్ పిన్ తాళ"** (కాటుకరంగులోని కేశములు వెనుక భాగమున తారాడుచుండగా) అనియును, **"కుళలళకర్"** ఆళ్వార్లు ఈ కేశసంపదను అనుభవించిరి. **"హిరణ్మయశ్మశ్రు హిరణ్యకేశినం భవంత మాహుః శ్రుతయో మునీశ్వరాః, శరీరిణాం క్లేశవినాశినం తథా తతో భవాన్ కేశవ ఇత్యుదీర్యతే"** అను కేశవపంచాశత్ స్తోత్రములోని శ్లోకము ప్రకృతమున అనుసంధేయము. **(కేశవః)**- దీనిచే చిక్కు తలను కల్గినవారగు ఇతరదైవములకంటె వ్యావృత్తి తెలుపబడినది. **"పింగళజటో దేవః"** అనియు, **"ఒరురువమ్ పొన్నురువమ్ ఒన్ఱు శెన్దీ"** (ఒకరి రూపము (బ్రహ్మరూపము) బంగారు రూపము, ఇంకొకరిది (శివునిది) అగ్నివర్ణము) అని చెప్పునట్టి బ్రహ్మరుద్రుల కేశములవలె చూచువారి కన్నులకు మిఱుమిట్లు గొల్పి, వానిని మండించునవి కాక, **"నీలకుంచితమూర్ధజమ్"** అని, **"కుళలిరుణ్డు శురుణ్డు"** (కేశములు గుండ్రనివిగా, నల్లనివిగా) అనునట్లు దర్శించువారి కన్నులలో చల్లగా, కాటుకను పెట్టినట్లు నల్లనివై యుండునని **"మైవణ్ణమ్"** పాశురవ్యాఖ్యలో కవిధ్వంసనాచార్యులవారు పల్కుట ఇచటను అనుసంధేయము.

**"కేశవన్ పేరిట్టు నీజ్గళ్ తేవి త్తిరుమినో నాయకన్ నారణన్ నమ్మై నరకమ్ పుకాళ్"**, "కెడు మిడరాయ వెల్లామ్ కేశవా వెన్న" అని, "కేశవ నెమ్బెరుమానై

**పాట్టాయ పల పాడి పఴువినైకళ్ పఱ్ఱఱుత్తు**" అని ఇత్యాది దివ్యసూరిసూక్తులు కేశవుని విరోధినిరసనత్వమును తెల్పుచున్నవి. "**మేరుమందరమాత్రోఽఽపి రాశిః పాపస్య కర్మణః కేశవం వైద్య మాసాద్య దుర్వ్యాధి రివ నశ్యతి**", "**నరకే పచ్యమానస్తు యమేన పరిభాషితః, కిం త్వయా నార్చితో దేవః కేశవః క్లేశనాశనః**" (నరకములో వేదనను అనుభవించు మానవుడు- ఓయీ ! నీచే క్లేశములను పోగొట్టు కేశవుడు ఏల అర్చింబడలేదు? అని యమునిచే ప్రశ్నింపబడెను) అని పురాణము పల్కినది. "కేశవః క్లేశనాశనః" అను ఈ సూక్తితాత్పర్యమును "**తాపత్రయాతురరోడు విరహాతురరోడు వాశియఱ సర్వర్క్కుమ్ శ్రమహరమామ్బడికాణ్ తిరుక్కుఴలిన్ పరిమళమ్ మికున్దపడి- కేశవః క్లేశనాశనః - ఎన్నక్కడవదితే. దృష్టిప్రియమా యిరుక్కైయన్టిక్కే, నెజ్జిల్ శ్రమమెల్లామ్ పోమ్బడికాణ్ తిరుక్కుఴలిన్ పరిమళమ్ మికున్దపడి**" (తాపత్రయములచే బాధపడువారు, విరహముతో బాధపడువారు- అను భేదము లేకుండ అందఱికిని శ్రమహరమగునట్లుగాకదా కేశముల పరిమళము అధికముగా నుండును. "కేశవః క్లేశనాశనః" అని అనబడుచున్నది కదా ! దృష్టికి మనోహరముగా నుండుటయేకాక మనస్సులోని శ్రమ అంతయు పోవునట్లుగాకదా కేశముల పరిమళము అధికమైయుండును) అని పరమకారుణికులగు పెరియవాచ్చాన్‌పిళ్లై "వైవణ్ణమ్ నఱుజ్కుజ్జి" పాశురవ్యాఖ్యానములో అనుగ్రహించిరి. విష్ణుసహస్రనామములలో ఈ నామము నృసింహావతారపరముగా వ్యాఖ్యానింపబడిన "**నారసింహవపుః శ్రీమాన్**" అను నామములకు పిమ్మట పఠింపబడుటచే, సందర్భానుగుణముగా ఈ కేశవనామము నృసింహావతారములోని సటల సౌందర్యమును తెలుపుచున్నదనియు చెప్పవచ్చును. భట్టర్ ఈ ఉద్దేశ్యములో "**ఏవంవిధ- ఐశ్వర్య- సౌందర్య- ఏకాంతలక్షణాని ఉపలక్షయతి. కేశవః - ప్రశస్తస్నిగ్ధ నీలకుటిలకుంతలః**" అని వివరించిరి. తిరుమఙ్గైయాఴ్వార్లు ఈ అర్థమును - "**ఎరి యెన కేశరవాళెయిఱ్ఱోడు ఇరణియనాకమ్ ఇరణ్డు కూఱా అరియురువా మివర్**" అనే పాశురములో ఈ అర్థమును తెలిపిరి. ఈ విధముగా ప్రశస్తకేశములను కల్గియుండువాడను అర్థమును పలు విభవరూపములలో కూడ ఆఴ్వార్లు అనుసంధించిరి. "వఙ్గ క్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై" అని కూర్మావతార రూపమున, "**కేఴల్ ఒన్టాకి యిడన్ద కేశవన్**" అని వరాహావతారరూపమున, "**కణ్ణన్ కేశవన్**" అని కృష్ణావతారరూపమున పల్కిరి. ఇదే విధముగా అర్చావతారరూపములో



కూడా ఈ అర్థానుసంధానము కలదనుట "**తిరుమాలిరుమ్‌శోలై నిన్ఱ కేశవన్**" అని తిరుమాలిరుమ్‌శోలై అర్చామూర్తిరూపమున, "**వాఴి కేశనే**" అని తిరుక్కుడన్దైలోని రూపమున గల దివ్యసూరుల ప్రయోగముల ద్వారా భావ్యములు.

**(కేశవః)** -కేశి అను అసురుని సంహరించిన కృష్ణుడు అనియు అర్థమును చెప్పవచ్చును. "**యస్మా త్త్వయైవ దుష్టాత్మా హతః కేశీ జనార్దన, తస్మా త్కేశవనామా త్వం లోకే ఖ్యాతిం గమిష్యసి**" (వి.పు.5-16-23) (జనార్దనా! నిన్ను చంపవలెనను దుష్టభావముతో వచ్చిన కేశి అను అసురుడు నీచే చంపబడుటచే నీవు లోకములో కేశవుడవను పేరుతో కీర్తిని పొందగలవు) అని నారదునిచే శ్రీవిష్ణుపురాణములో ఈ అర్థము తెలుపబడినది. "**కేశవం కేశిహంతారమ్**" అని వేఱొక సందర్భమునను ఈ అర్థము సూచింపబడినది. 'కేశవః కేశిహా'' అనుచు ఈ అర్థము శ్రీవిష్ణుసహస్రనామములో ఆదరింపబడినది. "**కణ్ణన్ కేశవన్**" అని, "**నారాయణన్ మూర్త్తి కేశవన్**" అనియు ఈ అర్థము దివ్యసూరులచే అనుసంధింపబడినది. ఇట్లు ఈ అర్థమును చెప్పునపుడు భగవానుని విరోధినిరసనశీలత్వము వ్యక్తమగుచున్నది. "**కణ్ణన్ కేశవన్ నమ్బి**" (శ్రీకృష్ణుడు, కేశవుడు, గుణపూర్ణుడు) అని, "**కేశవ ! నమ్బి ! ఉన్నై క్కాదు కుత్త**" (కేశవా ! గుణపూర్ణా ! నీకు చెవులు కుట్టుటకై) అని, "**కేశవనమ్బియై క్కాల్ పిడిప్పాళ్ ఎన్ను మిప్పేఱెనక్కు అరుళ్‌కణ్డాయ్**" (ఈమె కేశవస్వామి శ్రీపాదములను సంవాహనము చేయుచున్నది- అను ఈ ఫలమును నాకు అనుగ్రహింపుము) అని ఈ తిరునామము యొక్క గుణపూర్తిని పెరియాఴ్వార్లు, గోదాదేవి అనుసంధించిరి. "**కేశవః క్లేశిహా లోకే ద్వైరూప్యేణ క్షితౌ స్థితః, మధురాఖ్యే మహాక్షేత్రే వారాణస్యా మపి ద్విజ**" (బ్రాహ్మణుడా! క్లేశములను పోగొట్టు కేశముల అందమును కల స్వామి మధుర అను మహాక్షేత్రమునందును, వారాణసి అనబడు కాశిలోను ఈ భూలోకమున నివాసములను కల్గియున్నాడు) అను ప్రమాణమును చూపి పరాశరభట్టరు ఈ తిరునామమును అర్చావతారపరముగా వ్యాఖ్యానించిరి. "**యువద్విపేంద్రాయుత సారదుద్రుమం హయాకృతిం కేశిన మాతతాయినమ్. మహీధరం వ్రజ ఇవ వ్యదారయత్ తతో భవాన్ కేశవ ఇత్యుదీర్యతే**" అను కేశవపంచాశత్ స్తోత్రశ్లోకమిచట ఉదాహార్యము. ఇట్లు పరవిభవార్చావతారములను తెలుపునదియే

అయినను, "కేశవన్ నారణన్ శీమాదవన్ గోవిన్దన్ వైకున్దన్" (కేశవుడు, నారాయణుడు, శ్రీమాధవుడు, గోవిందుడు, వైకుంఠుడు) అను నమ్మాళ్వార్లు పల్కుటచే, ఈ తిరునామము పరావస్థను సూచించునను అర్థమునే ముఖ్యముగా గ్రహించుట తగినది.

పెరియాళ్వార్ల తిరుమొళిలోని (2-3)వ దశకమున, తిరువాయ్‌మొళి ప్రబంధములోని (2-8)వ దశకమున కేశవాది ద్వాదశ నామములతో అంకితములైన పన్నెండు పాశురములున్నవి. సందర్భోచితమను భావముతో వీని భావచట విన్నపింపబడుచున్నది. దేశికుల పన్నిరునామ ప్రబంధములోని పాశురములు, వాని అర్థముకూడ తెలుపబడుచున్నవి. ముందుగా పెరియాళ్వార్ల తిరుమొళిలోని పాశురము, దాని భావము.

గత దశకంలో పెరియాళ్వార్లు, తన బాల్యానికి తగినట్లు స్తన్యాన్ని తాగడంకూడా మఱచిపోయి నిద్రపోతున్న చిన్నికృష్ణుని నిద్ర లేపి, పాలు తాగించాలని ఆశపడి, అతడు వద్దని అనినా మానకుండా అనేకవిధాలుగా నిర్బధించి, యశోదాదేవి స్తన్యాన్ని తాగించిన రీతిని, ఆమె మాతృత్వరూప సంబంధాన్ని, స్నేహాన్ని కలవారై, ఆ కాలంలోనే వలె చిన్నికృష్ణుని ఉద్దేశించి, తాముకూడా పల్కి ఆనందించారు.

ఈ దశకంలో యశోదాదేవి అతనికి చెవులు కుట్టించి, ఆ చెవులకు ఆభరణాలను అలంకరించి, చూచి ఆనందించాలని ఆశపడి, చెవులు కుట్టడం అనే ఉత్సవానికి ఊరిలోని వనితలను అందఱిని పిలచి, వచ్చినవారిని గౌరవించడానికి అవసరం అయిన మంగళ ద్రవ్యాలను సేకరించుకొని, చిన్ని కృష్ణుని చెవులు కుట్టించుకోవడంకోసం పిలువగా, అతడు "అమ్మో !" అని భయపడి "రాను" అని అన్నా, అతడు భయపడకుండా ఉండే కొన్ని మాటలను పల్కి, అతనికి ఇష్టమైన పలు పదార్థాలను చూపి, అంగీకరింపజేసి, చెవులను కుట్టించిన రీతిని పెరియాళ్వార్లు ఆమెవలెనే అనుభవించాలని ఆశపడి, ఆమె భావనను పొంది, ఆకాలంలోవలె శ్రీకృష్ణుని ఉద్దేశిస్తూ, ఈ దశకంలోని పాశురాలను పల్కి, అనుభవించి సంతుష్టులు అవుతున్నారు. ఈ దశకం అన్నాది ప్రక్రియలో



కూర్పబడడం, కేశవాదిద్వాదశనామాలతో అంకితం చేయబడడం, రత్నావళీ అలంకారరీతిలో కూర్పబడడం విశేషం.

**పోయ్ ప్పాడుడైయ నిన్దైయుమ్ తాళ్ఞ్తాన్ పొరుదిఱక్కిజ్ఞన్ కడియన్**
**కాప్పారు మిల్లై క్కడల్వణ్ణా ! వున్నై త్తనియే పోయెజ్ఞుమ్ తిరిది**
**పేయ్‌ప్పాల్ ములై యుణ్డ పిత్తనే ! కేశవనమ్బీ ! ఉన్నై క్కాదు కుత్త**
**ఆయ్‌ప్పాలర్ పెణ్డుగళెల్లారుమ్ వన్దార్ అడైక్కాయ్ తిరుత్తి నాన్ వైత్తేన్**

పుత్రరక్షణంలో, స్వజనరక్షణంలో ఔదార్యాన్ని కల్గిన మనస్సు కల నీ తండ్రి గోరక్షణకోసం వాటివెంట పోయి, తిరిగి రావడానికి ఆలస్యం చేస్తున్నాడు. పోరులో బలిమిని కల కంసుడు నీ విషయంలో క్రూరుడై ఉన్నాడు. ఓ సముద్రవర్ణా ! ఇటువంటి అందమైన రూపాన్ని కల నిన్ను మంచి ఉపాయాన్ని తెలిసి రక్షించగల్గిన వారు ఇక్కడ లేరు. ఒంటరిగా ఎక్కడికి అంటే అక్కడకు పోయి తిరుగుతున్నావు. పూతన స్తన్యాన్ని తాగిన భ్రాంతుడా! కేశవా! శౌర్యపూర్తిని కలవాడవైన నీకు చెవులు కుట్టడంకోసం అందఱు గోపాలురు, గోపికలు వచ్చారు. వారిని గౌరవించడానికి తగిన వక్కలు మొదలైనవానిని సిద్ధం చేశానయ్యా !.

ఇక, తిరువాయ్‌మొళిలోని ఈ నామంతో అంకితమైన పాశురం, దాని భావం.

**కేశవన్‌తమర్ కీళ్ మేలెమరేళుపిఱప్పుమ్**
**మాశతిరుతు పెఱ్ఱు నమ్ముడై వాళ్వు వాయ్‌క్కిన్ఱ వా**
**ఈశనెన్ కరుమాణిక్కమెన్ శెఙ్గోలక్కణ్ణన్ విణ్ణోర్**
**నాయకన్ ! ఎమ్బిరానెమ్మాన్ నారాయణనాలే**

అందఱికి స్వామియై, నా అనుభవమునకు తగిన నీల మాణిక్యమువంటి రూపమును కలవాడై, ఎఱ్ఱని, అందమైన కన్నులను నేను దర్శించునట్లు చేసినవాడై, నిత్యసూరినాథుడై, మాకు ఉపకారకుడై, మాకు స్వామి అయిన నారాయణుని అనుగ్రహమువలన నాతో చేరినవారు ముందు వెనుకలు ఏడు జన్మలలోను భగవద్భక్తులు కాగలరు. ఇటువంటి గొప్పతనమును పొంది, మన ఉజ్జీవనము వృద్ధిచెందు తీరు ఎంత ఆశ్చర్యకరము !

కేశవాది ద్వాదశనామములను అనుసంధించు ఈ దశకములో భగవానుని అనుగ్రహము తదీయులపైననే కాక, తత్సంబంధ సంబంధులవరకు- అనగా- వారితో సంబంధము ఉన్న వారివరకు ప్రసరించునని తెలుపబడుచున్నది. ఎమ్బార్ అను పూర్వాచార్యులు ఈ దశకమును అనుసంధించునపుడు- "ఇపుడు నేను శ్రీవైష్ణవుడను అయితిని" అని అనినారట- శ్రీవైష్ణవచిహ్నము కదా ఈ ద్వాదశనామములు.

ఇక, దేశికుల పన్నిరునామ ప్రబంధములో కేశవనామ వైభవమును తెలుపు పాశురము.

**కేశవనాయ్ నిన్దు కీழ్త్తిశైయిలు నెற்றియిలు**
**న్దేశుడై యాழிకళ్ నాన్గుడన్ శెమ్ పశుమ్ పొన్ మలైపోల్**
**వాశి మికుత్తెనై మజ్గామల్ కాక్కు మఱైయదనాల్ -**
**ఆశై మికుత్త వయన్ మకవేదియిల్ అఱ్పుతనే**

మఱైయతనాల్ = వేదార్థనిశ్చయముతో, ఆశై మికుత్త అయన్ = (వరదరాజస్వామి పరబ్రహ్మము అని తెలిసికొని, ఆ స్వామిపట్ల) ప్రేమ మిక్కిలిగా కల బ్రహ్మ నిర్వహించిన, మక వేదియిల్ = యాగవేదికలో, (అవతరించిన), అఱ్పుతన్ = ఆశ్చర్యకరచేష్టలను చేయు వరదరాజస్వామి, కేశవనాయ్ = కేశవుడను నామమును కలవాడై, కీழ్ త్తిశైయిలుమ్ నెற்றియిలుమ్ = తూర్పుదిక్కునందు, (భాగవతుల) లలాటమునందును, తేశు ఉడై ఆழிకళ్ నాన్గుడన్ = ప్రకాశమును కల నాల్గు చక్రాయుధములతో, శెమ్ పశుమ్ పొన్ మలైపోల్ = ఎఱ్ఱని రంగును కల, సాటి లేని బంగారముతో నిర్మింపబడిన పర్వతమువలె, నిన్దు = స్థిరముగా నిలచియుండి, వాశి మికుత్తు = గొప్పతనము అతిశయించియుండి, ఎన్నై మజ్గామల్ కాక్కుమ్= నన్ను చెడకుండ కాపాడును.

ఇచటి మూర్తి - కేశవుడు. వర్ణము - బంగారు. ఆయుధములు నాల్గు చక్రములు. దిశ - తూర్పు. పుండ్రస్థానము- నుదురు.

**లలాటే సతతం దేవ్యా శ్రియా సహ విరాజితమ్ ।**
**చతుశ్చక్రం నమస్యామి కేశవం కనకప్రభమ్ ॥**



ఈ క్రమములోనే ఇకపైగల నామముల వివరణము చివర పెరియాழ్వార్ తిరువాయ్మొழி, పన్నిరునామ ప్రబంధములలోని ఆయా నామములతో అంకితములైన పాశురములు, వాని భావములు తెలుపబడును.

## (2) నారాయణః

### పశ్చాన్నారాయణః శంఖీ నీలజీమూతసన్నిభః ।

కేశవుడను నామముతో బ్రహ్మరుద్రులకును స్వామి ఉత్పాదకుడనుట తెలుపబడినది. ఇట్టివాడు ఎవడు? అను ప్రశ్న కలుగగానే అతడు నారాయణుడే అను వేదాంతసిద్ధమైన, అసాధారణమైన నారాయణనామము పిమ్మట ప్రసక్తమగు చున్నది. ఈ తిరునామమును వేదములు, ఇతిహాసపురాణములు, ఆழ்వార్లు మిక్కిలి ఆదరించిరనుట సుప్రసిద్ధము. దీనిలోగల 'ణ'కారము వేఱు ఏ దైవమునకును ఈ తిరునామము పొసగదనుటను తెలుపుచున్నది. **"పరస్య వస్తునః మూర్త్యంతరవ్యావర్తకతయా నిర్దిష్టమ్ అసాధారణం నామ"** అని భట్టర్ తమ భాష్యములో నుడివిరి. ఈ నామవైభవమును వేయి నోళ్ళు కల ఆదిశేషుడుకూడ పరిచ్ఛేదించి తెలుపలేడు. నారాయణుని వైభవమును ఒకవేళ తెలిసికొన్న తెలిసికొనవచ్చును. కాని, నారాయణనామముయొక్క అర్థవైభవమును మాత్రము ఎవరికిని తెలియుటకు సాధ్యము కాదు. పరమకారుణికులు, సర్వజ్ఞసార్వ భౌములును అగు ఆழ்వార్లు, పూర్వాచార్యులును ఈ నామము యొక్క అర్థమును పలు చోట్ల అనుసంధించిరి. ఆ సూక్తులను అవసంధించుచు, మనముకూడ ఈ తిరునామముయొక్క అర్థగౌరవమును సాధ్యమైనంతలో అనుభవించుటకు ప్రయత్నించెదము.

**"రిజ్-క్షయే"** అను ధాతువు నుండి పుట్టిన 'ర' అను అక్షరము నశించునట్టి పదార్థములను చెప్పుచున్నది. 'న' అను అక్షరము ఆ నశించు స్వభావమును నిషేధించుచున్నది. కావున నరశబ్దము నిత్యమై వెల్గు వస్తువులను తెలుపుచున్నది. **"నరాణాం సమూహః నారః"** అను రీతిలో **'నారః'** అను పదము ఇట్టి నిత్యవస్తువుల సమూహమును నిర్దేశించుచున్నది. **"నారాః"** అను బహువచనముచే ఈ నిత్యవస్తువుల సమూహములు అనేకములున్నవని తెలుపబడుచున్నది. ఇట్టి నిత్యవస్తువుల సమూహములేవి? అనుటను పరమకారుణికులగు పెరియవాచ్చాన్

పిళ్ళై- "అవై యావన-జ్ఞానశక్త్యాదిదివ్యాత్మగుణఙ్గళుమ్, గుణప్రకాశకమాన దివ్యమఙ్గళవిగ్రహఙ్గళుమ్, విగ్రహగుణమాన సౌందర్యాదికళుమ్, అన్ద సౌన్దర్యాదికళోపాది పూత్తాప్పోలే శాత్తిన కిరీటమకుటాదిదివ్యాభరణఙ్గళుమ్, అవ్వాభరణఙ్గళోడు వికల్పిక్కలామ్బడియాన శంఖచక్రాదిదివ్యాయుధఙ్గళుమ్, ఇత్తనైయుమ్ కాట్టిలెరిత్త నిలా వాకాదపడి అరుకే యిరున్దు అనుభవిక్కిఱ లక్ష్మీప్రభృతిమహిషీవర్గఙ్గళుమ్, అచ్చేర్త్తియిలే అడిమై శెయ్‌కిఱ అనన్తగరుడ విష్వక్సేనప్రముఖరాన సూరిసంఘముమ్, అవర్‌కళోపాది పోయ్ అడిమై శెయ్‌కిఱ ముక్తరుమ్, అవర్‌కళుక్కు అడిమై శెయ్‌కైక్కు ప్పరికరమాన ఛత్రచామరాది పరిచ్ఛదఙ్గళుమ్, అవ్వడిమైక్కు వర్ధకమాయ్ పంచోపనిషణ్మయమాన పరమ పదముమ్, గుణత్రయాత్మకైయాన మూలప్రకృతియుమ్, పురుషసమష్టియుమ్, అహోరాత్రాదివిభాగయుక్తమాన కాలతత్త్వముమ్, ప్రవాహరూపేణ నిత్యమాన మహదాదికళుమ్, తత్కార్యమాన అణ్డఙ్గళుమ్, అండాంతర్వర్తియాన చతుర్విధభూతఙ్గళుమ్. పంచోపనిషణ్మయమాకైయాలే పరమపదముమ్ సమూహాత్మక మాయిరుక్కుమ్. గుణత్రయాత్మికైయాకైయాలే మూలప్రకృతి యుమ్ సమూహాత్మికైయా యిరుక్కుమ్. అహోరాత్రాదివిభాగఙ్గళ్ అనేకమాకైయాలే కాలముమ్ సమూహాత్మకమా యిరుక్కుమ్" (అవి ఏవి అనగా- జ్ఞానము, శక్తి మొదలగు దివ్యాత్మగుణములు, ఆ గుణములను ప్రకాశింపజేయు దివ్యమంగళ విగ్రహములు. విగ్రహగుణములైన సౌందర్యము మొదలగునవి, ఆ సౌందర్యాదులవలెనే పూచినట్లున్న, ధరించిన కిరీటము మొదలగు దివ్యాభరణము లును, అట్టి ఆభరణములా ! అనదగినట్లున్న శంఖచక్రాది దివ్యాయుధములును, ఇవి అన్నియు అడవిలో కాచిన వెన్నెల కాకుండునట్లు సమీపముననేనుండి అనుభవించు లక్ష్మీదేవి మొదలగు మహిషీవర్గములును, వారి (స్వామి, దేవేరుల) కలయికలో కైంకర్యమును చేయునట్టి అనంత, గరుడ విష్వక్సేనాది నిత్యసూరివర్గమును, వారివలెనే కైంకర్యమును చేయు ముక్తులును, వారికి సేవ చేయుటకు సాధనములైన ఛత్ర, చామరాది చిహ్నములును, ఆ సేవకు వర్ధకమై, పంచోపనిషణ్మయమైన పరమపదము, గుణత్రయాత్మిక అగు మూలప్రకృతి, పురుషసమష్టి, అహోరాత్రాది విభాగములతో కూడిన కాలతత్త్వమును, ప్రవాహరూపమున నిత్యములైన మహదాదులును, తత్కార్యములైన అండములు, ఆ అండములలో సంచరించు చతుర్విధ



భూతములును. పంచోపనిషణ్మయమగుటచే పరమపదము సమూహాత్మకము. (సత్త్వరజస్తమోరూప) గుణత్రయాత్మకమగుటచే మూలప్రకృతియును సమూహాత్మకమైయుండును. (అట్లే) అహోరాత్రాదివిభాగములు అనేకములు. కావున కాలమును సమూహాత్మకమై యుండును) అని పరన్దరహస్యములో విస్తృతముగా అనుగ్రహించిరి.

అనంతరము గల అయనశబ్దము పలు అర్థములను కల్గినది. వానిలో నివాసస్థానము అను అర్థముకూడ ఒకటి. "నారాః అయనమ్ యస్య సః- నారాయణః" (నిత్యపదార్థసమూహములనెడి నారములు ఎవనికి నివాసస్థానమో ఆ నారాయణుడు) అను నారాయణ నామమునకు ఒక అర్థమున్నది. దీనిచే ఇతడు అన్ని పదార్థములలోను "ఉడల్ మిశై ఉయిరెన క్కరన్దెఙ్గుమ్ పరన్దుళన్" అనునట్లు అంతట వ్యాపించియుండునని చెప్పబడినట్లయినది. "చేతనాచేతనం సర్వం విష్ణోః యత్ వ్యతిరిచ్యతే, నారం తదయనం చోక్తం యస్య నారాయణ స్తు సః" (విష్ణువుకంటెను వ్యతిరిక్తములైన సకలచేతనాచేతనములు నారశబ్దముతో చెప్పబడుచున్నవి. అవి ఎవరికి అయనమో- అనగా- నివాసస్థానమో, ఆ పరమాత్మ నారాయణుడనబడుచున్నాడు) అని ఈ అర్థమును శాస్త్రము చెప్పినది. ఈ బహువ్రీహిసమాసార్థముచే అంతర్వ్యాప్తియు, అనంతరము వివరింపబడు తత్పురుషసమాసార్థముచే బహిర్వ్యాప్తియును తెలుపబడుచున్నవని ఆచార్యులు తెలిపిరి. ఈ తత్పురుష బహువ్రీహి సమాసములచే స్వామిత్వ-వాత్సల్యములు ప్రకాశించుచున్నవి. ఈ అర్థములను ఆళ్వార్లు "నల్లరుళ్ నమ్బెరుమాన్ నారాయణన్'' ఇత్యాది సూక్తులలో అనుసంధించుచు పిమ్మట నామానుసంధానమును చేయుటను గమనింపవచ్చును. "య చ్చ కించిత్ జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా, అంతర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" (ఈ లోకములో చూడబడునవి, వినబడునవియును అగు అన్ని వస్తువుల లోపల, బయట నారాయణుడు వ్యాపించియున్నాడు) అని సంస్కృతవేదములోను, "ఆక్కై యుళ్ళుమ్ ఆవి యుళ్ళుమ్ అల్ల పుఱత్తినుళ్ళుమ్ నీక్క మిన్ది ఎఙ్గుమ్ నిన్దాయ్" (శరీరములో, ప్రాణములో, ఇంకను బయట అంతట దేనిని విడువకుండ ఉన్నావు) అని ద్రావిడవేదములోను చెప్పబడినది. "నరాణామ్ అయనం యః సః"

(నిత్యపదార్థసమూహములనెడి నారములకు ఎవడు అయనమో అతడు నారాయణుడు) అని తత్పురుషసమాసము రీతిలోకూడ అర్థమును చెప్పవచ్చును. ఇందుచే అన్ని వస్తువులను నారాయణుడు ధరించుచున్నాడని చెప్పబడుచున్నది. **"నారాణా మయనత్వా చ్చ నారాయణ ఇతి స్మృతః" (63-62)** (నారశబ్దముచే చెప్పబడు నిత్యవస్తుసమూహములకు నివాసస్థానమగుటచే నారాయణుడు అనబడుచున్నాడు) అని ఈ అర్థము భారతము ఉద్యోగపర్వములో వివరింపబడినది. నారశబ్దమునకు వేఱొక రీతిలోకూడ అర్థమును చెప్పుట కలదు. **"నరః"** అని స్వరూపమునందును, స్వభావమునందును కొంచెముకూడ వినాశము లేనట్టి పరమపురుషుడు చెప్పబడుచున్నాడు. **"నరాత్ జాతాని"** అనునట్లు నరుడగు పురుషోత్తమునివలన పుట్టినవి నారశబ్దవాచ్యములు. వానిని అయనముగా కలవాడగుటవలన, వానికి అయనముగా నుండుటవలనను నారాయణుడనబడు-చున్నాడని పూర్వమువలెనే రెండు విధములుగా అర్థమును చెప్పనగును. **"నరా జ్జాతాని తత్త్వాని నారాణీతి తతో విదుః, తాన్యేవ చాయనం తస్య తేన నారాయణః స్మృతః"** (నరుడగు భగవానునివలన జనించినవానిని నారములని తెలిసికొందురు. వానిని నివాసముగా కలవాడగుటచే అతడు నారాయణుడనబడుచున్నాడు) అని ఈ అర్థము హరివంశమునందును చెప్పబడినది. నమ్మాళ్వార్లును ఈ అర్థమును- **"యావైయుమ్ యావరుమ్ తానామ్ అమైవుడై నారణన్"** (చరాచరములన్నీ తానై నిలచి ఉన్న నారాయణుడు) అనుచు తెల్పిరి. 'నార' శబ్దముచే చెప్పబడిన అనంతములైన వస్తువులలో కొన్నిటిని కొన్ని కొన్ని సందర్భములలో మాత్రమే ప్రస్తావించి, ఆళ్వార్లు నారాయణశబ్దమునకు వ్యాఖ్యానమును అనుగ్రహించిరి. నారశబ్దమునకు అనంతకల్యాణగుణములను అర్థమును గొని **"ఈఱిల వణ్ పుకళ్ నారణన్"** (లెక్కలేనన్ని కల్యాణగుణములను కల నారాయణుడు) అని, **"వణ్ పుకళ్ నారణన్"** (కల్యాణగుణములను కల నారాయణుడు) అనియు నమ్మాళ్వార్లును, **"నలముడై నారణన్"** (ఆనందాదికల్యాణగుణములను కల నారాయణుడు) అని పెరియాళ్వార్లు, **"నలన్దికళ్ నారణన్"** (ఆనందాది కల్యాణగుణములు ప్రకాశించు నారాయణుడు) అని కులశేఖరులు వ్యాఖ్యానించిరి. నారశబ్దమునకు దివ్యమంగళవిగ్రహమును, విగ్రహగుణములను అర్థముగా గ్రహించి, **"కారాయిన కాళ నన్మేనియినన్ నారాయణన్"** (నల్లని మేఘమువంటి



గొప్ప తిరుమేనిని కల నారాయణుడు) అన్ని నమ్మాళ్వార్లు, **"కార్ మేని చ్చెజ్గణ్ కదిర్ మదియమ్బోల్ ముకత్తాన్ నారాయణన్"** (నల్లని మేఘమువంటి తిరుమేనిని కలవాడు, ఎఱ్ఱని తామరలవంటి కన్నులను కలవాడు, సూర్యచంద్రులవంటి ముఖమును కలవాడు నారాయణుడు) అనియు, **"నాఱ్ఱ త్తుళాయ్ముడి నారాయణన్"** (పరిమళించు తులసీమాలను కిరీటమున గల నారాయణుడు) అని గోదాదేవి అనుగ్రహించిరి. దివ్యాభరణములను నారశబ్దమునకు అర్థముగా గ్రహించి, **"ఉడైయార్న్ద వాడైయన్ కణ్డికైయన్ ఉడై నాణినన్ పుడైయార్ పొన్నూలినన్ పొన్ముడియన్ మఱ్ఱుమ్ పల్కలన్, నడైయావుడై త్తిరునారణన్"** (నడుమునకు తగిన పీతాంబరమును కలవాడు, కంఠభూషణములను కలవాడు, నడుమున కటిసూత్రమును కలవాడు, పార్శ్వములలో గొప్పగా ప్రకాశించు బంగారు యజ్ఞోపవీతమును కలవాడు, మనోహరమైన కిరీటమును కలవాడు, ఇంకను పలు ఆభరణములను నిత్యముగా కల నారాయణుడు) అని నమ్మాళ్వార్లు సాయించిరి. **"లక్ష్మీప్రభృతిమహిషీవర్గజ్గళుమ్"** అని ఆచ్చాన్పిళ్ళై అనుగ్రహించిన దేవేరులను నారశబ్దమునకు అర్థముగా గైకొని. **"శెల్వ నారణన్"** (లక్ష్మిని కల నారాయణుడు) అని నమ్మాళ్వార్లు పల్కిరి. **"విణ్ణోర్ నాయకన్ నారాయణన్"** (నిత్యసూరి నాయకుడు నారాయణుడు) అని **"వేదమ్ తమిళ్ శెయ్ద మాఱన్"** అనబడు నమ్మాళ్వార్లు నారశబ్దమునకు నిత్యులను, ముక్తులను అర్థమును అనుగ్రహించిరి. అట్లే, నారశబ్దమునకు చేతనులను అర్థము గ్రహించి, **"ఎణ్పెరుక్కన్నలత్తు ఒణ్పొరుళ్ ఈఱిల వణ్పుకళ్ నారణన్"** (సంఖ్యలో లెక్కలేని, ఆనందము మొదలగు గుణములను కల అందమైన చేతనులను, అంతము లేని కల్యాణగుణములను కల నారాయణుడు) అనియు, **"ఎమ్బిరాన్ ఎమ్మాన్ నారాయణన్"** (మాకు ఉపకారకుడు, మా స్వామి నారాయణుడు) అనియును శఠకోపులు, **"నమ్మై యుడైయవన్ నారాయణన్"** (మనలను సొత్తుగా కలవాడు నారాయణుడు) అనియు, **"ఎన్నై నలజ్కొణ్డ నారణఱ్కు"** (నన్ను స్వీకరించిన నారాయణుడు) అని గోదాదేవియు, **"నారాయణన్ ఎన్నై యాళి"** (నారాయణుడు నా రక్షకుడు) అనియు తిరుమళిశైప్పిరాన్ సాయించిరి. నారశబ్దమునకు ఉభయవిభూతిని అర్థముగా గొని **"నారణన్ ముళు వేళులకుక్కుమ్ నాదన్"**

(నారాయణుడు సమస్త సప్తలోకములకు నాథుడు) అని నమ్మాళ్వార్లు, **"నాయకన్ నారణన్"** (నాయకుడు నారాయణుడు) అని పెరియాళ్వార్లును అనుగ్రహించిరి.

**(నారాయణః)** నరుడను భగవానునిచే సృష్టింపబడిన జలమును నారశబ్దమునకు అర్థముగా గొని, ఆ నీటిని స్థానముగా కలవాడు- అను అర్థమును చెప్పవచ్చును. **"ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః, తా యదస్యాయతనం పూర్వం తేన నారాయణః స్మృతః"** (నరుడనెడి సర్వేశ్వరునిచే సృష్టింపబడిన జలము నార మనబడుచున్నది. అది పూర్వకాలమున ఇతనికి నివాసస్థానమైయుండుటచే ఇతడు నారాయణుడనబడుచున్నాడు)అని మనుస్మృతియందు, విష్ణుపురాణము నందును వివరింపబడినది. ఈ అర్థము **"నాక మేటి నడుక్కడలుళ్ తుయిన్ద నారాయణనే"** (ఆదిశేషుని అధిరోహించి, సముద్రమధ్యమున నిద్రించు నారాయణుడు) అని ఆళ్వార్లు, **"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః"** (ఇతడే పాలకడలిలో పరుండియున్న శ్రీమన్నారాయణుడు) అని పురాణమునందును చెప్పబడినది. **"సృష్ట్వా నారం తోయ మంతః స్థితోఽహం యేన స్యాన్మే నామ నారాయణేతి"** (నారశబ్దముచే చెప్పబడు జలమును సృష్టి చేసి, దానిలో నేను నివసించుటచే నాకు నారాయణుడను నామము ఏర్పడినది) అని వరాహ పురాణములో భగవానునిచే ఈ అర్థము ఆదరింపబడినది.

**(నారాయణః)** - నారశబ్దమునకు ఈ ప్రకృతిమండలములోనున్న చేతనాచేతనములను అర్థముగా గొని, ప్రళయకాలములో వానికి ఆశ్రయభూతుడు అను అర్థమునుకూడ చెప్పవచ్చును. **'ఞాల ముఱ్ఱుమ్ ముణ్డు ఆలిలై త్తుయిల్ నారాయణనుక్కు"** (భూమిని అంతటిని ఆరగించి వటపత్రములో తూగు నారాయణునకు) అని పెరియాళ్వార్లు, **"ఞాల ముఱ్ఱుమ్ ఉణ్డుమిழ்న్ద నారాయణనే"** (భూమిని అంతటిని ఆరగించి, ఉమిసిన నారాయణా !) అనియు, **"ఞాల ముణ్డాయ్ ఞానమూర్త్తి ! నారాయణా!"** (భూమిని ఆరగించినవాడా ! జ్ఞానస్వరూపా ! నారాయణా !) అనియు నమ్మాళ్వార్లును ఈ అర్థమును అనుసంధించిరి. దీనిచే సర్వసంహర్తృత్వము చెప్పబడినది.

**(నారాయణః)** - నరశబ్దముచే నాశరహితమైన స్వరూపమును కల ఆత్మ చెప్పబడినది. నారశబ్దము ఆత్మస్వరూపమును నిర్దేశించుచున్నది. అయన శబ్దము



**"ఇణ్-గతౌ", "అయ-గతౌ"** అను ధాతువులనుండి వ్యుత్పన్నమగుటచే, పోయి చేరు చోటు అగు ప్రాప్యమును, పోయి చేరు దారి అగు ఉపాయమును తెల్పును. కావున, **"నారాయణ"** అను నామమునకు చేతనవర్గమునకు మోక్షప్రాప్యముగను, మోక్షోపాయముగను నున్నవాడు- అను అర్థము ఏర్పడును. ఈ అర్థము - **"నార స్త్వితి సర్వపుంసాం సమూహః పరికీర్తితః, గతి రాలంబనం తస్య తేన నారాయణః స్మృతః"** (నారమనగా సకలచేతనుల సమూహము చెప్పబడినది. ఆ చేతన సమూహమునకు ఉపాయముగను, ఉపేయముగను ఉండుటచే భగవానుడు నారాయణుడని చెప్పబడుచున్నాడు) అనియు, **"నారో నారాణాం సంఘాత స్తస్యాహ మయనం గతిః, తేనాస్మి మునిభిః నిత్యం నారాయణ ఇతీరితః"** (వరసమూహము నారమనబడుచున్నది.) దానికి నేను ప్రాప్యముగను, ప్రాపకముగను ఉన్నవాడను. కావున మునులచే ఎల్లప్పుడు నేను నారాయణుడని చెప్పబడుచున్నాను) అనియు, **"నారశబ్దేన జీవానాం సమూహః ప్రోచ్యతే బుధైః, తేషా మయనభూతత్వా న్నారాయణ ఇహోచ్యతే, తస్మా న్నారాయణం బంధుం మాతరం పితరం గురుమ్, నివాసం శరణం చాహు ర్వేదవేదాంతపారగాః"** (నారశబ్దమునకు జీవసమూహము విజ్ఞులచే అర్థముగా చెప్పబడుచున్నది. వారికి ప్రాప్యప్రాపకములనెడి అయనమై యుండుటచే నారాయణుడు అని ఇచట చెప్పబడుచున్నాడు. అందుచే నారాయణుని బంధువుగను, తల్లిగను, తండ్రిగను, ఆచార్యునిగను, నివాసముగను, ఉపాయముగను వేదవేదాంతముల పారమును దర్శించినవారు పల్కుదురు) అని శాస్త్రములలో ఈ అర్థము మిక్కిలి వివరముగా ఉపదేశింపబడినది. **"నారాయణనే నమక్కే పఱై తరువాన్"** (నారాయణుడే మనకు 'పఱై' అను వాద్యమును అనుగ్రహించును) అని ఆణ్డాళ్, **"వీడాక్కుమ్ మెయ్ ప్పొరుళ్తాన్...... నారాయణన్"** (పరమపదమును అనుగ్రహించువాడు...... నారాయణుడు) అనియు, **"నారాయణన్ ఎన్నై యాళి నరకత్తిల్ శేరామల్ కాక్కుమ్ తిరుమాల్తన్"** (నారాయణుడు నాకు రక్షకుడు, నరకములో చేరకుండ రక్షించు శ్రియఃపతి) అని తిరుమழிశైప్పిరాన్ ఈ అర్థమును నారాయణశబ్దమునకు అర్థములుగా అనుసంధించిరి. **"శరణం గతి ర్నారాయణః"** (నారాయణుడే మోక్షమునందు ప్రాప్యుడు, పొందుటకు ఉపాయమును) అను వేదముకూడ ఈ అర్థమును ఉద్ఘోషించినది. **"నక్కప్పిరాన్ ఉయ్యక్కొణ్డదు నారాయణన్ అరుళే"** ఇత్యాది సూక్తులలో దివ్యసూరులు

నారాయణనామములోని అయన శబ్దమునకు అర్థమును అనుసంధించుట కూడ గమనింపతగినది.

**(నారాయణః)** - నరుడనగా నాశరహితుడగు భగవానుడు అర్థమని ముందే చెప్పబడినది. **"జహ్ను ర్నారాయణో నరః"** అని భగవానుని నామము ఒకటి సహస్రనామములో కలదు. "నరస్య ఇమే నారాః" (నరునకు చెందినవారు నారములు) అనెడి వ్యుత్పత్తి ప్రకారము నారశబ్దము **"జ్ఞానీత్వాత్మైవ మే మతమ్"** (జ్ఞాని నాకు ఆత్మయై యున్నవాడు అని నా సిద్ధాంతము) అని భగవానుని చేతనే అభిమానింపబడిన ఆ స్వామి దాసులనే తనకు పరమప్రాప్యముగా కలవాడు అను అర్థము దీనివలన స్ఫురించును. **"నచ్చువర్ మున్ నిఱ్కుమ్ నారాయణా"** (ఆరాధించువారి ముందు ప్రత్యక్షమగు నారాయణా !) అనియును పెరియాళ్వార్లు, **"అఱ్పుదన్ నారాయణన్ ....నిఱ్పదు మేవి యిరుప్పదెన్నెఞ్జకమ్"** (ఆశ్చర్యభూతుడు, నారాయణుడు....నిలచునది, అభిమానించి ఉండునది నామనస్సులోపల) అని నమ్మాళ్వార్లును ఈ అర్థమును ఆదరించిరి. **"నా నున్నై యన్ఱి యిలేన్ కణ్డాయ్ నారణనే!"** (నారాయణా ! నీవు లేక నేను లేను) అని మోక్షోపాయత్వము, సర్వవ్యాపకత్వము, సర్వధారకత్వము - మొదలగు గుణములను నారాయణ శబ్దార్థముగా అనుసంధించిన తిరుమళిశైయాళ్వార్లు **"నీ ఎన్నై యన్ఱి యిలై"** (నేను లేక నీవు లేవు) అని భక్తైకధారకత్వమనెడి ఈ అర్థమును సాయించిరి. పెరియాళ్వార్‌తిరుమొళిలోని **"నణ్ణి త్తొళుమవర్శిన్దై పిరియాద నారాయణా"** (ఆరాధించి, కొలుచువారి మనస్సును విడువని నారాయణా!) అనునపుడు వ్యాఖ్యానించుచు పరమరసికులగు తిరువాయ్‌మొళిప్పిళ్ళై- **"ఇవరుడైయ నారాయణశబ్దార్థత్వమ్ ఇప్పడిప్పోలే కాణు మిరుప్పదు"** (వీరి నారాయణ శబ్దార్థత్వము ఈ విధముగా కదా ఉండును) అని అనుగ్రహించిరి.

**(నారాయణః)** - నరములని ఏ విధమైన కొఱతయు లేని శ్రీవైష్ణవులు చెప్పబడుచున్నారు. **"నారమ్"** అని నరులగు ఆ శ్రీవైష్ణవుల వాసస్థానమును తెలుపుచున్నది. శ్రీవైష్ణవుల వాసస్థానమే తనకు నివాసముగా గొని వేంచేసి యుండుటచే నారాయణుడనబడుచున్నాడనియు చెప్పవచ్చును. **"తిరుకోట్టియూర్ మన్ను నారణన్"** అనియు, **"తెన్నిరైశూళ్ తిరుప్పేర్ క్కిడన్ద తిరునారణా!"** అనియు పెరియాళ్వార్లు ఈ అర్థమును తెలిపిరి. ఇట్టి ప్రయోగము లింకను కలవు.



**"నరసంబంధినో నారా నరః స పురుషోత్తమః, నయత్యఖిలవిజ్ఞానం నాశయత్యఖిలం తమః, న రిష్యతి చ సర్వత్ర నర స్తస్మా త్సనాతనః, నరసంబంధిన స్సర్వే చేతనాచేతనాత్మకాః, ఈశేశితవ్యతయా నారా ధార్యపోష్యతయా తథా, నియామ్యత్వేన సృజ్యత్వప్రవేశభరణై స్తథా, అయతే నిఖిలాన్ నారాన్ వ్యాప్నోతి క్రియయా తథా, నారా శ్చాప్యయనం తస్య తై స్తద్భావరూపణాత్, నారాణా మయనం వాసః తే చ తస్యాయనమ్ సదా, పరమా చ గతి స్తేషాం నారాణా మాత్మనామ్ సదా, ఆపో నారా ఇతి ప్రోక్తా స్తా అప్యయన మస్య చ, అతో నారాయణో నామ హేతుభి ర్దర్శితః పరః"** (నరునితో సంబంధమును పొందినవారు నారములు. పురుషోత్తముడే నరుడనబడుచున్నాడు. తననుగూర్చిన సకలవిధమైన జ్ఞానమును పొందించుటచేతను, సమస్తమైన అజ్ఞానమును పోగొట్టువాడగుటచేతను, అంతటను వికారము లేనివాడైయుండుటచేతను, సనాతనుడగు ఆ పరమపురుషుడు నరుడనబడుచున్నాడు. నరుడగు ఆ భగవానునితో సంబంధమును పొందిన సకలచేతనాచేతనములు, ఆ స్వామిచే పాలింపబడుటచేతను, ధరింపబడుటచేతను, పోషింపబడుటచేతను, నియమింపబడుటచేతను, సృష్టింపబడుటచేతను, వ్యాపింపబడుటచేతను, భరింపబడుటచేతను నారములగుచున్నవి. నారములను అన్నిటిని (స్వరూపముచే) పొందుటచేతను, పూర్వము తెల్పిన క్రియలతో వ్యాపించుటచేతను, వానిని పురస్కరించుకొనియే భగవానుని నిరూపింపవలసి యుండుటచేతను నారములు ఆ పురుషోత్తమునకు అయనములగుచున్నవి. ఇతడు నారములకు అయన మగుచున్నాడు. అవియును ఇతనికి ఎల్లప్పుడు అయనములగుచున్నవి. నరసమూహములగు ఆత్మలకు గొప్ప ప్రాప్యముగను, ప్రాపకముగను ఇతడు వెల్గుచున్నాడు. జలముకూడ నారశబ్దముచే చెప్పబడు చున్నది. అదియు ఇతనికి నివాసము అగుచున్నది. కనుక ఈ కారణముచే నారాయణుడను నామము చాలా గొప్పది అని చూపబడినది) అని అహిర్బుధ్న్య సంహితలో **(52-50,55)** నర, నార, నారాయణ శబ్దములు విస్తృతముగా వివరింప బడుట ప్రస్తుతమున అనుసంధేయము. భగవానునకు ఎన్ని నామములున్నను వానిలో నారాయణ నామమునకు గల ప్రాధాన్యమును **"పేరాయిరమ్ కొణ్డదు ఓర్ పీడుడైయన్"** ఇత్యాదిగా ఆళ్వార్లు తెలిపిరి. ఇక, పెరియాళ్వార్ తిరుమొ లోని ఈ నామముచే అంకితమైన పాశురము, దాని భావము తెలుపబడుచున్నవి.

వణ్ణప్పవళ మరుజ్గినిఙ్చాత్తి మలర్ప్పాద క్కిణ్గిణి యార్ప్ప
నణ్ణి త్తొ*ఝ*ుమవర్శిన్గై పిరియాద నారాయణా! యిజ్గే వారాయ్
ఎణ్ణఙ్కరియపిరానే ! తిరిమై యెరియామే కాదుక్కిడువన్
కణ్ణుక్కు నన్లు మ*ఝ*గుముడైయ కనగక్కడిప్పు మినైయా

చక్కని రంగును కల పగడాల దండను నడుముకు చుట్టుకొని, తామరపూవువలె ఉండే పాదాలలో ధరించిన మువ్వలు ధ్వనించేటట్లున్న నిన్ను చేరి, నమస్కరించడమే అలవాటుగా గలవారి మనస్సునుండి క్షణకాలం కూడా విశ్లేషించని నారాయణా ! నేను ఆహ్వానించే ఈ చోటకు రావాలి. నీ విషయంలో ప్రీతిని లేనివారికి భావించడానికికూడా వీలు కానట్లుండే స్వామీ ! నీ చెవులకు కాడను బాధ కలుగకుండా పెడతాను. కంటికి చాలా అందంగా ఉండే బంగారు కుండలాలు ఏవిధంగా ఉన్నాయో చూడు. ఇక, తిరువాయ్మొ*ఝ*ిలోని విచారము.

నారణన్ ము*ఝ*ువే*ఝ*ులకుక్కుమ్ నాతన్ వేతమయన్
కారణమ్ కిరిశై కరుమ మివై ముతల్వ నైన్గై
శీరణజ్గమరర్ పిఱర్ పలరుమ్ తొ*ఝ*ుతేత్త నిన్లు
వారణత్తై మరుప్పొశిత్తపిరాన్ ఎన్ మాతవనే

నారాయణుడు, అన్ని లోకములకు స్వామి, వేదస్వరూపి, కారణవస్తువులు, కార్యవస్తువులు, వాని ప్రయోజనములు- అను వీనికి నిర్వాహకుడు, మహిమ నిండిన, గొప్పవారైన నిత్యసూరులచే, ఇంకను పలువురు నమస్కరించి, స్తుతించునట్లు నిలచిఉన్నవాడు, కువలయాపీడం అనే ఏనుగుదంతాన్ని విఱిచిన ఉపకారకుడు - నేను ఆరాధించే మాధవుడు.

విశే :- మొదటిపాశురములో అనుసంధింపబడిన నారాయణనామము యొక్క అర్థము ఇందులో ప్రస్తావింపబడినది.

ఇపుడు పన్నిరు నామములోని పాశురము. దాని అర్థము-

నారణనాయ్ నల్వలమ్బురి నాలు ముకన్డెడుత్తు
మూరణి మేక మెనవే యుదరము మేఙ్కు నిన్లుమ్
ఆరణనూల్ తన్దరుళా లడైక్కలజ్కొణ్డరుళుమ్
వారణవెఱ్పిన్ మ*ఝ*ైముకిల్పోల్ నిన్ల మాయవనే



వారణ వెఱ్పిల్ = శ్రీహస్తిగిరిలో, మ*ఝ*ై ముకిల్ పోల్ = చల్లని మేఘమువలె, నిన్ల మాయవన్ = నిలచియున్న ఆశ్చర్యకరలీలను చేయు వరదరాజస్వామి, నారణనాయ్= నారాయణుడై, నల్ వలమ్బురి నాలుమ్ = గొప్ప దక్షిణావర్తశంఖము లను నాల్గింటిని, ఉకన్దు ఎడుత్తుమ్ = ఆనందించి (చేతులలో) దాల్చియు, ఊర్ అణి మేకమ్ ఎన = సంచరించుచున్న, అందమైన మేఘము అనునట్లు, ఉదరముమ్ మేఱ్కుమ్ నిన్లుమ్ = ఉదరభాగమునందు, పడమటిదిక్కునందును నిలచియుండి, ఆరణ నూల్ తన్దు = వేదమను శాస్త్రమును ప్రవర్తింపజేసి, అరుళాల్ = కృపతో, అడైక్కలమ్ కొణ్డు అరుళుమ్ = (నన్ను) రక్ష్యవస్తువుగా పరిగ్రహించును.

ఇచటి దేవత - నారాయణుడు. వర్ణము - నీలము. ఆయుధములు - నాల్గు శంఖములు. దిక్కు - పడమర. పుండ్రస్థానము - ఉదరము.

అమృతోద్భవయా దేవ్యా సమాశ్లిష్ట మథోదరే ।
నారాయణం ఘనశ్యామం చతుశ్శంఖం నమామ్యహమ్ ॥

## (3) మాధవః

ఇందీవరదళశ్యామో మాధవ స్తు గదాధరః ।

నారాయణనామము సర్వేశ్వరుడు ఉభయవిభూతినిర్వాహకుడై, శ్రీవైకుంఠములో వేంచేసియుండు స్థితిని తెల్పినది. అట్లుండువాడు బ్రహ్మచారి నారాయణుడు కాడు, శ్రీమన్నారాయణుడే అనుటను మాధవ నామము తెల్పుచున్నది. శివపురాణమునందును- "వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగవతై స్సహ" (వైకుంఠమగు గొప్ప లోకములో, అన్ని లోకములకు స్వామి, మనస్సుతో చింతించుటకు వీలులేని స్వరూపమును కలవాడగు భగవానుడు విష్ణువు శ్రీదేవితో కూడియున్నవాడై గుణానుభవనిష్ఠులగు భక్తులతోను, కైంకర్యనిష్ఠులగు భాగవతులతోను కూడియున్నాడు) అని చెప్పబడినదికదా!

**(మాధవః)**- **'మా'** అను పదము శ్రీదేవిని చెప్పుచున్నది. **'ధవః'** అను పదము నాథుడను అర్థమును కల్గినది. **"మాయాః ధవః మాధవః"** అను రీతిలో మాధవుడను తిరునామము లక్ష్మీనాథుడను అర్థమును కల్గినది. **"మానేయ్ నోక్కి మడవాళై మార్బిల్ కొణ్డాయ్ మాదవా!"** (లేడి చూపులవంటి చూపులను కల లక్ష్మిని వక్షఃస్థలమున కల మాధవా!) అని నమ్మాళ్వార్లు ఈ అర్థమును మాధవ శబ్దార్థముగా అనుగ్రహించిరి. ఈ తిరునామమును భగవానుడు పరమపదములో లక్ష్మీదేవితో వేంచేసియున్న సన్నివేశమును తెలుపుచున్నదనుటను **"వానుడై మాదవా!"** (పరమపదమునుకల మాధవా) అని పెరియాళ్వార్లును, **"మామాయన్ మాదవన్ వైకున్దన్"** (గొప్ప ఆశ్చర్యభూతుడు, మాధవుడు, వైకుంఠమును కలవాడు) అని, **"మన్నిడ మాదవనోడు వైకున్దమ్ పుక్కిరుప్పారే"** (మాధవునితో సుస్థిరస్థానమగు వైకుంఠమును చేరియుందురు) అని గోదాదేవియు, **"కేశవన్ నారణన్ శీమాదవన్ కోవిన్దన్ వైకున్దన్"** (కేశువుడు, నారాయణుడు, మాధవుడు, గోవిందుడు, వైకుంఠుడు) అనియు, **"వడివుడై మాదవన్ వైకున్దన్"** (గొప్ప రూపమునుకల మాధవుడు, వైకుంఠుడు) అని నమ్మాళ్వార్లును అనుగ్రహించిరి. లక్ష్మీదేవి అన్ని దశలలోను భగవానుని విడిచియుండక, వెంటనేయుండునది కావున భగవానుని లక్ష్మీదేవిని విడిచి నిరూపింపవీలుకాదని, ఆమెను పుస్కరించుకొనియే నిరూపింపవలెననియు ఈ తిరునామము తెలియజేయుచున్నది. **"హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ"** అని వేదమును పరమపురుషుని లక్ష్మీపురస్సరముగానే నిరూపించినది. **"పేయాన్ ములైయుణ్డవాయాన్ మాదవనే"** ఇత్యాది సూక్తులలో లక్ష్మీపురస్సరమైన ఆశ్రయణమువలన విరోధినిరసనము సిద్ధించునని దివ్యసూరులు తెల్పిరి.

**"సర్వేషా మేవ లోకానాం పితా మాతా చ మాధవః, గచ్ఛధ్వ మేనం శరణం శరణ్యం పురుషర్షభాః"** (పురుషశ్రేష్ఠులారా ! అన్ని లోకములకు లక్ష్మీనాథుడే తల్లిగా, తండ్రిగానున్నాడు. కావున గొప్ప శరణమగు ఈ మాధవుని శరణు పొందుడు) అని పురుషకారరూపిణియగు లక్ష్మీదేవితోకూడిన నారాయణుడే మనకు ఉపాయముగను, స్వామిగను అగుచున్నాడు- అని భారతములో చెప్పబడినది. **"కడివార్ తీయ వినైకళ్ నొడియారు మళవైక్కణ్ కొడియా అడు పుళ్ ఉయర్త్త వడివార్ మాదవనారే"** (విరోధులను నశింపజేయు గరుత్మంతుని ధ్వజముగా ఎత్తిన,



సుందరమైన రూపమును కల మాధవుడు మన దుష్కర్మలను ఒక్కక్షణము పూర్తి అగు లోపలనే నశింపజేయును) అని ఆళ్వార్లును మాధవుడే ఉపాయమగుచున్నాడని తెలిపిరి. **"మాదవన్ పూతజ్గళ్"** (మాదవుని భూతములు) అని, **"మాదవనోడు వైకున్దమ్ పుక్కిరుప్పారే"** (మాధువునితో వైకుంఠమును చేరుదురు) అనియు మాధవుడే సర్వశేషిగను, మోక్షప్రాప్యభూతుడుగను అగుచున్నాడని సాయించిరి. సర్వేశ్వరుడు జగత్కారణమగునపుడును లక్ష్మీదేవికి ప్రేరకత్వరూపమైన అన్వయము కలదనుటను దివ్యసూరులు **"శాలమ్ పడైత్తవనై త్తిరుమార్బనై"** ఇత్యాది సూక్తులలో, వీరి సూక్తులను అనుసరించు ఆళవన్దార్, ఆళ్వాన్, భట్టర్ మొదలగువారు తమ స్తోత్రములలో అనుగ్రహించిరి. పెరియవాచ్చాన్‌పిళ్ళై కుమారులగు నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన చతుఃశ్లోకీవ్యాఖ్యానమునందును ఈ విషయము వివరింపబడినది. ఈ అంశము వివరణ సాపేక్షము. విస్తృతి భీతిచే వివరింప బడలేదు. భగవానుడు చేతనుల హృదయకమలములో పిరాట్టితో కూడియే వేంచేసియుండుననుటను **"సర్వభూతహృదబ్జస్థా"** అని బ్రహ్మపురాణమునందలి లక్ష్మీసహస్రనామస్తుతిలో, **"మార్వ మెన్బదోర్ కోయిలమైత్తు మాదవ నెన్నుమ్ దెయ్వత్తై నాట్టి"** (హృదయమను కోవెలను నిర్మించి, అందులో మాధవుడను దైవమును నిలిపి) అని పెరియాళ్వార్ల చేతను చెప్పబడినది. వ్యూహవిభావార్చావ తారములందుకూడ స్వామి లక్ష్మీసహితుడుగానే వేంచేసి యుండుననుట సకలప్రమాణసిద్ధము. **(మాధవః)** 'మా' అనుటచే పురుషోత్తముని పొందుటకు సాధనమగు పరవిద్య చెప్పబడుచున్నదని, ఆ విద్యకు ప్రవర్తకుడగుటచే ఇతడు మాధవుడనబడుచున్నాడనియు గ్రహింపవచ్చును. **"మా విద్యా చ హరేః ప్రోక్తా తస్యా ఈశో యతో భవాన్, తస్మా న్మాధవనామాఽసి ధవః స్వామీతి శబ్దితః"** ('మా' అని హరివగు నిన్ను ప్రతిపాదించు బ్రహ్మవిద్య చెప్పబడుచున్నది. దానికి స్వామియై యుండుటచే నీవు మాధవుడని చెప్పబడుచున్నావు) అని ఈ అర్థము హరివంశములో ఆదరింపబడినది. **"అఱియాదన అఱివిత్త అత్తా !"** అని ఆళ్వార్లు ఈ అర్థమును అనుసంధించిరి. **"మౌనా ద్ధ్యానాచ్చ యోగాచ్చ విద్ధి భారత ! మాధవమ్।"** (భరతకులములో పుట్టినవాడా! మౌనముచేతను, ధ్యానముచేతను, యోగముచేతను మాధవుని తెలిసికొనుము) అను వ్యాసమహర్షి సూక్తినిబట్టియు మాధవనామమునకు అర్థమును గ్రహింపవచ్చును. **"మధువిద్యావబోధ్యత్వాద్వా"**

(మధువిద్యచే తెలియబడువాడగుటచే మాధవుడనబడుచున్నాడు) అనుచు శంకరులు ఈ నామమునకు వ్యుత్పత్తిని తెలిపిరి. **"మధుకులే జాతత్వా న్మాధవః"** (మధుకులములో పుట్టినవాడగుటచే మాధవుడనబడుచున్నాడు) అనియు ఇంకొక అర్థమును చెప్పిరి. **"మా లక్ష్మీః, ధీః సరస్వతీ, తే అవతీతి మాధవః'** (మా అనగా లక్ష్మి, ధీ అనగా సరస్వతి, వీరిని ఇరువురను రక్షించువాడగుటచే మాధవుడనబడు-చున్నాడు) అనియు శంకరులు అర్థము చెప్పిరి. **"బాంధవవిశేషమాహ- మాతాపితృత్వం శ్రియా సహ సూచయతి- మాధవః"** అనుచు ఈ నామము లక్ష్మీనారాయణుల జగన్మాతృత్వపితృత్వరూపసంబంధములకు సూచకమని భట్టర్ తెల్పిరి. ఇట్లు పలు అర్థములను కల్గినదైనను ఈ నామమునకు అందఱి దివ్యసూరులచే ఆదరింపబడినదగు లక్ష్మీనాథుడను అర్థమునే ఈ సందర్భమున ప్రధానముగా గ్రహింపనగును. **"కోళరి మాతవన్"** ఇత్యాది సూక్తులలో మాధవనామము స్వామియొక్క రాసిక్యమునకు సూచకమనియు వ్యాఖ్యానింపబడినది. భగవానుని భక్తవాత్సల్యమునకు మాధవత్వము హేతువు అనుటను **"మాధవో భక్తవత్సలః"** అను ఆనుపూర్వి సూచింపబడుచున్నది. **"నారణన్ శీమాదవన్"** అనుచు ఈ అర్థమును ఆళ్వార్లు వ్యుత్క్రమమున అనుభవించిరి. భగవానుని దివ్యరూపము అడవికాచిన వెన్నెల కాకుండా సార్థకమును చేయు లక్ష్మీదేవి సాన్నిధ్యమును ఈ నామము తెలుపుచున్నదనుట **"ఇవ్వడివై తలైనీర్పాట్టిలే అనుభవిప్పార్ పిరాట్టియితే"** ఇత్యాది వ్యాఖ్యానసూక్తుల ద్వారా గమ్యము. ఇట్టి నామవిశేషములు అనేకము లున్నవి. ఇపుడు పెరియాళ్వార్ తిరుమొళిలోని ఈ నామపాశురము. దాని భావము.

**వైయ మెల్లామ్ వార్కడల్ వాళుమ్ మకరక్కుళై కొణ్డువైత్తేన్**
**వెయ్యవే కాదిల్ తిరియై యిడువన్ నీ వేణ్డియదెల్లామ్ తరువన్**
**ఉయ్య వివ్వాయర్ కులత్తినిల్ తోన్టియ వొణ్శుడరాయర్కొళున్దే !**
**మైయన్మైశెయ్ దిళవాయ్చ్చియరుళ్ళత్తు మాదవనే ! ఇజ్గే వారాయ్.**

భూమిని అంతటినీ మూల్యంగా పొందేటట్లు గొప్ప వెల కల్గినవి, విశాలమైన సముద్రంలో ఉన్న మొసలివలె ఉన్నవి అయిన కర్ణాభరణాలను తెచ్చాను చూడు. కండూతి (దురద) తీరేటట్లు చెవులలో కాడలను వెచ్చగా పెడతాను.



నీవు ఇష్టపడే భక్ష్యాలను ఇస్తాను. అందఱు ఉజ్జీవించేటట్లు ఈ గోకులానికి వచ్చి, జన్మించి, గొప్ప తేజస్సును కలవాడవై, గోపాలనాయకుడవైనవాడా! యువతులైన గోపికలను నీ సౌందర్యాదులతో మోహింపజేసి, వారి మనస్సులో ఎప్పుడూ నిలచి ఉండేవాడవై, నీ మనస్సులో స్థిరనివాసం కల్గిన లక్ష్మికి ప్రభువైన మాధవా! నీవు ఇక్కడకు రా!

ఇక తిరువాయ్మొళిలోని పాశురము, దాని భావమును.

**మాతవ నెన్ఱతే కొణ్డు ఎన్నై యిని యిప్పొప్పట్టతు**
**యాతవజ్గళుమ్ శేర్ కొడే నెన్ఱు ఎన్నుళ్ పుకున్దిరున్దు**
**తీతవమ్ కెడుక్కు మముతమ్ శెన్దామరైక్కట్కున్ఱమ్**
**కోతవమిలెన్ కన్నల్కట్టి యెమ్మా నెన్ కోవిన్దనే**

నాకోసం కృష్ణుడై అవతరించిన భగవానుడు, మాధవుడని నేను నోటితో పల్కిన మాత్రంతోనే నా విషయంలో "ఇకపై ఉండే కాలం అంతా ఏ కొఱత లేకుండా ఇతనిని చేస్తాను'' అని సంకల్పించి, నాలో ప్రవేశించి ఉండి, పలు రీతులలోని నాపాపాలను తీర్చి అనుగ్రహిస్తున్న పరమభోగ్యుడై, ఎఱ్ఱని తామరలవంటి నేత్రాలను కలవాడై, పర్వతంవలె స్థిరంగా ఉండి, ఏదోషం, ఏ కొఱత లేని బెల్లపు ముక్కవలె నాకు పరమభోగ్యుడై ఉన్నాడు.

పన్నిరు నామములోని ఈ నామ పాశురము, దాని అర్థమును.

**మాదవనామముమ్ వాన్ కతై నాన్గు మణి నిఱముమ్**
**ఓదు ముఱైప్పడి యేన్ది యురత్తిలు మేలు మల్కి**
**పోదలర్ మాదుడన్ పున్దియిల్ అన్బాల్ పుకున్దళిక్కుమ్**
**తూదను నాదనుమాయ్ తొల్ల త్తికిరి చ్చుడరే**

తూతనుమ్ నాదనుమ్ ఆయ్ = (పాండవులకు) దూతయై, (అందఱికిని) స్వామియైయున్న, తొల్ అత్తి కిరి చ్చుడర్ = అనాదియైన హస్తిగిరిలో నున్న తేజోరూపమగు వరదరాజస్వామి, మాదవ నామముమ్ = మాధవుడను తిరునామమును, వాన్ కతై నాన్గుమ్ = బలమైన గదలను నాల్గింటిని, మణి నిఱముమ్ = (ఇంద్రనీల) మణివర్ణమును, ఓదుమ్ ముఱైప్పడి = (శాస్త్రములలో)

చెప్పబడు రీతిలో, ఏన్ది = ధరించి, ఉరత్తిలుమ్ మేలుమ్ = వక్షఃస్థలమున, ఊర్ధ్వదిశలో, మల్కి = ఉండి, అన్బాల్ = (నాపట్ల) వాత్సల్యముతో, పున్దియిల్ = (నా) మనస్సులో, పోదు అలర్ మాదుడన్ = పుష్పనివాసిని యగు లక్ష్మీదేవితో, పుకున్దు = ప్రవేశించి, అళిక్కుమ్ = కాపాడుచున్నాడు.

ఇచటి భగవన్మూర్తి - మాధవుడు, వర్ణము - ఇంద్రనీలము, ఆయుధ ములు- నాల్గు గదలు. దిశ - ఊర్ధ్వదిశ. పుండ్రస్థానము -వక్షఃస్థలము.

**నిత్యం కమలయా శ్లిష్టం హృదయేఽహం దయాంబుధిమ్ ।**
**మాధవం మణిభంగాభం చింతయామి చతుర్గదమ్ ॥**

## (4) గోవిందః

### గోవిందో దక్షిణే పార్శ్వే ధన్వీ చంద్రప్రభో మహాన్

ఇట్లు అచ్యుతుడుగను, గోవిందుడుగను, కేశవుడుగను, నారాయణుడను అసాధారాణనామమును కల్గినవాడుగను, పిరాట్టితో కూడినవాడుగను వేంచేసియున్నాడు స్వామి- అను అర్థము ఇంతవరకు చెప్పబడినది. ఇట్టి గొప్పతనమును కల్గినవాడుగా ఇతడు వేంచేసియున్నాడనుటకు ప్రమాణ మేమి? అను ప్రశ్న ఉదయింపగా, వేదవాక్యములే ఇచట ప్రమాణము అనుటను ఈ గోవిందనామము తెల్పుచున్నది. గోశబ్దముచే వేదవాక్యములు చెప్పబడుటచే, వేదవాక్యములచే ప్రతిపాదింపబడువాడు- అని ఈ గోవిందనామమునకు అర్థము. ఇతడు తన దాసులను జారవిడువని అచ్యుతుడనుటకు ప్రమాణము - **"శాశ్వతం శివ మచ్యుతం నారాయణమ్"** అని నారాయణానువాకము. త్రివిధపరిచ్ఛేద రహితుడుగను, అంతులేని రూపగుణవిభవములను కలవాడుగనునున్న అనంతుడు అనుటకు - **"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ", "యదేక మవ్యక్త మచింత్యరూపమ్", 'అనంత మవ్యయం కవిమ్ సముద్రేఽంతమ్"** మొదలగు తైత్తిరీయోపనిషద్వాక్యము లును, **"అనంత శ్చాత్మా విశ్వరూపో హ్యకర్తా"** అను శ్వేతాశ్వతరవాక్యమును ప్రమాణములు. ఈ పరమపురుషుడే పలు అవతారములను ఎత్తి, అధములతో ఎట్టి భేదము లేక కలిసి, వ్యవహరించు గోవిందుడు అనుటకు ప్రమాణము **"అజాయమానో బహుధా విజాయతే, తస్య ధీరాః పరిజానంతి యోనిమ్"**



(కర్మమూలక జన్మ లేని పురుషోత్తముడు పలు రీతులలో అవతరించుచున్నాడు. బుద్ధిమంతులలో గొప్పవారే అతని జన్మరహస్యమును తెలిసికొనుచున్నారు.), **"యువా సువాసాః పరివీత ఆగాత్, స ఉ శ్రేయాన్ భవతి జాయమానః"** (యౌవనమును కలవాడుగను, అందమైన పీతాంబరమును దాల్చినవాడుగను, నిత్యసూరులచే కూడియున్నవాడుగను ఆ పరమపురుషుడు ఆవిర్భవించినాడు. అతడు జన్మించిన పిమ్మటనే గొప్పతనమును పొందుచున్నాడు. అతనిని జ్ఞానులగు కవులు తెలిసికొనుచున్నారు), **"పితా పుత్రేణ పితృమాన్ యోనియోనౌ నావేదవి న్మనుతే తం బృహంతమ్"** (అన్ని లోకములకు తండ్రి అగు పురుషోత్తముడు అన్ని అవతారములయందును తనచే జన్మింపజేయబడిన ఒకనిని తండ్రిగా గొని జన్మించుచున్నాడు. వేదమును తెలియనివాడు అతని మహిమను తెలియలేడు) అను మొదలగునవి. బ్రహ్మరుద్రాదులకును ఉత్పాదకుడై, పొగడబడు కేశమును కలవాడైయున్న కేశవుడితడే అనుట - **"నారాయణాత్ బ్రహ్మ జాయతే, నారాయణాద్రుద్రో జాయతే"** (నారాయణునివలన బ్రహ్మ పుట్టుచున్నాడు. నారాయణునివలన రుద్రుడు జన్మించుచున్నాడు), **"హిరణ్యకేశః"** (సువర్ణమువలె ఆకర్షణీయమైన కేశములను కలవాడు) మొదలగు వేదవాక్యములు ఉద్ఘోషించు చున్నవి. ఇతడు నారాయణుడై వేంచేసియున్న స్థితియును **"విశ్వం నారాయణమ్"** అని ప్రారంభించి, **"నారాయణః పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః, నారాయణః పరో జ్యోతి రాత్మా నారాయణః పరః, యచ్చ కించిత్ జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా, అంతర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"** అని నారాయణానువాకమునందును, **"ఏకో హ వై నారాయణ ఆసీత్"** మొదలగు వాక్యములతో మహోపనిషత్తునందును, **"చక్షు శ్చ ద్రష్టవ్యం చ నారాయణః, శ్రోత్రం చ శ్రోతవ్యం చ నారాయణః"** అని మొదలిడి, **"దిశ శ్చ ప్రదిశ శ్చ సర్వం నారాయణః"** అని సుబాలోపనిషత్తులో, **"ఏష సర్వభూతాంతరాత్మా.......... ఏకో నారాయణః"** అని అంతర్యామిబ్రాహ్మణమునందును, ఇంకను నారాయణోపనిషత్తు మొదలగువానియందును ఘోషింపబడినవి.

ఇట్టి గొప్పతనమును కల ఈస్వామి లక్ష్మీదేవితోకూడియే వేంచేసి యుండుననుట. **"హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ"** (నీకు శ్రీదేవి భూదేవులు పత్నులు) **"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"** (ఈ పిరాట్టి ఈ జగత్తుకు ఈశ్వరిగను, విష్ణువునకు

పత్నిగను నున్నది), "శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే" (శ్రద్ధాశబ్దవాచ్యయగు పిరాట్టిచేతనే ఈశ్వరుడు ఈశ్వరత్వమును పొందుచున్నాడు), "ఆనీదవాదమ్ స్వధయా తదేకమ్" (ఎవ్వరు లేని ప్రళయకాలమున స్వధాశబ్దముచే చెప్పబడు పిరాట్టితోకూడిన భగవానుడొక్కడే ఉన్నాడు) మొదలగు శ్రుతి వాక్యములలో సముద్ఘోషింపబడినది. "నమ్ కోవిన్దన్ కుడికొణ్డాన్" అనుచు నమ్మాళ్వార్లు గోవిందుని రూపమున తమమనస్సున నిత్యవాసమేర్పరచు కొన్నాడనుట గోవిందనామముపై వారికిగల ఆదరాతిశయమును తెలుపుచున్నది.

కావున ఇట్లు అచ్యుతాదినామములను, వానిలో చెప్పబడిన గొప్ప తనమును కలవాడు సర్వేశ్వరుడు అనుటకు ప్రమాణము వేదము అని గోవింద నామముచే ఘోషింపబడుచున్నది. ఈ గోవిందనామములో గల మిగిలిన అర్థములు పూర్వమే గోవిందనామమును వివరించునపుడు చూపబడినవి. ఆ గోవింద నామముచే సౌలభ్యగుణప్రకాశమగు కృష్ణావతారము అనుభవింపబడినది. ఇచట వేదప్రతిపాద్యత్వమనెడి పరత్వము చెప్పబడుచున్నది. కావున పునరుక్తి లేదు. **"మాదవా! కోవిన్దా!", "కేశవనై నారణనై మాదవనై", "శీమాదవన్ కోవిన్దన్"** మొదలైన సూక్తులలో ఆళ్వార్లుకూడ మాధవనామము తరువాత గోవిందనామాను సంధానమును చేసిరి.

ఇక, పెరియాళ్వార్ తిరుమొళిలోని ఈ నామపాశురము, దాని భావమును -

**వణవన్దుడైయ వైర క్కడిప్పిట్టు వార్ కాదు తాళ ప్పెరుక్కి**
**క్కుణవన్దుడైయరి క్కోపాలపిళ్ళైగళ్ గోవిన్దా! నీ శొల్లు క్కొళ్ళాయ్,**
**ఇణైనన్దళగియ విక్కడిప్పిట్టా లినియ పలా ప్పళమ్ తన్దు**
**శుణన్దణిముల్లై యుణ్ణ త్తరువన్ నాన్ శోత్తమ్ పిరా నిఙ్గే వారాయ్**

ఈ గోపాలురు తమ దీర్ఘమైన చెవులు భుజాలవరకు సాగేటట్లు పెద్దవి చేసికొని, చక్కని వర్ణాన్ని కల, వజ్రాలు పొదిగిన కర్ణాభరణాలను అలంకరించుకొని తమ తల్లులు చెప్పినట్లు బుద్ధిగా ఉన్నారు. గోవిందా ! నీవు చూస్తే తల్లి అయిన నా మాటను వినడం లేదు. ఈవిధంగా కాకుండా నా మాటను విని, ఒకదానితో ఇంకొకటి తగినట్లున్న, చాలా అందంగా ఉండే ఈ కర్ణాభరణాలను అలంకరించు



కొంటే, నేను తీయని పనసపండును ఇచ్చి, నా స్తన్యాన్నికూడా నీవు త్రాగేటట్లు ఇస్తాను. స్వామీ ! నిన్ను స్తుతిస్తున్నాను. ఇక్కడకు రా.

తిరువాయ్‌మొళి లోని ఈ నామంతో అంకితమైన పాశురం, దానిభావం.

**కోవిన్దన్ కుడుక్కూత్తన్ కోవల నెన్దెన్దే కునిత్తు**
**తేవుమ్ తన్నైయుమ్ పాడియాడ త్తిరుత్తి ఎన్నై క్కొణ్డెన్**
**పావన్దన్నైయుమ్ పాఱక్కైత్తు ఎమరేళెళుపిఱప్పుమ్**
**మేవుమ్ తన్మైయ మాక్కినాన్ వల్లనెమ్బిరాన్విట్టువే**

సర్వశక్తిమంతుడు, నాకు ఉపకారాలను చేసినవాడు అయిన విష్ణువు మాకు ఏమి చేశాడు? అని అంటే, గోవిందుడని, కుంభనృత్యాన్ని చేసినవాడు అని, గోపాలుడని - ఇటువంటి తిరునామాలనే పల్కి, నృత్యంచేసి, పరత్వాన్ని, సౌలభ్యాన్ని కీర్తించి పాడి సంచరించేటట్లుగా కటాక్షించి, నన్ను కింకరునిగా చేసికొని, నా పాపాలను పూర్తిగా పోగొట్టి, మాతో చేరినవారు ఏడేడు జన్మలలోను తనను చేరేటట్లుండే స్వభావాన్ని కలిగేవారినిగా మమ్ములను చేశాడు.

పన్నిరు నామంలోని ఈ నామపాశురం, దాని అర్థం.

**కోవిన్ద నెన్డు ఙ్కుళిర్ మది యాకి క్కొడియవరై**
**యేవున్దనుక్కళుడన్ తెఱ్కిలు ముట్కళుత్తు నిన్డు**
**మేవు న్తిరువరుళాల్ వినై తీర్త్తు ఎనై యాణ్డరుళుమ్**
**పూవ న్తొళ వత్తిమామలైమే నిన్ద పుణ్ణియనే**

పూవన్ =నాభీకమలములో అవతరించిన బ్రహ్మ, తొళ = సేవించునట్లు, అత్తి మా మలైమేల్ నిన్ద = శ్రీహస్తిగిరి యందు స్థిరముగా నిలచియున్నవాడు, పుణ్ణియన్ = పుణ్యస్వరూపుడగు వరదరాజస్వామి, కోవిన్దన్ = గోవిందుడుగను, ఎన్డుమ్ కుళిర్ మది = (వర్షములో) ఎల్లప్పుడు చల్లని చంద్రుడుగను, ఆకి = అయినవాడై, కొడియవరై ఏవుమ్ =దుష్టులను నశింపజేయుచున్న, తనుక్కళుడన్ = నాల్గు ధనుస్సులతో, తెఱ్కిలుమ్ = దక్షిణ దిశలోను, ఉట్కళుత్తుమ్ = కంఠముయొక్క లోపలవైపున, నిన్డు = నిలచియుండి, మేవుమ్ తిరు అరుళాల్ = నిండుగా నున్న

గొప్ప కృపతో, వినై తీర్‌త్తు = పాపములను పోగొట్టి, ఎనై ఆణ్డరుళుమ్ = నన్ను సేవకునిగా గొని దయజేయును.

ఇచటి మూర్తి - కోవిందుడు. వర్ణము- చంద్రవర్ణము. ఆయుధములు- నాల్గు ధనుస్సులు. దిక్కు -దక్షిణము. పుండ్రస్థానము- కంఠము లోపలివైపు.

దేవ్యా చ చంద్రశోభిన్యా దేవం కంఠే విరాజితమ్ ।
చంద్రభాసం చతుశ్శార్‌ఙ్గం గోవింద మహ మాశ్రయే ॥

## (5) విష్ణుః

ఉత్తరే హలభృద్విష్ణుః పద్మకింజల్కసన్నిభః

ఇట్లు కేశవాది నాల్గు నామములతో పరత్వము తెలుపబడినది. ఇక , విష్ణునామములో నాల్గవ వ్యూహమగు అనిరుద్ధమూర్తి చెప్పబడుచున్నది. ఇచట **"సృష్టిస్థితిసంహారార్థమాకవుమ్, సంసారిసంరక్షణార్థమాకవుమ్, ఉపాసకానుగ్రహార్థమాకవుమ్, సంకర్షణప్రద్యుమ్నానిరుద్ధరూపేణ నిఱ్కుమ్ నిలై. పరత్వత్తిల్ జ్ఞానాదికళాఱుమ్ పూర్ణమాయిరుక్కుమ్. వ్యూహత్తిల్ ఇవ్విరణ్డు గుణమ్ ప్రకటమాయిరుక్కుమ్. అదిల్ సంకర్షణర్ జ్ఞానబలఙ్గళ్ ఇరణ్డోడుమ్ కూడి జీవతత్త్వత్తై అధిష్ఠిత్తు, అత్తై ప్రకృతియిల్ నిన్ఱుమ్ వివేకిత్తు. ప్రద్యుమ్నావస్థైయై భజిత్తు, శాస్త్రప్రవర్తనత్తైయుమ్, జగత్సంహారత్తైయుమ్ పణ్ణక్కడవరాయిరుప్పర్. ప్రద్యుమ్నర్ ఐశ్వర్యవీర్యఙ్గళోడుమ్ కూడి మనస్తత్త్వత్తై అధిష్ఠిత్తు, ధర్మోపదేశత్తైయుమ్, మనుచతుష్టయమ్ తొడక్కమాన శుద్ధవర్గసృష్టియైయుమ్ పణ్ణక్కడవరాయిరుప్పర్. అనిరుద్ధర్, శక్తితేజస్సుక్కళ్ ఇరణ్డోడుమ్ కూడి రక్షణత్తుక్కుమ్, తత్త్వజ్ఞానప్రదానత్తుక్కుమ్, కాలసృష్టిక్కుమ్, మిశ్రసృష్టిక్కుమ్ కడవరాయిరుప్పర్"** (వ్యూహమనగా- సృష్టిస్థితి సంహారములకొఱకును, సంసారి సంరక్షణకొఱకును, ఉపాసకుని అనుగ్రహముకొఱకును, సంకర్షణ-ప్రద్యుమ్న-అనిరుద్ధరూపములలోనుండు స్థితి. పరత్వమునందు జ్ఞానాదులు ఆఱు గుణములును పూర్ణములుగా నుండును. వ్యూహములో రెండు రెండు గుణములను స్పష్టములుగా నుండును. ఈ మూడు వ్యూహరూపములలో- సంకర్షణుడు జ్ఞానబలములను రెండిటిని కలవాడై, జీవతత్త్వమును అధిష్ఠించి, దానిని



ప్రకృతినుండి వివేకించి (విభజించి), ప్రద్యుమ్నావస్థను పొంది, శాస్త్ర ప్రవర్తనమును, జగత్తుయొక్క సంహారమును చేయువాడైయుండును. ప్రద్యుమ్నుడు ఐశ్వర్య, వీర్యములను కలవాడై, మనస్తత్త్వమును అధిష్ఠించి, ధర్మోపదేశము, మనుచతుష్టయము మొదలగు శుద్ధవర్గసృష్టిని చేయువాడై యుండును. అనిరుద్ధుడు, శక్తితేజస్సులను రెండిటిని కల్గి, రక్షణను, తత్త్వజ్ఞాన ప్రదానమును, కాలసృష్టిని, మిశ్రసృష్టిని చేయువలసినవాడై యుండును) అని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు తత్త్వత్రయములో అనుగ్రహించిన శ్రీసూక్తులు ఇచట అనుసంధేయములు. విష్ణుశబ్దముచే చెప్పబడువాడు అనిరుద్ధుడేనని నిర్ణయించుట ఎట్లు? అనగా, **"త్రిపా దూర్ధ్వ ముదైత్పురుషః పాదోస్యేహాభవాత్పునః, తతో విష్వఙ్ వ్యక్రామత్ సాశనాఽనశనే అభి"** (పరమపదములో ఈ పరమపురుషుడు మూడు రూపములను కలవాడై సంకల్పించెను. పరమపదనాథుని ఒక అవతారమైన అనిరుద్ధుడు తిరిగి ఇచట అవతరించెను. దానికి పిమ్మట సకలవిధచేతనులను రక్షించుటకై ఈ లోకమునంతటిలో అవతారముచేయుటద్వారా వ్యాపించెను) అని పురుషసూక్తమున అనిరుద్ధునిగూర్చి విష్ణుశబ్దార్థము అనుసంధింపబడినది. మఱియు, అనిరుద్ధుడే బ్రహ్మరుద్రులకు మధ్యలో పద్మనాభుడగు విష్ణువుగా అవతరించెను అని శాస్త్రములు చెప్పుటచేతను, కార్యవాచిశబ్దము కారణమును చెప్పును కనుక, పద్మనాభుడని ప్రథమావతారమగు అనిరుద్ధనారాయణుని చెప్పనగును.మిగిలిన వ్యూహములు రెండును ఉండగా ఇచట అనిరుద్ధుని మాత్రమే చెప్పుట ఎందులకు? అనినచో **"పద్మనాభాదికా స్సర్వే వైభవీయా స్తథైవ చ, షట్త్రింశత్ సంఖ్యాసంఖ్యాతాః ప్రాధాన్యేన గణేశ్వర, షట్త్రింశద్భేదభిన్నా స్తే పద్మనాభాదికా స్సురాః, అనిరుద్ధా త్సముత్పన్నాః దీపాద్దీపా ఇవేశ్వరాః"** (విష్వక్సేనా! పద్మనాభుడు మొదలగు ముఖ్యమైన విభవావతారములు ముప్పది ఆఱు. ఇట్లు పద్మనాభుడు మొదలగు ముప్పది ఆఱు విభవమూర్తులును, దీపమునుండి పుట్టిన ఇంకొక దీపములవలె, అనిరుద్ధమూర్తినుండి అవతరించిరి) అని విష్వక్సేనసంహితలో చెప్పబడినట్లే, పిమ్మట చెప్పబోవు పద్మనాభుడు, త్రివిక్రముడు, వామనుడు, దామోదరుడు అను మూర్తులకు మూలమూర్తి అనిరుద్ధుడే అగుటచే ఆ మూర్తి ఇచట నిర్దేశింపబడినది. ఇక విష్ణుశబ్దముయొక్క అర్థవైభవమును ఇక గమనించెదము.

"**తతో విష్వఙ్ వ్యక్రామత్**" అని అవతారముచే వ్యాపించియుండునది విష్ణుశబ్దార్థమని పురుషసూక్తములో చెప్పబడినది. "**వ్యాప్య సర్వా నిమాన్ లోకాన్ స్థిత స్సర్వత్ర కేశవః, తత శ్చ విష్ణునామాఽసి విశో ర్ధాతోః ప్రవేశనాత్**" (కేశవుడవనబడు నీవు ఈ అన్ని లోకములను అంతటా వ్యాపించియున్నావు. అందుకే విష్ణువను తిరునామమును కలవాడవైయున్నావు. ఏల అన- 'విశ' అను ధాతువునకు ప్రవేశించుట అను అర్థముండుటచే) అని శ్రీవరాహపురాణములో చెప్పబడిన రీతిలో అంతటను తన స్వరూపముతో వ్యాపించియుండువాడు విష్ణువు- అను అర్థమును చెప్పవచ్చును. "**పరన్ద తణ్ పరవైయుళ్ నీర్ తొఱుమ్ పరన్దుళన్ పరన్ద వణ్డమిదెన**" అనుచు ఈ వ్యాప్తిని ఆళ్వార్లు కీర్తించిరి. "**యస్మా ద్విష్ట మిదం సర్వం తస్య శక్త్యా మహాత్మనః, తస్మా త్స ప్రోచ్యతే విష్ణుః విశో ర్ధాతోః ప్రవేశనాత్**" (మహాత్ముడగు ఆ పరమపురుషుని శక్తితో ఈలోకమంతయు వ్యాపించి యుండుటచే అతడు విష్ణువనబడుచున్నాడు- 'విశ' అను ధాతువు వ్యాపించుటను చెప్పుటచే) అని విష్ణుపురాణమునందు, ఆదిత్యపురాణమునందును చెప్పబడిన రీతిలో శక్తిచే అన్ని వస్తువులను వ్యాపించియుండువాడు అను అర్థము తెలుపబడినది. "**వ్యాప్య మే రోదసీ పార్థ ! కాంతి రభ్యధికా స్థితా, సంసారవేశనాత్ పార్థ! విష్ణు రిత్యభిసంజ్ఞితః**" (పార్థా! నాయొక్క, మిక్కిలి అధికమైన కాంతి ఆకాశమునంతటిని వ్యాపించియున్నది. ఇట్లు ఈలోకము అంతట వ్యాపించి యుండుటచే నేను విష్ణుశబ్దముచే చెప్పబడుచున్నాను) అని మహాభారతములో చెప్పబడిన రీతిలో సర్వవ్యాపియగు విగ్రహకాంతిని కలవాడనుటను విష్ణుశబ్దమునకు అర్థమును గ్రహింపవచ్చును. "**యథా సర్వగతో విష్ణుః**" (విష్ణువు ఎట్లు సర్వవ్యాపియో) అని శ్రీవిష్ణుపురాణమునందును చెప్పబడిన రీతిలో విగ్రహముతో అంతట వ్యాపించియున్నాడు- అను అర్థమును కూడ గ్రహింపవచ్చును. ఈ అర్థములన్నియు "**విష్ణు ర్విక్రమణా ద్దేవః**" అని భారతము ఉద్యోగపర్వములో వివరింపబడినవి. ఇట్లు ఇతడు అన్నిటిని వ్యాపించి, ప్రకాశించుటచే అన్నియు అతడే అని చెప్పదగినట్లున్నాడనుటను "**జ్యోతీంషి విష్ణు ర్భువనాని విష్ణు ర్వనాని విష్ణు ర్గిరయో దిశశ్చ, నద్య స్సముద్రా శ్చ స ఏవ సర్వం యదస్తి య న్నాస్తి చ విప్రవర్య**" (విప్రశ్రేష్ఠా ! జ్యోతిస్సులు, విష్ణువే. భవనములును విష్ణువే. వనములును విష్ణువే. పర్వతములు, దిక్కులు, నదులు, సముద్రములు, సచ్ఛబ్దవాచ్యములగు జీవులు, అసచ్ఛబ్దవాచ్యములగు అచిత్తును - అన్నియు భగవానుడగు విష్ణువే) అనుచు విష్ణుపురాణము ఉద్ఘోషించినది. భగవానునకు చరాచరములతో గల వ్యాప్యవ్యాపక సంబంధమును, భగవానుని ఆధిక్యమును, ఈ నామము తెల్పుచున్నదనుచు - "**తై స్తైః ప్రకారైః అధికేన భగవతా వ్యూనానామ్ స్వవ్యతిరిక్తానామ్ అవినాభావః తార్కికప్రసిద్ధః. అత్ర వ్యాప్తిః అభిమతా- న తదస్తి వినా యత్ స్యాత్ మయా భూతం చరాచరమ్**" అని భట్టర్ పల్కిరి. "**ఎఙ్గుమ్ తానాయ నఙ్గళ్ నాదనే**" అని ఆళ్వార్లును వచించిరి. "**అస్య జానంతో నామ చిద్వివక్తన మహస్తే విష్ణో సుమతిం భజామహే**" (విష్ణుదేవా ! నీ తిరునామమును తెలిసిన మేము నీయొక్క గొప్ప తేజస్సును, స్వచ్ఛమైన జ్ఞానమును భజింతుము) అని ఋగ్వేదమును, "**తద్విష్ణోః పరమం పదమ్**" అని, "**విష్ణో ర్యత్పరమం పదమ్**" అని, "**శంనో విష్ణు రురుక్రమః**" అనియు, "**విష్ణుక్రాంతే వసుక్రాంతే**" అనియు, "**విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః**" (విష్ణువుయొక్క గొప్ప శ్రీపాదమునుండి అమృతధార స్రవించుచున్నది) అనియు, మఱియు పలు పలు వేదవాక్యము లందును మిక్కిలి ఆదరింపబడినది.



ఇపుడు పెరియాళ్వార్ తిరుమొళిలోని ఈ నామపాశురము, దాని భావమును.

> **శోత్తమ్ పిరాన్ ఎన్ఱిరన్దాలుమ్ కొళ్ళాయ్ శుళిక్కుళలారొడు నీ పోయ్**
> **కోత్తుక్కురవై పిణైన్దిఙ్గువన్దాల్ కుణమ్ కొణ్డిడువనో నమ్బీ !**
> **పేర్త్తుమ్ పెరియన వప్పమ్ తరువన్ పిరాన్ తిరియిడవొట్టిల్**
> **వేయ్ త్తడన్తోళార్ విరుమ్బు కరుఞ్కుళల్ విట్టువే! నీ యిఙ్గే వారాయ్ !**

"స్వామీ ! నీకు ఒక అంజలి" అని పల్కి, రావాలి మనస్సులో వేడుకొన్నా, నీవు నామాటను విని రావడంలేదు. గుణపూర్ణా ! నీవు ఉంగరాల జుట్టును కల స్త్రీలతో ఏకాంతస్థలంలోకి పోయి, వారితో చేతులను కలిపి, రాస క్రీడ ఆడి, తరువాత ఇక్కడకు వస్తే, నీవు ఆ విధంగా చేయడం నీకు తగినదిగా ఒప్పుకొంటానా ! ఉపకారకుడా ! కాడను నీ చెవిలో పెట్టడానికి నీవు అంగీకరిస్తే, మళ్ళీ మళ్ళీ పెద్ద పెద్ద అప్పాలను నీకు ఇస్తాను. వెదుళ్ళవలె పెద్ద బాహువులను కల స్త్రీలు అభిలషించేటట్లుగా ఉన్న నల్లని కేశపాశాన్ని కల విష్ణూ ! నీవు ఇక్కడకు రా !

తిరువాయ్‌మొழிలోని ఈ నామపాశురము, దాని భావము.

విట్టిలఙ్గు శెఙ్జోది త్తామరైపాదమ్ కైకళ్ కణ్‌గళ్
విట్టిలఙ్గు కరుఞ్జుడర్ మలైయే తిరువుడమ్బు
విట్టిలఙ్గు మదియమ్ శీర్ శఙ్గు శక్కరమ్ పరిది
విట్టిలఙ్గు ముడియమ్మాన్ మదుశూదనన్‌తనక్కే.

చక్కగా ప్రకాశిస్తున్న కిరీటాన్ని కలవాడు, మధువు అనే అసురుని సంహరించిన స్వామికి శ్రీపాదాలు, శ్రీకరాలు, తిరునేత్రాలు విరిసి వెలిగే, ఎఱ్ఱని కాంతిని కల తామరపూవులే. దివ్యదేహం అయితే- బాగా వెలిగే నీలవర్ణ ప్రభను కల కొండవంటిది. గొప్ప పాంచజన్యశంఖం చక్కగా వెలిగే చంద్రునివంటిది, శ్రీసుదర్శనం సూర్యునివంటిది.

పన్నిరు నామములోని ఈ నామపాశురము, దాని అర్థమును.

విట్టు వల వయిற్றిన్‌కణ్ వడక్కుమ్ విడాదు నిన్ఱు
మట్టవిழ் తామరైత్తూతు నిఱఙ్కొణ్డ మేనియనాయ్
తొట్ట కలప్పైకళ్ ఈరిరణ్డాలు న్తుయరఱుక్కుమ్
కట్టెழிల్‌శోలై క్కరికిరిమేనిన్ఱ కఱ్పకమే

కట్టు ఎழிల్ శోలై = మిక్కిలి అందమైన తోటలచే చుట్టబడిన, కరి కిరిమేల్ నిన్ఱ= హస్తిగిరిపై వేంచేసియున్న, కఱ్పకమ్ = కల్పవృక్షమువంటి, వరదరాజస్వామి, విట్టు = విష్ణువైయుండి, వల వయిற్றిన్‌కణ్ = ఉదరముయొక్క కుడివైపున, వడక్కుమ్ = ఉత్తరదిక్కున, విడాదు నిన్ఱు = విడువక నిలచియుండి, మట్టు అవిழ் =తేనె స్రవించుచున్న, తామరై త్తూతు నిఱమ్ కొణ్డ మేనియనాయ్ = తామరపూవులోని మకరందముయొక్క వర్ణమును కల దివ్యదేహమును కలవాడై, తొట్ట కలప్పైకళ్ ఈర్ ఇరణ్డాలుమ్ = (చేతిలో) ఎత్తి దాల్చిన నాగళ్ళను నాల్గింటితో, తుయర్ అఱుక్కుమ్ = (నా) దుఃఖమును పోగొట్టును.

ఇచటి భగన్మూర్తి - విష్ణువు. వర్ణము - తామరపూవులోని తేనెరంగు (బంగారురంగు). ఆయుధములు - నాల్గు హలములు. దిక్కు - ఉత్తరము. పుంద్రస్థానము- ఉదరమున కుడివైపు



విష్ణుపత్న్యాఖ్యయా దేవ్యా కుక్షౌ దక్షిణపార్శ్వకే ।
విష్ణుం చతుర్హలం వందే పద్మకింజల్కసన్నిభమ్ ॥

## (6) మధుసూదనః

### ఆగ్నేయ్యా మరవిందాభః ముసలీ మధుసూదనః

**"తస్మా ద్విరాడజాయత"** (ఆ అనిరుద్ధనారాయణునివలన బ్రహ్మ ఉద్భవించెను) అని పురుషసూక్తమునందు, **"తురీయోఽయం జగన్నాథో బ్రహ్మాణ మసృజ త్ప్రభుః"** (నాల్గవ మూర్తియగు ఈ అనిరుద్ధుడు బ్రహ్మను సృష్టిచేసెను) అని విష్వక్సేనసంహితలోను చెప్పబడిన రీతిలో బ్రహ్మను సృష్టించినవాడగు అనిరుద్ధమూర్తి విష్ణుశబ్దముచే చెప్పబడినాడు. మఱియు, ఆ బ్రహ్మను ఉత్పాదనము చేయుటయేగాక, అతని దుఃఖము కల్గినపుడు దానిని పోగొట్టువాడును అతడే అనుటను ఈ మధుసూదననామము తెలుపుచున్నది. కేశవుడనుచు ప్రారంభించి, గోవిందనామమువరకు పరత్వము తెలుపబడినది. విష్ణునామముతో వ్యూహము చెప్పబడినది. ఈ మధుసూదననామమునుండి విభవావతారము వివరింపబడుచున్నది. **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై"** (ఎవడు బ్రహ్మను మొదట సృష్టించి, అతనికి వేదములను ఉపదేశించెనో) అని వేదములో చెప్పబడిన రీతిలో సర్వేశ్వరుడు వేదములను బ్రహ్మకు ఉపదేశించెను. నాల్గు శిశువుల రూపములోనున్న ఆ నాల్గు వేదములను మధు, కైటభులను ఇరువురు అసురులు బ్రహ్మనుండి అపహరించి, తీసికొనిపోయి, రసాతలములో దాచియుంచిరి.వేదములను కోల్పోయిన ఆ బ్రహ్మయు "కన్నులను పోగొట్టుకొంటిని, ధనమును కోల్పోయితిని" అనుచు కేశవుని ప్రార్థించెను. అతని ప్రార్థనను వినిన కరుణాసముద్రుడగు భగవానుడు హయగ్రీవావతారమును ఎత్తి, మధుకైటభులను సంహరించి, బ్రహ్మకు వేదములను తిరిగి ఇచ్చెను. ఇట్లు ప్రథమజుడగు (మొదట పుట్టినవాడగు) బ్రహ్మకు చేసిన ఉపకారమగుటచే ఇది అవతారములలో ముందుగా అనుసంధింపబడుచున్నది.

**(మధుసూదనః)** - మధువను అసురుని మట్టుబెట్టినవాడు. **"కర్ణమిశ్రోద్భవం చాపి మధునామ మహాసురమ్, బ్రహ్మణోఽపచితిం కుర్వన్ జఘాన పురుషోత్తమః, తస్య తాత ! వధాదేవ దేవదానవమానవాః, మధుసూదన**

ఇత్యాహుః ఋషయ శ్చ జనార్దనమ్" (భగవానుని కర్ణమునుండి పుట్టిన మధువును గొప్ప రాక్షసుని బ్రహ్మకు మంచినిచేయుటకై పురుషోత్తముడు చంపెను. నాయనా ! ఇతనిని చంపుటచేతనే దేవతలు, దానవులు, మానవులు, ఋషులు అను అందఱును జనార్దనుని మధుసూదనుడని చెప్పుచున్నారు) అని మహాభారతములో ఈ నామముయొక్క మహిమ స్పష్టీకరింపబడినది.

"దదృశాతేఽ రవిందస్థమ్ బ్రహ్మాణ మమితప్రభమ్, సృజంతం ప్రథమం వేదాం శ్చతురః శ్చారువిక్రమౌ, తతో విగ్రహిణ స్తాం స్తు దృష్ట్వా తా వసురోత్తమౌ, వేదాన్ జగృహతూ రాజన్ ! బ్రహ్మణః పశ్యత స్తదా, అథ తౌ దానవశ్రేష్ఠౌ గృహీత్వా తాన్ సనాతనాన్, రసాం వివిశతు స్తూర్ణ ముదపూర్ణే మహోదధౌ, తతో హృతేషు వేదేషు బ్రహ్మ కశ్మల మావిశత్, తతో వచన మీశానం ప్రాహ వేదై ర్వినాకృతః, బ్రహ్మ- వేదా మే పరమం చక్షు ర్వేదా మే పరమం ధనమ్, వేదా మే పరమం ధామ వేదా మే బ్రహ్మ చోత్తమమ్, మమ వేదా హృతా స్సర్వే దానవాభ్యాం బలార్దితః, అంధకారా ఇమే లోకా జాతా వేదై ర్వివర్జితాః, అహో ! బత మహద్దుఃఖం వేదనాశనజం మమ, ప్రాప్తం ధునోతి హృదయం తీవ్రశోకామయ స్త్వయమ్, కో హి శోకార్ణవే మగ్నం మా మిహోద్య సముద్ధరేత్, ఇత్యేవం భాషమాణస్య బ్రహ్మణో నృపసత్తమ, హరి స్తోత్రార్థ ముద్భూతా భక్తి ర్బుద్ధిమతాం వర, తతో జగౌ పరం జప్యం ప్రాంజలిః ప్రగ్రహం ప్రభుః, ........ ఏతస్మిన్నంతరే రాజన్ ! దేవో హయశిరోధరః, జగ్రాహ వేదా నఖిలాన్ రసాతలగతాన్ హరిః, ప్రాదా చ్చ బ్రహ్మణే రాజన్ ! తతః స్వాం ప్రకృతిం యయౌ, తత స్తయో ర్వధేనాశు వేదాపహరణేన చ, శోకాపయనం చక్రే బ్రహ్మణః పురుషోత్తమః" (మధువు, కైటభులను అసురులు అంతులేని కాంతిని కలవాడు, తామరపూవులో వేంచేసియుండువాడు, అందమైన రూపమును కల నాల్గు వేదములను మొట్టమొదటగా సృష్టించినవాడగు అగు బ్రహ్మను చూచిరి. శరీరముతో కూడిన ఆ వేదములను చూచిన ఆ అసురులు బ్రహ్మ చూచు చుండగానే వానిని ఎత్తుకొనిపోయిరి. పిమ్మట ఆ అసురశ్రేష్ఠులు ప్రాచీనములగు ఆ వేదములను గైకొని జలపూర్ణమగు సముద్రులోని రసాతలమున గల వివరములో దూరిరి. ఇట్లు వేదములు అపహరింపబడిన తర్వాత బ్రహ్మకు గొప్ప దుఃఖము కల్గినది. అపుడు వేదములను కోల్పోయిన బ్రహ్మ భగవానునిగూర్చి ఇట్లు ప్రార్థించెను. "వేదములు నాకు గొప్ప కన్నులు. వేదములు నాకు గొప్పధనము.



వేదములే నాకు గొప్ప కాంతి. నాకు మహిమను కలుగజేయువానిలో వేదములు గొప్పవి. అసురబలముచే నా వేదము లన్నియు ఇచటినుండి అపహరింపబడినవి. ఇపుడు మిగిలిన ఈలోకములన్నియు నాకు చీకటితో నిండినవైనవి. లోకసృష్టి చేయదలచిన నేను వేదములు లేనిదే ఏమి చేయుదును? వేదములు నశించుటచే నాకు గొప్ప దుఃఖము కల్గినది. తీవ్రశోకమను ఈ వ్యాధి నా మనస్సును వేధించు చున్నది. ఈ దుఃఖసముద్రములో మునిగిన నన్ను ఎవరు దరిచేర్చెదరు?-'' ఇట్లు బ్రహ్మ రోదించునపుడు హరిని స్తుతింపవలెనను బుద్ధి అతనికి ఏర్పడినది. అపుడు సృష్టికి అధిపతి అగు అతడు చేతులను జోడించి, మిక్కిలి గొప్పదగు ఈ స్తోత్రమును పాడెను.......... అపుడు భగవానుడు అగు హరి అశ్వముఖుడైన (హయగ్రీవుడై) అవతరించి, రసాతలమునుండి అన్ని వేదములను గైకొని బ్రహ్మవద్దకు తీసికొనివచ్చి ఇచ్చెను. అపుడు బ్రహ్మ తన సహజస్థితిని తిరిగి పొందెను. అట్లు ఆ అసురులను వధించుటతో, వేదములను తిరిగి తీసికొనివచ్చుటతో బ్రహ్మయొక్క దుఃఖమును పురుషోత్తముడు పోగొట్టెను) అని మహాభారతములో ఈ వృత్తాంతము తెలుపబడినది.

"మద మివ మధుకైటభస్య రంభాకరభకరీంద్రకరాభిరూప్యదర్పమ్, స్ఫుట మివ పరిభూయ గర్వగుర్వోః కి ముపమీమహి రంగకుంజరోర్వోః" (మధుకైటభుల గర్వమును పరాభవించినట్లే, అరటిబోదె, కరభము- అనగా మణికట్టునుండి చిటికెనవేలువరకు గల కరభమనే భాగము, ఏనుగు తొండము - అను వీని అందముయొక్క గర్వమును అణచి, ఆ గర్వముచే బలిసి, వెల్గుచున్న శ్రీరంగనాథుని ఊరువులకు ఏ వస్తువును ఉపమానముగా పల్కుదుము?) అనుచు పరాశరభట్టరు శ్రీరంగరాజస్తవములోను, "పిష్టదుష్టమధుకైటభకీటౌ" (మధుకైటభులనెడి దుష్టకీటకముల వంటి అసురులను పిసికి, చంపిన ఊరుద్వయము) అని కూరేశులు సుందరబాహుస్తవములోను అనుగ్రహించినట్లే మధుకైటభులు భగవానుని ఊరువులచే అణచబడి చంపబడిరను వృత్తాంతము ప్రసిద్ధము. "కాయ్న్దిరుశై మాగ్రిగ్రి క్కదిరిలకు మామణికళ్ ఏయ్న్ద పణక్కదిర్మేల్ వెవ్వుయిర్ప్ప- వాయ్న్ద మదుకైటబరుమ్ వయిఱురుకి మాణ్డార్" ( కోపగించి, చీకటిని పోగొట్టు కిరణములను వెదజల్లు గొప్ప మణులను కల్గిన ఆదిశేషుని

పడగలపై గల తేజస్సుతో పాటు భగవానుడు వేడి నిశ్శ్వాసములను విడువగా, అక్కడకు వచ్చిన మధుకైటభులు తమ గర్భములు కఱిగి మరణించిరి) (మూన్ఱామ్ తిరువ.66) అని భగవానుని శ్వాసచేతనే మధుకైటభులు నశించిరని పేయాళ్వార్లు అనుగ్రహించిరి కదా!- అనినచో, కల్పాంతరములో ఇట్లు సంభవించియుండ వచ్చుననియు చెప్పవచ్చును. లేక, భగవానుడు ఎట్టి శ్రమ లేకుండగనే వారిని చంపిన రీతిని ఈ విధముగా ఆళ్వార్లు పల్కినట్లును చెప్పవచ్చును. ఈ మధుకైటభులు బ్రహ్మయొక్క కర్మానుభవముకొఱకు భగవానునిచే సృష్టింపబడిరి. రజస్తమోగుణములే ఈ రూపమును పొందిరని పాంచరాత్రశాస్త్రవచనము. జన్మించునపుడే వీరు "నీవు మమ్ములను సంహరింపవలెను'' అని ఎవరినిగూర్చి పల్కుదురో, వారివలననే వీరికి చావు సంభవింపవలెనను వరమును పొందిరి. వేదములను కల బ్రహ్మను చూచి, అతనినుండి వేదములను అపహరించి, రసాతలములో దాగిరి. అపుడు బ్రహ్మచే స్తోత్రముచేయబడిన భగవానుడు హయగ్రీవావతారమును ఎత్తి ఒక తీయని రాగమును పాడెను. ఆ ధ్వనిని వినిన అసురులు వేదములను విడచి, ధ్వని వచ్చిన దిశవైపు పోయిరి. భగవానుడు వేఱొక దిశలో వచ్చి, వేదములను గైకొని, బ్రహ్మకు తిరిగి ఇచ్చెను. వేదమలు కన్పింపకపోవుటచే ఆ అసురులు పాలకడలిలో శయనించియున్న భగవానుని చూచి, అతడే వేదములను తీసికొనిపోయి ఉండునని తలచి, అతనితో చిఱకాలము యుద్ధమొనర్చిరి. చాలా కాలము యుద్ధము చేసినను, శ్రమను పొందని భగవానుని చూచి వారు సంతోషించి, "నీకిష్టమైన వరమును అడుగుము'' అని వారు అనగా, "మిమ్ములను నేను చంపవలెను'' అను వరమును మాయావియైన ఆ మాధవుడు వారిని వేడెను. వారును దానికి అంగీకరింపగానే "మీకు ఇష్టమైన ఒక వరమును ప్రార్థింపుడు'' అని పరమపురుషుడు పలుకగా, "ఎవరును చనిపోని చోట మేము సంహరింపబడవలెను'' అని స్వామిని వారు వేడిరి. పురుషోత్తముడు తన తొడలతో వారిని అణచి, చంపెను- అని పురాణములు ఈ వృత్తాంతమును వివరించుచున్నవి. మధుసూదనుడను తిరునామముచే మధువును సంహరించినవాడని చెప్పబడుట కైటభునకును ఉపలక్షణమే. కైటభారి అని భగవానునకు ఇంకొక తిరునామము కూడ కలదు. ఈవిధముగా మధుకైటభులను సంహరించినవాడను అర్థమిచ్చు



ఈ నామముద్వారా స్వామియొక్క విరోధి నిరసనశీలత్వము సూచింపబడిన దనుటను పూర్వాచార్యులు ఈ నామప్రసక్తి వచ్చినపుడెల్ల వివరించిరి. భక్తులకు అనుభవవిరోధి అయిన యమవశ్యతను పోగొట్టుటలోని స్వామివైచక్షణ్యమును ఈ నామము తెలుపుచున్నదట - **"అనుభవిప్పార్క్కు వరుమ్ విరోధికళై మధువై నిరసిత్తాప్పోలే నిరసిత్తు క్కొడుక్కుమవనై. ఇత్తాల్- అనుభవవిరోధియాన యమవశ్యతైక్కు అఞ్జవేణ్డాదపడియాన వైచక్షణ్యత్తై యుడైయవన్ - ఎన్నై. పరిహారమధుసూదన ప్రపన్నాన్- ఎన్ఱు యమన్దానుమ్ నడుఙ్గుమ్బడియాన విషయమిఱే"** అను పెరియాళ్వార్ తిరుమొழி వ్యాఖ్యానసూక్తివలన ఈ అంశము. స్పష్టము.

**(మధుసూదనః)- 'మధు'** అనగా - **"పిప్పలం స్వాదు"** అను రీతిలో తీయని భోగ్యపదార్థములగు అచేతనతత్త్వము, ఆనందస్వరూపము, భగవానునకు శ్రీకౌస్తుభమువలె భోగ్యమైన చేతన తత్త్వమును అర్థము. సూదనుడను పదమునకు తన వశమునకు తీసికొనివచ్చువాడు- అని భావము. కావున సర్వతత్త్వములను తన వశమున నుంచుకొనువాడను అర్థమును మధుసూదననామమువలన స్ఫురించుచున్నది. **"సర్వనయనాచ్చైవ మధుహా మధుసూదనః"** (అన్ని తత్త్వములను నడుపుచు ప్రవర్తించుటచే భగవానుడు మధుసూదనుడన బడుచున్నాడు) అని ఈ నామముయొక్క ఆర్షనిరుక్తము ఈ అర్థమును ఆదరించినది. మధుసూదనుడనుటకు సకలతత్త్వములనెడి గుఱ్ఱములను నియమించువాడను అర్థమునుకూడ చెప్పవచ్చును. **"మధు రింద్రియనామా స తతో మధునిషూదనః"** (మధువు అని తీయని ఇంద్రియములు చెప్పబడుచున్నవి. వానిని అణచువాడు కావున ఆ భగవానుడు మధుసూదనుడనబడుచున్నాడు) అని' **"ఆత్మని నిత్యానం తరాయతయా సూరిజనకరణోపసంహర్తృత్వాద్వా"** (నిత్యసూరుల ఇంద్రియములను సదా ఏ అవరోధములేకుండ ఆకర్షించువాడు) అనియు మధుసూదనశబ్దార్థము వివరింపబడినది. కావున, ఈ అర్థములచే స్వామి విరోధినిరసనశీలత్వము వ్యక్తమగుచున్నది. **"కొడు మిడర్ ముழுవుమ్ మాయ్త్త వమ్మాన్ మదుశూదనన్"** (తీవ్రమైన దుఃఖమును అంతటినీ పోగొట్టిన స్వామి మధుసూదనుడు) అనుచు ఈ అర్థమును ఆళ్వార్లు అనుగ్రహించిరి. ఈ విరోధినిరసనశీలత్వమనెడి మహాగుణమునకు వశులై **"మదుశూద నెన్నమ్మాన్ తాను యాను మెల్లామ్ తన్నుళ్ళే**

**కలన్దొ ప్రిన్దోమ్ తేనుమ్ పాలుమ్ నెయ్యుమ్ కన్నలుమ్ అముదు మొత్తే"** (మదుసూధనుడైన నాస్వామి నేను తాను తేనె, పాలు, నేయి, కలకండ అమృతము- అన్ని రసములు తనలో కలుగునట్లు కలసితిమి) అని, **"వళ్ళలే ! మదుశూదనా ! ఎన్ మరతకమణియే"** (మహోదరుడా! మధుసూదనా! నా మరతకమణీ !) అనియు, **"మదుశూదనై యన్ఱి మఱ్ఱిలేన్"** (మధుసూదనుడు తప్ప వేఱొక రక్షకులు లేరు) అని, **"వైత్త మానిదియామ్ మదుశూదనైయే యలఱ్ఱి"** (దాచిపెట్టిన గొప్పనిధి అయిన మధుసూదనునే పలవరించి) అనియును నమ్మాళ్వార్లు తమను స్వామికి వశము చేసికొనిరి. నిత్యసూరుల ఇంద్రియములను తన వైపు నిత్యము ఆకర్షించువాడు కావున మధుసూదనుడని స్వామికి పేరు. **"సూరీణాం కరణం చ వా ఉపసంహరతి"** అని ఈ అర్థమును నిరుక్తి తెల్పినది. దేశికులు శ్రీస్తుతి ప్రారంభమున, చివరలో కూడ ఈ మధుసూదననామమును అనుసంధించుట వలన కూడ ఈ నామమునకు కల వైశిష్ట్యము తెలియుచున్నది.

ఇక, పెరియాళ్వార్ తిరుమొళిలోని ఈ నామపాశురము, దాని భావమును.

**విణ్ణెల్లామ్ కేట్క వళుదిట్టా యున్ వాయిల్ విరుమ్బి యదనై నాన్ నోక్కి**
**మణ్ణెల్లామ్ కణ్డెన్ మనత్తుళ్ళే యఞ్జి మదుశూదనే యెన్ఱిరున్దేన్**
**పుణ్ణేదు మిల్లై యున్ కాదు మఱియుమ్ పొఱుత్తిఱైప్పోదిరు నమ్బీ!**
**కణ్ణా ! వెన్ కార్ముగిలే ! కడల్వణ్ణా ! కావలనే ! ములై యుణాయే.**

మన్ను తిన్నందువల్ల నిన్ను నేను కొట్టినందులకు పైన గల లోకాలకు అన్నిటికీ వినిపించేటట్లు పెద్దగా ఏడ్చావు. నీవు ఆ విధంగా ఏడవడంవల్ల తల్లి అయిన నేను నీ పట్ల ఆదరాన్ని కల్గి నీ నోటిలో ఉండే నోటిముద్దను పరిశీలించి చూచాను. అపుడు ఆ నోటిలో అన్ని లోకాలను చూచి నా మనస్సులో భయపడి, "ఇతడు మధుసూదనుడే అయి ఉండాలి" అని తెలిసికొన్నాను. నీ చెవులకు పుండు ఏమీ లేదు. కాడను పెట్టేటపుడు నీచెవిని కొంచెం ముడవాలి. దానినిమాత్రం కొంచెం క్షణకాలం భరించాలి. గుణపూర్ణా ! కాలమేఘంవంటివాడా ! సముద్రవర్ణా ! రక్షకా! నా స్తన్యాన్ని తాగు.



తిరువాయ్మొళిలోని ఈ నామ పాశురము, దాని భావము.

**మదుశూదనై యన్ఱి మఱ్ఱిలేనే నెన్ఱు ఎత్తాలుమ్ కరుమ మన్ఱి**
**తుది శూళ్న్ద పాడల్గళ్ పాడి యాడ నిన్ఱూళి యూళి తొఱుమ్**
**ఎదిర్శూళల్పుక్కెనైత్తోర్ పిఱప్పుమ్ ఎనక్కే యరుళ్కళ్ శెయ్య**
**విది శూళ్న్దదా లెనక్కేలెమ్మాన్ తిరివిక్కిరమనైయే.**

"మధువును సంహరించిన భగవానుడు తప్ప వేఱొక ఆలంబనాన్ని కలవాడను కాను"- అని అనుసంధించి, ఏ వస్తువుతోను ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా, అనన్యప్రయోజనంగా స్తోత్రరూపంలో అతని గుణాలనుగూర్చిన పాశురాలను స్థిరంగా ఉండి పాడేటట్లుగా, సర్వదా నేను జన్మించే అన్ని జన్మలలో నాకు ఎదురుగా ఉపాయంతో అవతరించి నాపట్ల కృపజేయడంకోసం స్వామి అయిన త్రివిక్రముని ఒక విధి (కృప) నన్ను చుట్టుముట్టింది.

పన్నిరునామములోని ఈనామ పాశురము, దాని అర్థము.

**మదుశూదననెన్ వలప్పుయన్దెన్ కిళక్కెన్ఱు ఇవఱ్ఱిల్**
**పదియా యిరున్దు పొన్ మాదుఱై పఙ్గయవణ్ణనుమాయ్**
**మదు మావినైకళ్ అఱుక్క ముయలఙ్కళ్ ఈరిరణ్డాల్**
**మదువారిళమ్ పొళిల్ వారణవెఱ్పిన్ మళైముకిలే**

మదు ఆర్ = మకరందము నిండిన, ఇళమ్ పొళిల్ = లేత తోటలు చుట్టియున్న, వారణ వెఱ్పిల్ = శ్రీహస్తిగిరిలో (వేంచేసియున్న) మళై ముకిల్ = వార్షుక మేఘమువంటి వరదరాజస్వామి, మదుశూదనన్ = మధుసూదనుడై యుండి, ఎన్ వల పుయమ్ ఎన్ఱు = నా కుడిభుజము, తెన్ కిళక్కు (ఎన్ఱు) = ఆగ్నేయ దిశ (అను), ఇవఱ్ఱిల్ = ఈ స్థానములలో, పదియాయ్ ఇరున్దు = స్థిరముగా నుండి, పొన్ మాదు ఉఱై = లక్ష్మీదేవి నివసించు, పఙ్గయ వణ్ణనుమాయ్ = తామరవర్ణుడై, ముయలఙ్గళ్ ఈర్ ఇరణ్డాల్ = రోకళ్ళను నాల్గింటితో, మదు మా వినైకళ్ = (నా) అనాదియైన గొప్ప కర్మలను, అఱుక్కుమ్ = పోగొట్టును.

ఇచటి భగవన్మూర్తి- మధుసూదనుడు. వర్ణము - తామరవర్ణము. ఆయుధములు - నాల్గు రోకళ్ళు. దిశ - ఆగ్నేయము. పుండ్రస్థానము - కుడిభుజము.

వైష్ణవీసంజ్ఞయా దేవ్యా కలితం దక్షిణే భుజే ।
చతుర్మ్రసల మబ్జాభం సంశ్రయే మధుసూదనమ్ ॥

## (7) త్రివిక్రమః

త్రివిక్రమః ఖడ్గపాణిః నిఋత్యాం జ్వలనప్రభః

మధుసూదననామము భగవానుడు బ్రహ్మకు చేసిన ఉపకారమునుగూర్చి తెల్పినది. పిమ్మట గల త్రివిక్రమనామము ఈ లోకమునకు అంతటికిని అపేక్షానిరపేక్షముగా తనను సులభునిగా చేసికొనిన వైనమును తెల్పుచున్నది. మహాబలి అను ఒక గొప్ప అసురుడు తన పరాక్రమముతో ఇంద్రుని, ముల్లోకములను జయించి, తన వశము చేసికొనెను. అపుడు ఇంద్రుడు మొదలగు దేవతలు భగవానునివద్దకు చేరి మొఱపెట్టగా, భగవానుడు అదితి- కశ్యపప్రజాపతులకు కుమారునిగా వామనుడై అవతరించెను. వామనుడు మహాబలియాగము చేయునపుడు అతని యజ్ఞవాటికను చేరి, అతనివద్ద మూడడుగుల నేలను యాచించి, దానముగా పొంది, త్రివిక్రముడయ్యెను. తన రెండు పాదములతో లోకములనన్నిటిని కొలిచి, మూడవ అడుగును మహాబలి తలపై పెట్టి, పాతాళలోకములో అతనికిని శాశ్వతమైన స్థానమును అనుగ్రహించెను- అను వృత్తాంతము సర్వలోకప్రసిద్ధము. "వానకముమ్ మణ్ణకముమ్ అళన్ద తిరివిక్కిరమన్'' అనుచు ఆళ్వార్లు అర్థానుసంధానపూర్వకముగా త్రివిక్రమనామానుసంధానమును చేసిరి. ఇట్లు ప్రయోజనాంతరపరుడగు ఇంద్రునితోపాటు, అతనికి విరోధియగు మహాబలితోపాటు ఎట్టి భేదము లేక అందఱిని రక్షించిన అవతారమగుటచేతను, నిద్రించు బిడ్డను వాత్సల్యముతో తడవి, దగ్గఱకు చేర్చుకొను తల్లివలె లోకములను అన్నిటిని తన శ్రీపాదముతో వాని అపేక్షా నిరపేక్షముగా స్పృశించిన గొప్పతనమును కల్గినది అగుటచేతను, పరత్వము, సౌలభ్యమును కలిసి ప్రకాశించు వైశిష్ట్యమును కల్గినదగుటచేతను, దాసులకై తన రూపు మార్చుకొనియైనను వారిని రక్షించు తన గొప్ప రక్షకత్వస్వభావమును ప్రకటించునది అగుటచేతను, వేదములతో పాటు, ఇతిహాసపురాణములతోపాటు, దివ్యసూరులతోపాటు - అందఱు ఎట్టి భేదము



లేక ఈ అవతారమునందు అభినివిష్టచిత్తులయ్యిరి. "ఇదమ్ విష్ణు ర్విచక్రమే, ......", "త్రీణి పదా విచక్రమే,.........", "విచక్రమే పృథివీ మేష ఏతామ్ క్షేత్రాయ విష్ణుః" (మూడు అడుగుల భూమిని పొందుటకై ఈలోకమునంతటిని విష్ణువు కొలిచెను.) "త్రి ర్దేవః పృథివీ మితి ప్రవిష్ణుః", "శం నో విష్ణు రురుక్రమః" (గొప్ప పాదవిన్యాసములను కల విష్ణువు మనకు మంగళము నిచ్చుగాక) "విష్ణుక్రాంతే వసుక్రాంతే" (విష్ణువుచే కొలువబడిన సంపదతో నిండిన భూదేవీ !) అని పలు పలు చోట్ల వేదము కీర్తించినది. "**కణ్డాయే నెఞ్జే ! కరుమఙ్గళ్ వాయ్క్కినుమ్ ఓర్ ఎణ్తానుమిన్టియే వన్దియలు మాఱు ఉణ్డానై ఉలకేழు మోర్ మూవడి కొణ్డానై కణ్డుకొణ్డనై నీయుమే**" (మనసా ! కార్యములు ఫలించునపుడు ఏ తలపు లేకుండగనే వచ్చి ఫలించు రీతిని చూచితివికదా ! ఏడు లోకములను ఆరగించిన వాడు, ఒక మూడడుగులతో ఆ లోకములను కొలిచినవాడును అగు స్వామిని నీవుకూడ చూచితివికదా) అని, "**అడియై మూన్టై యిరన్ద వాఱుమ్ అఙ్గే నిన్టాళ్ కడలుమ్ మణ్ణుమ్ విణ్ణుమ్ ముడియ ఈరడియాల్ ముడిత్తు క్కొణ్డ ముక్కియముమ్, నొడియుమాఱవై కేట్కున్దోఱు మెన్ నెఞ్జమ్ నిన్టనక్కే కరైన్దుకుమ్ కొడియ వల్వినైయేన్ ఉన్నై ఎన్టుకొల్ ! కూడువదే**" (మూడడుగులను అడిగిన తీరును, అక్కడనుండి అగాధమైన సముద్రము, భూమి, ఆకాశములను రెండు పాదములతో అణగునట్లు కొలిచిన మహిమ - అను ఆ వ్యాపారములను చెప్పు రీతిని వినునపుడు అంతట నా మనస్సు నీ విషయములోనే కఱగి, శిథిలమగుచున్నది. మిక్కిలి కఠినమైన పాపమును గల నేను నిన్ను పొందుట ఏ రీతిలోనో కదా !) అనియు, "**పాయోరడి వైత్త తన్ కీழ் ప్పరవై నిల మెల్లామ్ తాయోరడియాల్ ఎల్లా వులకుమ్ తడ వన్ద మాయోన్ ఉన్నై క్కాణ్బాన్ వరున్ది ఎనై నాళుమ్ తీయోడుడన్ శేర్ మెழுకాయ్ ఉలకిల్ తిరివేనో !**" (ఒక శ్రీపాదమును భూమి అంతట వ్యాపించునట్లు పెట్టి, ఆ పాదము క్రిందనున్న సముద్రపరివేష్ఠితమైన లోకమునంతటిని కొలిచి, మఱియొక పాదముతో పై లోకములను అన్నిటిని స్పృశించిన ఆశ్చర్యభూతుడా ! నిన్ను సేవించుటకై ఎల్లప్పుడు అగ్నిలో చేరిన మైనమువలె కఱగి బాధపడి లోకములో తిరుగుదునా !) అనియు, "**ఉలక మెల్లామ్ తావియ వమ్మానై ఎఙ్గిని త్తలైప్పెయ్వనే**" (లోకములను అన్నిటినీ కొలిచిన స్వామిని

ఇక ఎక్కడ పొందుదును?) అనియు, **"తావి వైయమ్ కొణ్డ ఎన్దాయ్"** (స్పృశించి భూమిని గ్రహించిన నా స్వామీ !) అనియు, **"పామరు మూవులకు మళన్ద పఙ్పాదా వో!"** (చేతనా చేతనములతో నిండిన ముల్లోకములను కొలిచిన శ్రీపాదపద్మములను కలవాడా !) అనియు నమ్మాఴ్వార్లు పిరాట్టిమార్లు (దేవేరులు) తాకినను కందిపోవు స్వామి శ్రీపాదములను దర్శించి, కొండలు, అడవులు అన్నిటిని కొలిచిన ఈ స్వామి సౌలభ్యగుణములనందు ఆర్ద్రహృదయులయ్యిరి. **"ఎన్నిదు మాయమ్! ఎన్నప్పన్ అఱిన్దిలన్, మున్నైయ వణ్ణమే కొణ్డళవాయ్ ఎన్న మన్ను నముశియై వానిల్ శుఴత్తియ మిన్ను ముడియనే!"** (ఏమి నీ మాయ ఇది ! నా తండ్రి గ్రహించనే లేదు. ముందురీతిలోనే భూమిని తీసికొని కొలువుము- అని పల్కిన నముచిని ఆకాశములో గిరగిర తిప్పిన, ప్రకాశించు కిరీటమును కలవాడా!) అనియు, **"ఒరుప్పడుత్తిడుమిన్ ఇవళై ఉలకళన్దానిడైక్కే"** (లోకములను కొలిచినవానివద్దకే ఈమెను అప్పగించుడు) అనియు పెరియాఴ్వార్లు, **"ఓఙ్గి ఉలకళన్ద ఉత్తమన్"** (లోకములను కొలిచిన ఉత్తముడు) అని, **"తేశమ్ ఉళ్ళళన్దవన్ తిరివిక్కిరమన్ తిరుక్కైకళాల్ ఎన్నై త్తీణ్డుమ్ వణ్ణమ్"** (కాంతిని కల, లోకములను కొలిచిన త్రివిక్రముడు శ్రీకరములతో నన్ను ఆలింగనము చేసికొను రీతిలో) అనియు **"మాణి యురువా యులకళన్ద మాయనై క్కాణిల్ తలై మఱియుమ్"** (బ్రహ్మచారి రూపియై లోకములను కొలిచిన ఆశ్చర్యభూతుని దర్శించినచో శిరస్సు వినమ్రమగును) అనియు గోదాదేవియు ఈ అర్థమున అభినివేశమును పొందిరి. **"ఏకః ప్రాసీసరత్ పాద మేకః ప్రాచిక్షళన్ముదా, అపరోఽభ్యధర న్మూర్ధ్నా కోఽధిక స్తేషు గణ్యతామ్"** (ఒకడు శ్రీపాదమును చాచెను. బ్రహ్మయగు వేఱొకడు మిక్కిలి సంతోషముతో ఆ శ్రీపాదమును శోధించెను. శివుడగు ఇంకొకడు సంతోషముతో ఆ నీటిని తలపై దాల్చెను. వీరిలో ఎవడు అధికుడనుటను విచారించి చూడుడు) అనునట్లు పరమపురుషుడు ఎవడనుటను స్థిరీకరించునదికదా ఈ అవతారము.

**(త్రివిక్రమః)- "త్రయో విక్రమాః త్రిషు లోకేషు క్రాంతాః యస్య సః"** (ముల్లోకములును ఎవనిచే ఆక్రమింపబడినదో అతడు) అను అర్థమునుకూడ గ్రహింపవచ్చును. **"త్రీణి పదా విచక్రమే"** అని అన్నది వేదముకూడ. **"త్రి రిత్యేవం త్రయో లోకాః కీర్తితాః మునిసత్తమైః, క్రమసే తాం స్త్రిథా సర్వాన్ త్రిక్రమోఽసి**



**జనార్దన!"** ('త్రి' అని ముల్లోకములు మునివరులచే చెప్పబడుచున్నవి. వానిని మూడు అడుగులతో కొలుచుటచే ఓ జనార్దనా ! నీవు త్రివిక్రముడవు అగుచున్నావు) అని హరివంశములో చెప్పబడినది. **"పాదేనైకేన విక్రాంతా సర్వేయం భూ ర్నరేశ్వర!, అంతరిక్షం ద్వితీయేన ద్యాః తృతీయేన సత్తమ !"** (ఈ లోకము ఒక పాదవిక్షేపముతో కొలువబడినది. రెండవ పాదన్యాసముతో అంతరిక్షము కొలువబడినది. మూడవ పాదముతో దేవలోకములు కొలువబడినవి) అని నారసింహపురాణములో చెప్పబడినది. మొదటిపాదములో క్రింది లోకముల నన్నిటిని, రెండపాదముతో పై లోకములను అన్నిటిని, మూడవ పాదముతో మహాబలియొక్క శిరస్సును కొలిచెననియు చెప్పనగును. **"త్రి రిత్యేవం త్రయో వేదాః కీర్తితా మునిసత్తమైః, క్రమసే తాం స్తథా సర్వాన్ త్రివిక్రమ ఇతి స్మృతః"** ('త్రి' అనుపదముతో మూడు వేదములును మునివరులచే చెప్పబడినది. వానిని అన్నిటిని వ్యాపించుటచే త్రివిక్రముడనబడుచున్నాడు) అని భట్టర్‌చే నిర్వచింపబడిన రీతిలోకూడా అర్థమును గ్రహింపవచ్చును.

ఇక, పెరియాఴ్వార్ తిరుమొఴిలోని ఈనామపాశురము, దాని భావము-

**ములై యేదుమ్ వేణ్డే నెన్నోడి నిన్ కాదిల్కడిప్పై ప్పఱిత్తెఱిన్దిట్టు,**
**మలైయై యెడుత్తు మగిఴ్న్దు కల్ మారి కాత్తు ప్పశునిరై మేయ్‌త్తాయ్,**
**శిలై యొన్ఱిఱుత్తాయ్ ! తిరువిక్కిరమా ! తిరువాయర్‌పాడిప్పిరానే !,**
**తలైనిలాప్పోదే యున్ కాదై ప్పెరుక్కాదే విట్టిట్టేన్ కుఱ్ఱమేయన్ఱే.**

"స్తన్యం, మిగిలిన భక్ష్యాలు ఏవీ నాకు అక్కఱ లేదు'' అని పల్కి పరుగెత్తి పోయి, నేను చెవులలో పెట్టిన కర్ణాభరణాన్ని పెఱికి పడవేసి, గోవర్ధనగిరిని గొడుగుగా ఎత్తిపట్టి, మనస్సులో సంతోషించి, రాళ్ళవర్షంనుండి గోపాలకులు మొదలైనవారిని రక్షించి, గోబృందాన్ని మేపినవాడా ! సాటి లేని శివధనుస్సును సీతాదేవిని వివాహమాడడం కోసం భగ్నం చేసినవాడా ! త్రివిక్రమా ! రేపల్లెకు ఉపకారకుడా ! శిరస్సును నిలువ లేని శైశవదశలోనే నీ చెవులకు పోగును పెట్టి పెద్దది చేయకుండా విడిచిపెట్టాను. ఈ విధంగా విడచి పెట్టడం నా తప్పే సుమా !

తిరువాయ్‌మొఴిలోని ఈ నామపాశురం, దాని భావం-

తిరివిక్కిరమన్ శెన్దామరైక్కణ్ ఎమ్మాన్ ఎన్ శెజ్ఞనివాయ్
ఉరువిఱ్కోలిన్ద వెళ్ళై ప్పళిఙ్గునిఱత్తన నెన్టెన్ష ఉళ్ళి
ప్పరవి ప్పణిన్దు పల్లూழி యూழி నిన్ పాదపఙ్గయమే
మరువి త్తొழுమ్మనమే తన్దాయ్! వల్లైకాణెన్ వామననే

నాకోసం వామనావతారం ఎత్తిన భగవానుడు మూడు పాదాలతో లోకాలను అన్నిటినీ కొలిచినవాడని, ఎఱ్ఱని తామరలవంటి కన్నులను కల స్వామి అని, నాకు భోగ్యమై, ఎఱ్ఱని దొండపండువంటి అధరాన్ని కలవాడని, అందం నిండిన శుద్ధస్ఫటికవర్ణాన్ని కల దంతాలను కలవాడని నిన్ను అనుసంధించి, స్తుతించి నమస్కరించి చిరకాలం నీ పాదారవిందాలలోనే స్థిరంగా ఉండి దాస్యాన్ని చేయడానికి అనువైన మనస్సును ఇచ్చావు. నా వామనమూర్తీ! నీవు సమర్థుడవుకదా !

పన్నిరు నామంలోని ఈ నామపాశురం, దాని అర్థం.

తిరివిక్కిరమన్ తికழ் తీనిఱత్తన్ తెళివుడై వాళ్
ఉరువి క్కరఙ్గళిలీరణ్డేన్ది వలక్కழుత్తుమ్
శెరు విక్కిరమత్తరక్కర్ తిక్కు త్తిఱన్దాళు మిఱై
మరువి క్కరికిరిమేల్ వరమ్ తన్దిడు మన్నవనే

కరి కిరి మేల్ మరువి = శ్రీహస్తిగిరిపై నిలచియుండి, వరమ్ తన్దిడుమ్ = (ఆవశ్యకమైన) వరములను అనుగ్రహించుచున్న, మన్నవన్ ఇఱై = చక్రవర్తి యగు వరదరాజస్వామి, తిరివిక్కిరమన్ = త్రివిక్రముడైయుండి, తికళ్ తీ నిఱత్తన్ = జ్వలించు అగ్నివంటి వర్ణమును కలవాడై, కరఙ్గళిల్ = శ్రీహస్తములలో, తెళివు ఉడై = ప్రకాశము నిండిన, వాళ్ ఈర్ ఇరణ్డు = ఖడ్గములను నాల్గింటిని, ఉరువి ఏన్ది = గ్రహించి, దాల్చి, వల క్కழుత్తుమ్ = కంఠముయొక్క కుడివైపున, శెరు విక్కిరమత్తు = యుద్ధములో (బలమును) విక్రమమును చూపు, అరక్కర్ తిక్కుమ్ = రాక్షసుల దిశ అగు నైఋతియందు, తిఱన్దు ఆళుమ్ = గొప్పగా నుండి, రక్షించును.

ఇచటి మూర్తి - త్రివిక్రముడు. వర్ణము - అగ్ని. ఆయుధములు - నాల్గు ఖడ్గములు. దిశ - నైఋతి. పుండ్రస్థానము -కంఠమునకు కుడివైపు.



దక్షిణాంసే దయావార్ధిం వరారోహాధిపం ప్రభుమ్ ।
అగ్నివర్ణం చతుఃఖడ్గం భావయామి త్రివిక్రమమ్ ॥

## (8) వామనః

వాయవ్యాం వామనో వజ్రీ తరుణాదిత్యదీప్తిమాన్

వేదములచే మిక్కిలి ఆదరింపబడినదగుటచేతను, పరత్వమును, సౌలభ్యమును ఏకత్ర చూపునది అగుటచేతను, అందఱి తలలపై సమానముగా శ్రీపాదమును ఉంచుటచే వామనావతారముకంటే మహాగుణమును కల్గినది అగుటచేతను త్రివిక్రమావతారము మొదట అనుభవింపడినది. పిమ్మట ఈ త్రివిక్రమమూర్తికిని కారణభూతుడైన వామనమూర్తి గొప్పతనము కీర్తింపబడు చున్నది. "ద్రష్టౄన్ స్వకాంత్యా వామాని సుఖాని నయతి" (చూచువారిని తన కాంతితో సుఖమును కలవారినిగా చేయుచున్నాడు) అనునది వామనశబ్దార్థము. "సర్వాణి వామాని నయతి" (అందఱిని సుఖమును కలవారినిగా చేయుచున్నాడు) అని ఛాందోగ్యోపనిషత్తు ఈ అర్థమును ఆదరించినది. "కొళ్ళ మాళా విన్బ వెళ్ళమ్ కోదిల తన్దిడుమ్ ఎన్ వళ్ళలే ! ఓ వైయ ఙ్కొణ్డ వామనా ! ఓ" (ఎంత గ్రహించినను అంతము లేనిదై, ఏదోషము లేని ఆనందప్రవాహమును నాకు అనుగ్రహించు మహోదారుడా ! భూమిని అధీనము చేసికొనిన వామనా !) అని "వేదమ్ తమிழ் శెయ్ద మాఱన్"గా ప్రసిద్ధిచెందిన నమ్మాழ்వార్లను వామనశబ్దార్థమును అనుగ్రహించిరి. "వామ స్సుందరమూఢయోః" అను రీతిలోకదా మిక్కిలి దేహసౌందర్యమును కలవాడనియు వామననామమునకు అర్థమును గ్రహింప వచ్చును. ఈ రెండు అర్థములచేతను ఇతడు అఖిలలోకాకర్షకమైన దేహసౌందర్యమును కలవాడని ఏర్పడును. "శిరాల్ పిఱన్దు శిఱప్పాల్ వళరాదు పేర్ వామనాకాక్కాల్ పేరాళా !" అనుచు ఆழ்వార్లు అస్థానే భయశంకను పొందు రీతిలో వామనుని సౌందర్యముండును. సముద్రమును గోష్పాదములో అణచి యుంచునట్లు, ముల్లోకములను కొలిచిన త్రివిక్రముడు తన సౌందర్యమునంతటిని ఈ చిన్నరూపములో ప్రవహింపజేయుటచే ఈ స్వామియొక్క అందము వర్ణనాతీతమైయుండును. అవాఙ్మానసగోచరమైన ఈ అందమునందు వేదములు, పురాణములు, దివ్యసూరులును నిమగ్నులయ్యిరి. "సర్వాణి వామాని నయతి"

అని వేదమన్నది. "స వామనో దివ్యశరీరధృక్" (ఆ వామనుడు దివ్యమైన రూపమును కలవాడు) అని పురాణము పల్కినది. భట్టర్ ఈ అర్థమును సహస్రనామభాష్యమున ఆదరించిరి.

**"మాయక్కూత్తా వామనా! వినైయేన్ కణ్ణా ! కణ్ కై కాల్ తూయ శెయ్య మలర్కళా శోది చ్చెవ్వాయ్ ముకిழ్తా, శాయల్ శామ తిరుమేని తణ్పాశడైయా తామరైనీళ్ వాశత్తడమ్ పోల్ వరువానే! ఒరు నాళ్ కాణ వారాయే"** (ఆశ్చర్యకరములైన, మనోహరములైన దివ్యచేష్టితములను కల ఓ వామనా ! పాపిష్ఠివాడను అయిన నాకు నేత్రమువంటివాడా ! నేత్రములు, శ్రీహస్తములు, శ్రీపాదములు ఏ దోషము లేని, అందమైన పూలవలె ప్రకాశింపగా, తేజస్సును కల ఎఱ్ఱని అధరము మొగ్గలుగా స్ఫురింపగా, నల్లని తిరుమేని చల్లని పచ్చని రంగును కల ఆకులుగా ప్రకాశింపగా తామరలను కల, విశాలమైన సువాసనను కల తటాకమువలె వచ్చుచున్నవాడా ! ఒకనాడు నేను సేవించునట్లుగా వేంచేయాలి.) అని, **"వామనన్ ఎన్ మరకతవణ్ణన్ తామరైక్కణ్ణినన్ కామనై ప్పయన్దాయ్"** (వామనుడు, నా మరతకవర్ణుడు, తామరసనేత్రుడు, మన్మథుని కన్న తండ్రి) అనియు, **"మాణ్ కుఱళ్ కోల వడివు కాట్టి"** (బ్రహ్మచారి వామనుని అందమైన రూపమును చూపి) అనియు, **'కుఱై కళழల్కళ్ నీట్టి మణ్ కొణ్డ కోల వామనా!"** (కడియములను కల పాదములను చాచి భూమిని కొలిచిన అందమైన వామనా!) అనియు, నమ్మాழ்వార్లు, **"శత్తిర మేన్ది త్తనియొరు మాణియాయ్ ఉత్తరవేదియిల్ నిన్ఱ ఒరువనై కత్తిరియర్ కాణ క్కాణి ముఱ్ఱుమ్ కొణ్డ పత్తిరాకారన్"** (ఉత్తరవేదిలో నున్న, ఔదార్యమున అద్వితీయుడైన బలినుండి గొడుగును చేతిలో ధరించి సాటి లేని బ్రహ్మచారి వేషమును దాల్చి వామనుడై పోయి, అతనికి జీతులైన క్షత్రియులు చూచుచుండగానే లోకమును అంతటిని గ్రహించిన మంగళరూపుడు) అని, **"కామర్ తాదై కరుతలర్ శిఙ్గమ్ కాణ వినియ కరుఙ్కుழల్ కుట్టన్ వామనన్ ఎన్ మరకతవణ్ణన్"** (మన్మథుని తండ్రి, తనను భావించనివారికి సింహమువలె దరిచేరుటకు వీలు కానివాడు, తనను ఆశ్రయించినవారు సేవించుటకు మధురమైనవాడు, నల్లని కేశములను కల బాలుడు, వామనుడు నా మరతకవర్ణుడు) అని పెరియాழ்వార్లు, **"కొణ్డ కోల**



**క్కుఱళురు"** (అందమైన రూపమును గ్రహించిన వామనరూపి) అని ఆణ్డాళ్, వేదము కీర్తించిన ఈ వామనుని రూపసౌందర్యమునందు మోహపడిరి. **"కరికుழల్ శెయ్యవాయ్ ముకత్తు వామననవ్వి"** ఇత్యాది సూక్తులును వామనుని రూపసౌందర్యమును కీర్తించుచున్నవి.

(వామనః) - ఇట్లు రూపసౌందర్యముతో ఇతరులను సంతోషింప జేయుటతోపాటు, గుణములతో ఇతరులను ఆనందపఱచువాడనియు అర్థమును గ్రహింపవచ్చును. **"మిక్క పెరుమ్ పుకழ் మావలివేళ్వియిల్ తక్కశిదన్ఱెన్ఱు తానమ్ విలక్కియ శుక్కిరన్ కణ్ణై త్తురుమ్బాల్ కిళఱియ శక్కరక్కైయనే !"** (ఔదార్యముతో మిక్కిలి గొప్ప కీర్తిని కల మహాబలి చేసిన యాగములో వామనుడవై సమీపించి, ఆ బలి నీవు అడిగినదానిని ఇచ్చుటకు సిద్ధపడినపుడు, "నీవు ఈదానమును ఇచ్చుట తగినది కాదు'' అని మొఱపెట్టి, భూమిదానమును అడ్డుకొనిన శుక్రుని కంటిని దర్భమొనతో గుచ్చిన చక్రహస్తా !) అనియు, **"మదియినాల్ కుఱళ్ మాణాయ్ ఉలకిరన్ద కళ్వఱ్కు"** (బుద్ధిచే పొట్టివాడైన బ్రహ్మచారియై లోకములను కొలిచిన యాచించిన కపటికి) అనియు, **"వాట్టమిల్ పుకழ் వామననై"** అని, **"వన్ మా వైయ మళన్ద వెమ్ వామనా!"** (కఠినమైన, విశాలమైన భూమిని కొలిచిన మా వామనా!) అనియు, **"శాల క్కోళ్వాన్ కుఱళాకియ వఞ్జనే!"** అనియు, **"కొళ్వన్ నాన్ మావలి మూవడి తా ఎన్ఱ కళ్వనే !"** (మహాబలీ ! నేను పరిగ్రహింతును. మూడడుగులు నాకు ఇమ్ము-అనిన వంచకా !) అనియు అన్యప్రయోజనములను ఆశించినవారికొఱకుకూడ తన రూపు మార్చుకొని రక్షించు ఆ మహాగుణములో ఆழ்వార్లు అభినివేశమును పొందిరి.

(వామనః) -**"వడివழకై చ్చొల్లుకిఱదెన్నుదల్, నన్మైకళై త్తరువ నెన్నుదల్"** (రూపసౌందర్యమును తెలుపుచున్నదనవచ్చును. హితములను ఇచ్చువాడనవచ్చును) అని నమ్పిళ్ళైఈడు (2-7-8)వ్యాఖ్యలో అనుగ్రహించిన రీతిలో వామశబ్దము సుఖప్రదములగు వస్తువులను తెల్పుచున్నదని చెప్పి, వామనుడనుటకు వానిని అనుగ్రహించువాడను అర్థమును చెప్పవచ్చును. **"మరువి త్తొழுమ్ మనమే తన్దాయ్ వల్లైకాణ్ ఎన్ వామననే!"** (స్థిరముగా నుండి కొలుచు మనస్సును నాకు ఇచ్చితివి. నా వామనమూర్తీ ! నీవు సమర్థుడువు సుమా !) అని

ఆళ్వార్లు ఈ అర్థమును అనుగ్రహించిరి. **(వామనః)** - ఆధిపత్యమును కోల్పోయిన ఇంద్రునకు దానిని అనుగ్రహించియు, మహాబలికి పాతాళములో స్థిరమైన సామ్రాజ్యమును ఇచ్చియు, లోకములో నున్న చేతనులందఱి తలలపై తన శ్రీపాదమునుంచియు- ఇట్లు అందఱికిని సుఖమును ఇచ్చినవాడు అను అర్థమును చెప్పవచ్చును. **'వామనః'** అను తిరునామమునకు చిన్న రూపమును కలవాడను అర్థము కలదనుట ప్రసిద్ధము. దీనిని దివ్యసూరులందఱు **"కుఱళురు"** అని కీర్తించిరి. రూపగుణములతోనే కాక అద్భుత చేష్టలతో కూడ మనస్సును దోచుకొన్నవాడను అర్థమును **"మాయక్కుత్తా! వామనా!"** ఇత్యాది దివ్యసూరి ప్రయోగములలో గమనింపవచ్చును.

**(వామనః)- "మధ్యే వామన మాసీనం విశ్వే దేవో ఉపాసతే"** (సర్వచేతనుల హృదయములో వేంచేసియుండు వామనుని దేవతలందఱు ఉపాసింతురు) అని వేదములో చెప్పిన రీతిలో హృదయకమలములో అంగుష్ఠమాత్రుడై వేంచేసియుండు భగవానుడు వామనశబ్దముతో తెలుపబడినాడనియు చెప్పవచ్చును. **"వామనన్ నిఱ్పదు మేవి యిరుప్పదెన్నెఞ్జకమ్"** (వామనుడు నిలుచునది, ఆశించి నిలుచునది నా హృదయములోపల) అని ఆళ్వార్లును ఈ అర్థమును తెలిపిరి.

ఇక, ఇపుడు పెరియాళ్వార్ తిరుమొళిలోని వామననామాంకిత పాశురము, దాని భావము-

**ఎన్ కుఱ్ఱమే యెన్ఱు శొల్లవుమ్ వేణ్డాగాణ్ ఎన్నై నాన్ మణ్ణుణ్డేనాక**
**అన్బుఱ్ఱు నోక్కి యడిత్తుమ్ పిడిత్తు మనైవర్క్కుమ్ కాట్టిఱ్ఱిలైయే**
**వన్బుఱ్ఱరవిన్ పగైక్కొడి వామననమ్బీ ! యున్ కాదుగళ్ తూరుమ్**
**తున్బుఱ్ఱన వెల్లామ్ తీర్ప్పాయ్! పిరానే ! తిరియిట్టు చ్చొల్లుగేన్ మెయ్యే**

"నేను ఇపుడు నీ మాటను వినకపోవడం నా దోషమే అవుతుంది'' అని నీవు చెప్పవలసిన పనిలేదు సుమా! ఎందుకు ? అని అంటే, నేను మన్ను తిన్నానని పల్కి, మన్ను తినని నన్ను పట్టుకొని, ప్రేమను ఆరోపించుకొని, ప్రేమ ఉన్నట్లుగా నానోటిని పరిశీలించి చూచి, నన్ను కొట్టి అందఱికి చూపించలేదా''- అని శ్రీకృష్ణుడు పలుకగా, అందులకు యశోద "బలమైన పుట్టలో నివసించే పాముకు విరోధి



అయిన గరుడుని ధ్వజంగా కల వామనమూర్తీ ! ఈ విధంగా నీవు ఒకటి పల్కితే నేనొకటి పల్కి, పొద్దు పుచ్చితే కుట్టిన నీ చెవులు పూడిపోతాయి. నిన్ను ఆశ్రయించినవారి బాధలను అన్నిటినీ పోగొట్టే స్వామీ ! ఉపకారకా ! నీకు చెవికాడను పెట్టి, "నిన్ను కొట్టబోను'' అని నీవు నమ్మేటట్లు శపథాన్ని చేస్తున్నాను'' -అని అన్నది.

తిరువాయ్మొళిలోని ఈ నామాంకితమైన పాశురము, దాని భావము-

**వామననెన్ మరదకవణ్ణన్ తామరైక్కణ్ణినన్**
**కామనై ప్పయన్దాయ్! ఎన్ఱెన్ఱున్ కళల్ పాడియే పణిన్దు**
**తూమనత్తననాయ్ పిఱవి త్తుళది నీఙ్గ ఎన్నై**
**త్తీమనఙ్గెడుత్తాయ్! ఉనక్కెన్ శెయ్గేనెన్ శిరీదరనే!**

నా శ్రియఃపతీ ! వామనమూర్తీ ! అని పల్కి, మరకతంవంటి కాంతిని కల స్వామీ ! అని పల్కి, పుండరీకాక్షుడా ! అని పల్కి, మన్మథుని పుత్రునిగా పొందినవాడా ! అని పల్కి, నీ శ్రీపాదాలలో పాడి, నమస్కరించి, పరిశుద్ధం అయిన మనస్సును కలవాడనై జన్మదుఃఖం తీరేటట్లుగా నన్ను చెడ్డమనస్సును లేనివానినిగా చేశావు. ఈ గొప్ప హితాన్ని చేసిన నీకు ఏమి ప్రత్యుపకారాన్ని చేయగలను?

పన్నిరునామంలోని ఈ నామపాశురం, దాని అర్థం -

**వామన నెన్టన్ వామోతరముమ్ వాయువిన్ తిశైయా**
**న్దామ మడైన్దు తరుణ వరుక్క నిఱత్తనుమాయ్**
**చ్చేమమరక్కలమ్ శెప్పువిలీరిరణ్డాల్ తికళు**
**నామఙ్గై మేవియ నాన్ముకన్ వేదియినమ్ పరనే**

నా మఙ్గై మేవియ = సరస్వతీదేవితో కూడియున్న, నాన్ ముకన్ వేదియిల్ = బ్రహ్మయొక్క యాగవేదికలో (అవతరించిన) నమ్ పరన్ = మన సర్వేశ్వరుడగు వరదరాజస్వామి, వామనన్ = వామనుడై, ఎన్టన్ వామోతరముమ్ = నా ఎడమ ఉదరము, వాయువిన్ తిశైయామ్ = వాయువు దిక్కు అగు వాయవ్యము, తామమ్ అడైన్దు = స్థానమును పొంది, తరుణ అరుక్కన్ నిఱత్తనుమాయ్ = ఉదయించిన

సూర్యుని వర్ణమును కలవాడై, శేమ మరక్కలమ్ = (దాసులను సంసారసముద్రము నుండి దరి జేర్చి) క్షేమమును కల్గించు నావగా నుండి, శెమ్ పవి ఈర్ ఇరణ్డాల్= ఎఱ్ఱని వజ్రాయుధములు నాల్గింటితో, తికழுమ్ = ప్రకాశించును.

ఇచటి భగవన్మూర్తి - వామనుడు. వర్ణము - బాలసూర్యుని వర్ణము. ఆయుధములు - నాల్గు వజ్రాయుధములు. దిశ - వాయవ్యము. పుండ్రస్థానము. ఉదరము ఎడమవైపు.

హరిప్రియాపతిం కుక్షివామపార్శ్వస్థపుండ్రకమ్ ।
వామనం బాలసూర్యాభం చతుర్వజ్రం విభావయే ॥

## (9) శ్రీధరః

### ఐశాన్యాం పుండరీకాభః శ్రీధరః పట్టసాయుధః

వామనశబ్దార్థమును తెలిపిన పిదప, ఇట్లు బ్రహ్మచారియై అవతరించిన అవతారమునందు కూడ లక్ష్మిని విడచియుండక, వక్షఃస్థలములో ఆమెను ధరించియున్నవాడనుటను పిమ్మట గల శ్రీధరనామము తెలుపుచున్నది. **"వామననే ! మాదవా !"** అని ఆழ்వార్లు ఈ అర్థమును తెల్పిరి. **"కృష్ణాజినేన సంవృణ్వన్ వధూం వక్షఃస్థలాలయామ్"** (వక్షఃస్థలమును నివాసముగా కల లక్ష్మిని కృష్ణాజినముతో మఱుగుపఱచుకొనినవాడై) అనునట్లు మహాబలియొక్క యాగశాలకు వేంచేసినపుడును వక్షఃస్థలములోనున్న పిరాట్టిని జింకతోలుతో దాచి వామనుడు వచ్చెననుట పురాణప్రసిద్ధముకదా !

"ఏవం యదా జగత్స్వామీ దేవదేవో జనార్దనః, అవతారం కరోత్యేషా తదా శ్రీః తత్సహాయినీ, రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని, అన్యేషు చావతారేషు విష్ణోరేషాఽనపాయినీ, దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ, విష్ణోర్దేహానురూపాం వై కరోత్యేషాత్మన స్తనూమ్" (దేవదేవుడగు భగవానుడు అవతారము నెత్తునపుడు ఈ శ్రీదేవియు అతనికి సహాయముగా అవతరించును. భగవానుడు రాఘవుడై అవతరించినపుడు ఈమె సీతగాను, అతడు కృష్ణుడై అవతరించినపుడు ఈమె రుక్మిణిగాను అవతరించినది. మిగిలిన అవతారము



లందును ఈమె విష్ణువును వీడియుండదు. అతడు దేవరూపుడైనపుడు దేవదేహమును స్వీకరించియు, మానవరూపమును పొందినపుడు తానుకూడ మానవరూపమును పొందియు - ఇట్లు విష్ణువుయొక్క దేహమునకు అనుగుణముగా తన దివ్యమంగళవిగ్రహమును లక్ష్మి పరిగ్రహించుచుండును) అని విష్ణుపురాణములో వివరింపబడుట ఇచట అనుసంధేయము. **"తాం రత్న మివ అర్చిషం, పుష్ప మివ సురభిమ్, ఇందు రివ చంద్రికామ్, అమృత మివ స్వాదుతామ్ ఔత్పత్తికేన సంబంధేన ధరతీతి శ్రీధరః-"న హి హాతు మిమం శక్యా కీర్తి రాత్మవతో యథా- ఇతి"** (రత్నము కాంతిని ధరించినట్లును, పూవు సువాసనను కల్గియుండునట్లును, చంద్రుడు తన కాంతిని ధరించునట్లును, అమృతము తీయదనమును కల్గియుండునట్లును, ఆ శ్రీదేవిని సహజమైన సంబంధముతో ధరించును కావున శ్రీధరుడనబడుచున్నాడు. "గుణవంతుని కీర్తి విడిచియుండక ప్రకాశించునట్లు, ఈ శ్రీదేవియు ఈ భగవానుని విడచియుండదు) అని ఆచార్యశ్రేష్ఠులగు శ్రీపరాశరభట్టర్ భగవద్గుణదర్పణములో అనుగ్రహించిరి.

**(శ్రీధరః)** - 'శ్రీః' అని లక్ష్మి చెప్పబడుచున్నది. ఆమెను ధరించువాడు కావున పురుషోత్తమునకు శ్రీధరుడని పేరు. **"వాశమ్ పూఙ్కుழలాళ్ ఉన్ తిరుమార్వత్తుమాలై నఙ్గై"** అని ఈ భావమును నమ్మాழ்వార్లు అనుసంధించిరి. భగవానునకు నారాయణనామము అసాధారణమై వెల్గునట్లే, లక్ష్మికికూడ 'శ్రీః' అను ఈ తిరునామము అసాధారణమైయున్నది. **"శ్రీరిత్యేవ చ నామ తే భగవతి! బ్రూమః కథం త్వాం వయమ్"** (లక్ష్మీదేవీ ! భగవతీ ! నీకు శ్రీః అనునది తిరునామము. నీ గొప్ప తనమును మేము ఎట్లు వర్ణింపగలము?) అనిరికదా ఆళవన్దార్. నారాయణనామమువలెనే ఈ తిరునామముకూడ పలు అర్థములను కల్గినది. అవి కొంచెము వివరింపబడుచున్నవి.

''శ్రీఞ్ - సేవాయామ్'' అను ధాతువునుండి ఈ శ్రీశబ్దము వ్యుత్పన్నమైనదనినచో, ''అఖిలచేతనులచే ఆశ్రయింపబడుచున్నది'' అని, "భగవానుని ఆశ్రయించుచున్నది'' అనియు రెండు అర్థములు ఏర్పడును. "శ్రు- విస్తారే" అను ధాతువునుండి శ్రీశబ్దము పుట్టినదని చెప్పినచో, ''దాసుల గుణములను వృద్ధి పొందించుచున్నది'' అనియు, "తన ఆత్మగుణములతో,

విగ్రహగుణములతో లోకమంతయు వ్యాపించుచున్నది'' అనియు అర్థములు స్ఫురించును. ''శ్రు-హింసా-యామ్'' అను ధాతువువలన శ్రీశబ్దము నిష్పన్నమగునని తలచిన ''దాసుల దోషముల నన్నిటిని పోగొట్టునది'' అని శ్రీశబ్దమునకు అర్థమును గ్రహింపవచ్చును. ''శ్రు-శ్రవణే'' అనెడి ధాతువునుండి శ్రీశబ్దము పుట్టినదనినచో ''దాసులు చేయు మొఱలను వినునది'' అని,''వానిని భగవానునకు విన్పించుననియు'' అర్థము చెప్పవచ్చును. ఈ అర్థములన్నియు- ''శృణాతి నిఖిలాన్ దోషాన్ శ్రీణాతి చ గుణై ర్జగత్, శ్రీయతే చాఖిలై ర్నిత్యం శ్రయతే చ పరం పదమ్, శ్రయంతీమ్ శ్రీయమాణాం చ శృణ్వంతీమ్ శృణతీ మపి'' (చేతనుల అన్ని పాపములను పోగొట్టును. లోకములను అన్నిటిని తన గుణములతో వ్యాపించును. చేతనులు అందఱిచే ఎల్లప్పుడు ఆశ్రయింపబడు చున్నది. భగవానుని ఆశ్రయించియున్నది. చేతనుల కోరికలను (ప్రార్థనలను) వినుచున్నది. భగవానునివద్ద వారి ప్రార్థనలను విన్పించుచున్నది - అని ఈమెను తెలిసికొనుచున్నారు) అని పాంచరాత్రశాస్త్రములో చెప్పబడినది. ''అఖిలచేత నర్క్కుమ్ ఆశ్రయణీయైయాయ్, తాన్ అవనై ఆశ్రయిత్తు లబ్ధస్వరూపైయాయ్, ఆశ్రితదోషఙ్గళై హింసిత్తు, అద్వేషాదిగుణఙ్గళై విస్తరిప్పిత్తు, ఆశ్రితదైన్యోక్తికళై శ్రవిత్తు, ఇవర్కళై అఙ్గీకరిక్కైక్కు అనుగుణమాన వచనఙ్గళై అవనై శ్రవిప్పిక్కై ముదలాన ఆకారఙ్గళ్ పురుషకారభూతైయాన పిరాట్టిక్కు అవశ్యాపేక్షితఙ్గళాకైయాలే, ఇన్నిరుక్తికళెల్లాత్తైయుమ్ శ్రీశబ్దత్తుక్కు అర్థమాక ఆచార్యర్కళ్ అనుసంధిప్పార్కళ్'' (అఖిలచేతనులకును ఆశ్రయణీయయై, తాను అతనిని ఆశ్రయించి, సత్తను పొందినది, ఆశ్రితుల దోషములను హింసించి, భగవానునిపట్ల అద్వేషము, అనగా- విరోధభావము లేకుండుట మొదలగువానిని విస్తరింపజేయునది, ఆశ్రితుల దైన్యోక్తులను స్వామికి వినిపించి, వీరిని అంగీకరించుటకు తగిన వచనములను అతనికి విన్పించునది- మొదలగు ఆకారములు పురుషకారస్వరూపిణి యగు లక్ష్మీదేవికి అవశ్యము అపేక్షితములగుటచే, ఈ నిరుక్తులన్నిటిని శ్రీశబ్దమునకు అర్థములుగా ఆచార్యులు అనుసంధింతురు) అని అఴకియమణవాళప్పెరుమాళ్ నాయనార్ ఆచ్చాన్పిళ్ళై చతుఃశ్లోకీ వ్యాఖ్యానములో అనుగ్రహించిరి. వీరి అన్నగారగు పెరియవాచ్చాన్పిళ్ళై పిరాట్టి ఈచేతనుని ప్రార్థనలను ఆలకించు ప్రకారములను, భగవానునకు వానిని వినిపించు ప్రకారములను పరన్దరహస్యములో



అత్యద్భుతముగా, రస్యముగా అనుగ్రహించిరి. ఆ శ్రీసూక్తులు ఇచట సహృదయా నందముకొఱకు ఉట్టంకింపబడుచున్నవి.

''శృణోతి- ఎన్ఱు కేట్కు మెన్ఱైయాలే చేతనరోడుణ్డాన బంధకార్యత్తై చ్చొల్లుకిఱదు.''శ్రావయతి'' ఎన్ఱు కేట్టియానిఱ్కుమ్ ఎన్ఱైయాలే ఈశ్వరనోడుణ్డాన బంధకార్యత్తై చ్చొల్లుకిఱదు. అదావదు- ......... పుఱమ్బు పొరుత్తమడైయ అఴగ్గు, ఈశ్వరనుక్కు ఆళాకాదపడి పూర్వాపరాధత్తుక్కు అఞ్జిన ఎనక్కు నిరుపాధికజనని యాన దేవరీర్ తిరువడికళొఴియ ప్పుకలిల్లై. ఇని, నాన్ ఈశ్వరనుడైయ ఇరక్కత్తుక్కు ఇరైయాయ్ రక్షిత్తనాతల్, అవనుక్కు స్వాతంత్ర్యపాత్రమాయ్ నాశత్తోడే తలైక్కట్టుతలొఴియ, ఇళైప్పాఱుకైక్కు ఇడ మిల్లాదపడి అనన్యగతి. ఇని, అడియేనుక్కు హిత మిన్నదెన్ఱు అఱిన్దు రక్షిత్తరుళుకై దేవరీరుక్కే భరమ్- ఎన్ఱు ఇవన్ శొన్న వార్తైయై కేట్కైయుమ్, అదుక్కు మేలే వెణ్ణీరుక్కు క్కుళిర్నీర్పోలే నిరఙ్కుశస్వాతంత్ర్యత్తాలే ''అభితః పావకోపమః'' ఎన్గిఱపడియే అనభిభవనీయనాన ఈశ్వరనై త్తన్నుడైయ భోగ్యతాతిశయత్తాలే పదమాక్కి, ''నాయన్దే ! ఇచ్చేతననై అఙ్గీకరిత్తరుళీర్'' ఎన్నుమ్. ''ఆవదెన్! శ్రుతిః స్మృతి ర్మమైవాజ్ఞా'' ఎన్ఱు నమ్ముడైయ ఆజ్ఞారూపమాన శాస్త్రమర్యాదైయై అతిలంఘిత్తు, నమ్ నెఞ్జు పుణ్ పడుమ్బడి తీర క్కఴియ అపరాధమ్ పణ్ణిపోన్దవనల్లనో ! ఇవనై యఙ్గీకరిక్కై యావదెన్?'' ఎన్నుమ్ ఈశ్వరన్. 'అవనుడైయ పూర్వాపరాధఙ్గళై ఉమ్ముడైయ పొఱైక్కు ఇలక్కాక్కి రక్షిత్తరుళీర్'' ఎన్నుమ్ పిరాట్టి. 'పొఱైయై నోక్కుకైక్కాక శాస్త్రమర్యాదై క్కుడనీర్ వఴియవో?'' ఎన్నుమ్ ఈశ్వరన్. 'శాస్త్రమర్యాదైయై నోక్కుకైక్కాక ఉమ్ముడైయ స్వాభావికమాన క్షమాతత్త్వత్తై క్కుడనీర్ వఴియవో?'' ఎన్నుమ్ పిరాట్టి. ''క్షమైయై నోక్కిల్ శాస్త్రమర్యాదై కులైయుమ్, శాస్త్రమర్యాదైయై నోక్కినాల్ క్షమాతత్త్వమ్ కులైయుమ్, ఇరణ్డుమ్ కులైయాదొఴియవేణ్డుమ్, శెయ్యప్పడువదెన్?'' ఎన్నుమ్ ఈశ్వరన్. ''కింకర్తవ్యతాకులనాయిరున్దాల్ అత్తైయే, అవై ఇరణ్డుమ్ కులైయాదపడి వఴి శొల్లుకిఱేన్. అప్పడియే శెయ్దరుళీర్'' ఎన్నుమ్ పిరాట్టి. ''ఇరణ్డుమ్ కులైయామల్ ఇచ్చేతననై నోక్క వఴి యుణ్డామాకిల్ నమక్కు పొల్లాదో ! శొల్లిక్కాణ్' ఎన్నుమ్ ఈశ్వరన్. ''ఆనాల్, శాస్త్రమర్యాదైయై విముఖర్ పక్కమాక్కువదు; ఉమ్ముడైయ క్షమైయై అభిముఖవిషయమాక్కువదు; ఇరణ్డుమ్

**జీవిత్తతా యఱుమ్"- ఎన్నుమ్ విషయవిభాగమ్ పణ్ణిక్కొడుక్కుమ్ పిరాట్టి. అత్తై కేట్టు "అఴకియ విభాగమ్" ఎన్ఱు ఇచ్చేతననై అఙ్గీకరిత్తరుళుమ్ ఈశ్వరన్. ఆక, ఇప్పడి సాపరాధజంతువై ఈశ్వరన్ అఙ్గీకరిత్తరుళుమ్బడియున వార్త్తైకళై కేట్టిత్తరుళుకైయుమ్"** ("శ్రుణోతి" అని దాసుల ప్రార్థనలను వినును అనుటచే చేతనులతోగల బంధకార్యము చెప్పబడినది. "శ్రావయతి"- అని (భగవానునకు వారి ప్రార్థనలను వినిపించును) అనుటచే భగవానునితో కల బంధకార్యము చెప్పబడినది. అనగా -"బాహ్యప్రపంచముతో పూర్తిగా సంగమును పోగొట్టుకొని, ఈశ్వరునకు దాసుడుకాకుండునట్లు నేను చేసిన పూర్వాపరాధములను చూచి భయపడిన నాకు నిరుపాధికజననివైన తమ శ్రీపాదములు తప్ప వేఱు గతి లేదు. ఇక నేను ఈశ్వరుని కృపకు లక్ష్యమై రక్షింపబడుటయో, లేక, అతని స్వాతంత్ర్యమునకు పాత్రమై నశించుటయో తప్ప, దుఃఖము తీరుటకు వేఱు అవకాశములేనట్లు అనన్యగతిని. ఇక, దాసునకు హితము ఇది అని తెలిసికొని రక్షించుట తమదే భారము'' -అని చేతనుడు పల్కిన మాటను ఈమె వినును. ఆ పిమ్మట వేడినీళ్ళను చల్లార్చు చన్నీళ్ళవలె నిరంకుశస్వాతంత్ర్యముచే **"అభితః పావకోపమః"** అనునట్లు ఎదుర్కొని నిగ్రహించుటకు వీలు కాని నిరంకుశుడైన ఈశ్వరుని తన భోగ్యతాతిశయముతో అనునయించి' "స్వామీ ! ఈ చేతనుని అనుగ్రహింపుడు' అనును. అపుడు స్వామి "అది ఎట్లు వీలు? **"శ్రుతిః స్మృతిః మమైవాజ్ఞా"** అనునట్లు నా ఆజ్ఞారూపమైన శాస్త్రమర్యాదను అతిక్రమించి, నా మనస్సు బాధపడునట్లు పూర్ణముగా అపరాధములను చేసినవాడుకదా అని! ఇతనిని క్షమించుట ఎట్లు?'' ఈశ్వరుడు అనును. అపుడు "అతని పూర్వాపరాధములను మీ క్షమకు లక్ష్యము చేసి, రక్షింపుడు'' అని పిరాట్టి అనును. "క్షమను రక్షించుటకై శాస్త్రమర్యాదను వదలివేయుటయా ?'' అని ఈశ్వరుడు బదులు పల్కును. "శాస్త్రమర్యాదను రక్షించుటకొఱకు మీకు స్వాభావికమగు క్షమాతత్త్వమును వదలివేయుదురా?'' అని పిరాట్టి మఱల అనును. "క్షమను కాపాడినచో శాస్త్రమర్యాద నశించును; శాస్త్రమర్యాద రక్షించినచో క్షమాతత్త్వము నశించును. ఇక ఏమి చేయవలెను?'' అని ఈశ్వరుడనును. "కింకర్తవ్యతాకులుడవై యున్నచో ఇక అంతియే. అవి రెండును నశింపకుండునట్లు దారి చూపెదను. అట్లే, చేయుడు'' అని పిరాట్టి అనును. "రెండును పాడు కాకుండ ఈచేతనుని రక్షించు దారి



ఉన్నచో నాకు అది చెడ్డ అగునా? చెప్పుము'' అని ఈశ్వరుడు పల్కును. "అయినచో శాస్త్రమర్యాదను విముఖుల విషయమున ప్రవర్తింపజేయుడు. మీ క్షమను అభిముఖుల విషయమున ప్రవర్తింపజేయుడు. రెండును జీవించినవి అగును'' అని పిరాట్టి విషయవిభాగమును చేసి చూపును. దానిని విని, "ఈ విభాగము చాలా బాగున్నది'' అని ఈ చేతనుని ఈశ్వరుడు అంగీకరించును. ఇట్లు సాపరాధుడగు చేతనుని ఈశ్వరుడు లక్ష్మీ పురుషకారపూర్వకముగా అంగీకరించును.)

ఇట్లు పిరాట్టిచే పురుషకారము చేయబడిన చేతనుని సర్వేశ్వరుడు అంగీకరించును అనుటను - **"ఎన్నై త్తీ మనమ్ కెడుత్తాయ్ ఉనక్కెన్ శెయ్‌కేన్? ఎన్ శిరీదరనే !"** (నా చెడుబుద్ధిని పోగొట్టితివి. ఓ శ్రీధరా ! నీకేమి ప్రత్యుపకృతిని చేయగలను?) అని ఆఴ్వార్లు తెలిపిరి. **"మాధవః"** అను నామము భగవానుడు వైకుంఠమున లక్ష్మీదేవితో వేంచేసియున్న స్థితిని తెల్పినది. **"శ్రీధరః"** అను నామము అవతారమును ఎత్తునపుడును అతడు ఆమె దాల్చియుండును - అని తెలుపబడినది. కావున పునరుక్తి లేదు. ఈ భక్తుల మనస్సులు చిక్కుకొను వలవంటి రూపమును ఈ నామము తెలుపుచున్నదనుచు **"శిరీదర నెన్బదోర్ పాశత్తు"** అని గోదాదేవి రస్యముగా ఈ నామార్థమును పల్కిరి.

పెరియాఴ్వార్ తిరుమొఴిలోని ఈ నామపాశురము, దాని భావము-

**మెయ్యెన్ఱు శొల్లువార్ శొల్లై క్కరుది త్తొడుప్పుణ్డాయ్ వెణ్ణైయై యెన్ఱు
కైయై ప్పిడిత్తు క్కరైయురలోడెన్నై క్కాణవే కట్టిఱ్ఱిలైయే
శెయ్‌దన శొల్లి చ్చిరిత్తఙ్గిరుక్కి ల్చిరీదరా ! వున్ కాదు తూరుమ్
కైయిల్ తిరియై యిడుకిడా యిన్నిన్ఱ కారిగైయార్ శిరియామే**

"ఎవరు ఏమి పల్కితే వారి ఆ మాటలను నిజమని నమ్మి నీవు వెన్నను దొంగిలించావు'' అని నాపై నిందను మోపి నా చేతిని పట్టుకొని, పలువురు చూచి గేలి చేసేటట్లుగా ఏమీ దొంగిలించని నన్ను రోటికి బంధించలేదా !'' అని కృష్ణుడు పల్కగా, అపుడు యశోదాదేవి "శ్రీధరా ! నేను పూర్వం చేసినవానినిగూర్చి పల్కుతూ మందహాసం చేసి అక్కడే దూరంలో కాలక్షేపం చేస్తూ ఉంటే నీ చెవులు

పూడిపోతాయి. నీ ముందే ఉండే నీ వధువులు నవ్వకుండా ఉండేటట్లు నా చేతిలోని పోగును నీ చెవిలో పెట్టుకో.

తిరువాయ్‌మొழிలోని ప్రబంధంలోని ఈ నామపాశురం, దాని భావము-

శిరీదరన్ శెయ్య తామరైకణ్ణన్ ఎన్ఱెన్ఱిరాప్పగల్ వాయ్
వెరీఇ అలమన్దు కణ్‌కళ్ నీర్ మల్‌గి వెవ్వుయిర్‌త్తుయిర్‌త్తు
మరీఇ తీవినై మాళ విన్బమ్ వళర వైగల్ వైగల్
ఇరీఇ ఉన్నై యెన్నుళ్వైత్తనై యెన్నిరుడీకేశనే!

స్వామి అయిన హృషీకేశా ! శ్రీధరా ! అని, ఎఱ్ఱని తామరలవంటి కన్నులను కలవాడా ! అని, రాత్రి పగలు పలవరించి పరిభ్రమించి, నేత్రాలలో నీరు చిప్పిల్లగా, వేడి నిట్టూర్పులను విడచి, చేరిన పాపాలు తీరేటట్లు, ఆనందం ప్రవహించేటట్లు ప్రతిక్షణం నిన్ను నా మనస్సులో నిలిపావు. ఈ విధంగాకూడా ఒక ఉపకారం ఉంటుందా ! ఆహా !

పన్నిరునామంలో ఈ నామపాశురం, దాని అర్థం -

శీరార్ శిరీతరనాయ్ చ్చివన్దిక్కు మిడ పువ్వయముమ్
ఏరా రిడజ్కొణ్డిలజ్గు వెణ్డామరై మేనియనాయ్
ప్పారాయ పట్టయ మీరిరణ్డాలుమ్ పయ మఱుక్కుమ్
ఆరావముతత్తిమామలైమే నిన్ఱ వచ్చుతనే

ఆరా అముదు = (ఎంత అనుభవించినను) తృప్తి కల్గింపని అమృతమై యున్నవాడును, అత్తి మా మలైమేల్ = హస్తిగిరిపై, నిన్ఱ = స్థిరముగా నున్నవాడును, అచ్చుతన్ = (దాసులను) విడువనివాడును అగు వరదరాజస్వామి, శీర్ ఆర్ శిరీతరనాయ్ = మహిమ నిండిన శ్రీధరుడై, శివన్ తిక్కుమ్ = శివుని దిక్కు అగు ఈశాన్యమును, ఇడ పువ్వయముమ్ = ఎడమ భుజమును, ఏర్ ఆర్ ఇడమ్ కొణ్డు = అందము పొందికగానున్న స్థానముగా గొని, ఇలఙ్గు వెణ్ తామరై మేని యనాయ్ = ప్రకాశించుచున్న, తెల్లని తామరయొక్క రంగును కలవాడై, పార్ ఆయ = బలమైన, పట్టయమ్ ఈర్ ఇరణ్డాలుమ్ = పట్టాకత్తులు నాల్గింటితో, పయమ్ అఱుక్కుమ్ = (నా) భీతిని పోగొట్టును.



ఇచటి మూర్తి - శ్రీధరుడు. వర్ణము - తెల్లతామరరంగు. ఆయుధములు- నాల్గు పట్టాకత్తులు. దిశ - ఈశాన్యము. పుండ్రస్థానము - ఎడమ భుజము.

**వామబాహౌ మహాబాహుం శార్‌ఙ్గిణం పతి మవ్యయమ్ ।**
**శ్రీధరం పుండరీకాభం చతుష్పట్టం సమాశ్రయే ॥**

## (10) హృషీకేశః

విద్యుత్ప్రభో హృషీకేశః స బాహ్యం దిశి ముద్గరీ

ఇట్లు పరావస్థను, వ్యూహవిభవావతారములను అనుభవించిన పిదప, **'హృషీకేశః'** అని సర్వేశ్వరుడు మనుష్యుల హృదయములలో అంతర్యామియై నిలచి, ఇంద్రియములను నియమించి వేంచేసియుండు సన్నివేశము అనుభవింపబడు చున్నది. "శ్రీధరః" అను తిరునామమునకు పిమ్మట పఠింపబడునది అగుటచే ఈ అంతర్యామి అవస్థయందును భగవానుడు లక్ష్మీదేవితో కూడినవాడుగనే వేంచేసియుండునని తోచుచున్నది. **"హృషీకాణీంద్రియాణ్యాహుః తేషా మీశో యతో భవాన్, హృషీకేశ స్తతో విష్ణుః ఖ్యాతో దేవేషు కేశవః"** (హృషీకములని ఇంద్రియములను చెప్పుదురు. ఆ ఇంద్రియములను నియమించువాడై యున్నందున విష్ణువు, కేశవుడను నామములను కల నీవు దేవతలలో హృషీకేశుడవనబడుచున్నావు) అని హరివంశములో హృషీకేశశబ్దార్థము తెలుపబడినది. **"తత్కరణానామపి నియామకత్వాత్ హృషీకేశః"** అని భట్టర్ భాష్యము.

**(హృషీకేశః)-** హృషీకేశపదముచే పది ఇంద్రియములనెడి తలలను కల మనస్సు అనెడి రావణుడు చెప్పబడుచున్నాడు. ఈ రావణునిపై జ్ఞానము అను బాణమును ప్రయోగించి, వధించువాడు కావున భగవానుడు హృషీకేశుడనబడు చున్నాడు. **"దశేంద్రియాననం ఘోరం యో మనోరజనీచరమ్, వివేకశరజాలేన శమం నయతి యోగినామ్"** (యోగుల పది ఇంద్రియములనెడి తలలను కల మనస్సు అనెడి భయంకరుడగు రాక్షసుని తననుగూర్చిన జ్ఞానము అనెడి బాణసమూహముతో ఉపశమింపచేయుచున్నాడు) అని చెప్పబడినదికదా ! **"ఇరుడీకేశ నెమ్బిరాన్ ఇలఙ్గై యరక్కర్ కులమ్ మరుడు తీర్‌త్త పిరాన్ ఎమ్మాన్"** (హృషీకేశుడు,

నాస్వామి, లంకలో రాక్షసుల కులములోని క్రూరుడైన రావణుని సంహరించిన ఉపకారకుడు, నా స్వామి) అని నమ్మాళ్వార్లు ఈ అర్థమును తెలియజేసిరి. **"అణ్డక్కులత్తుక్కదిపతి యాకి అశురరిరాక్కదరై ఇణ్డక్కులత్తై ఎడుత్తు క్కళన్ద ఇరుడీకేశన్ తనక్కు"** (అందముల సమూహమునకు అధిపతియై, అసురులు, రాక్షసులు అను ఛండాలుర సమూహమును అందఱిని నిర్మూలించిన హృషీకేశునకు) అని పెరియాళ్వార్లును కీర్తించిరి. **"ఇరుడీకేశన్"** అని ఈ తిరునామముచే కూడ విరోధినిరసనశీలత్వము చెప్పబడినది. **"ఏర్ విడై శెగ్ర్గిలజ్గన్తెఱిన్దిట్ట ఇరుడీకేశా!"** (సప్త వృషభములను చంపి, అక్కడ అపుడు విసరిన హృషీకేశా !) అని పెరియాళ్వార్లు ఈ గుణమునుగూర్చి పాయించిరి. **(హృషీకేశః)** తనను దర్శించినవారి ఇంద్రియములను వశీకరించుకొనువాడు. **"రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్"** (తనయొక్క రూపము, ఔదార్యము, గుణములు మొదలగువానిచే పురుషుల నేత్రములను, మనస్సును అపహరించువాడు) అని చెప్పబడినదికదా ! **"ముడియానే"** అను తిరువాయ్‌మొళిదశకములో నమ్మాళ్వార్లు **'నెడియానే! ఎన్ఱు కిడైక్కుమ్ ఎన్ నెఞ్జమే"** (సర్వాధికా ! అని నా మనస్సు భావించియుండును) అనియు, **"వఞ్జనే ! ఎన్ఱు మెప్పోదు మెన్ వాశకమే"** (వంచకా ! అని ఎల్లప్పుడు నా వాక్కు అనును) అనియు, **"తాయవనే ! ఎన్ఱు తడవుమ్ ఎన్ కైకళే"** (తల్లివంటివాడా ! అని నా చేతులు తడవును) అనియు, **"ఉన్నై మెయ్ కొళ్ళ క్కాణ విరుమ్బు మెన్ కణ్‌గళే"** (నీ రూపమును ప్రత్యక్షముగా దర్శింపవలెనని నా కన్నులు కోరును) అనియు, **"పణ్ కొణ్డ పుళ్ళిన్ శిఱకొలి పావిత్తు త్తిణ్‌కొళ్ళ ఓర్‌క్కుమ్ కిడన్దెన్ శెవికళే"** (సామగానాత్మకమైన గరుత్మంతుని ఱెక్కలయొక్క శబ్దమును ధ్యానించుకొని, నిలచి నా చెవులు దృఢముగా గురిపెట్టి ఆలోచించుచున్నవి) అనియు తమయొక్క ఇంద్రియములు ఒక్కొక్కటియు అన్ని ఇంద్రియముల అనుభవములను అనుభవించుటను ఆశపడి, భగవానుని అనుభవింప తహతహలాడుచ్నువి - అని అనుగ్రహించిరికదా ! **"నాక్కు నిన్నై యల్లాలఱియాదు"**, (వాక్కు నిన్ను తప్ప వేఱెవ్వరిని తెలియదు) **"కణ్డు నానున్నై ఉకక్క"** (నేను నిన్ను దర్శించి సంతోషించుటకు) **"వేఱొరువరోడెన్ మనమ్ పగ్ర్ఱాదు"** (వేఱెవ్వరిని నామనస్సు ఆశ్రయించదు) **"ఎన్నప్పా ఎన్నిరుడీకేశా !"** (నా తండ్రీ ! హృషీకేశా !) అని తమయొక్క ఇంద్రియములను అన్నియు



భగవానునిపట్ల అభినివేశము పొందినవని పెరియాళ్వార్లు పల్కిరి. స్వామి తన అవయవశోభచేతను, ఆభరణశోభచేతను, ఇతరుల ఇంద్రియములను వశము చేసికొనుటను పెరియాళ్వార్లు **"మిన్ను క్కొడియుమ్ ఓర్ వెణ్ తిజ్గళుమ్ శూళ్ పరివేడముమాయ్ పిన్నల్ తులఙ్గు మరశిలైయుమ్ పీతక శిగ్ర్ఱాడైయొడుమ్, మిన్నల్ పొలిన్దదోర్ కార్ ముకిల్‌పోల్ క్కళుత్తినిల్ కాఱై యొడుమ్ తన్నిల్ పొలిన్ద ఇరుడీకేశన్ తళర్‌నడై నడవానో!"** (విద్యుల్లత, దానిలో చేరియుండు, కళంకము లేని, మొత్తము తెల్లగానుండు ఒక చంద్రుడు, ఆ రెండిటిని చుట్టియుండు పరివేషమువలె- నడుములో అలంకరించుకొనిన బంగారు మొలనూలు అందులో వెండిమువ్వలు, ఆ రెండిటిని చుట్టియున్న, బంగారముతో చేసిన చిన్నవస్త్రము- అను వీటితో, మెఱుపుతీగతో వెలుగునట్టి, సాటిలేని కాలమేఘమువలె ఉన్నవాడు, కంఠములో అలంకరించుకొనిన **"కాఱై"** అను ఆభరణముతో కూడినవాడు, ఆభరణములన్నియు తిరుమేని శోభయే అనునట్లు సహజమైన తన అందముతో వెలుగుచున్నవాడైన హృషీకేశుడను తిరునామమును కల స్వామి తప్పటడుగులను వేయుడా!) అని గోదాదేవియు తమ ఇంద్రియములన్నియు హృషీకేశునకు విధేయములయ్యెనని పల్కినది.

ఇట్లు భగవానుడు జీవుని హృదయకమలములో దివ్యమంగళ విగ్రహముతో అంతర్యామియై వేంచేసియున్నాడనుటను -**"వెళ్ళై చ్చురి శఙ్గొడాళి యేన్ది త్తామరైక్కణ్ణ నెన్నెఞ్జినూడే పుళ్ళై క్కడాకిన్ఱ వాగ్ర్ఱై క్కాణీర్! ఎన్ శొల్లి చ్చొల్లుకేన్ అన్నైమీర్‌కాళ్!"** (తెల్లని శంఖముతో పాటు చక్రమును దాల్చి తామరసనేత్రుడు నామనస్సులో గరుత్మంతుని నడపుచున్న రీతిని చూడుడు. ఓ తల్లులారా ! మీకేమి తెల్పుదును ?) అని, **"కల్లుమ్ కనైకడలుమ్ వైకున్ద వానాడుమ్ పుల్లెన్ఱొళిన్దనకొల్ ! ఏ పావమ్ ! వెల్ల నెడియాన్ నిఱమ్ కరియాన్ ఉళ్‌పుకున్దు నీజ్గాన్ అడియేనతుళ్ళత్తకమ్"** (వేంకటాచలము, పాలసముద్రము, వైకుంఠమహానగరము- వీటిలో అంతట గడ్డి మొలచినది. అయ్యో ! పాపము ! మిక్కిలి గొప్పవాడు, నీలవర్ణుడు దాసుని లోపల ప్రవేశించి హృదయము బయటకు పోడు) అని నమ్మాళ్వార్లును, **"నిఱ్పదుమ్ ఓర్ వెఱ్పకత్తు ఇరుప్పదుమ్ విణ్ కిడప్పదుమ్ నఱ్పెరుమ్ తిరైక్కడలుళ్ నానిలాద మున్నెలామ్, అఱ్పుద ననన్తశయన్ ఆదిపూదన్**

మాదవన్ నిఱ్పదు మిరుప్పదుమ్ కిడప్పదుమ్ ఎన్ నెఞ్జుళే" (జ్ఞానశక్త్యాదులతో ఆశ్చర్యభూతుడు, ఆదిశేషునిపై పరుండి ఉన్నవాడు, జగత్కారణ భూతుడు, శ్రియఃపతి అయిన స్వామి నిలచి ఉండుట, నిలచి ఉండుట, అద్వితీయమైన వేంకటాద్రిపై కూర్చుని ఉండుట, పరమాకాశమనబడు పరమపదములో శయనించి ఉండుట- మిక్కిలి గొప్ప అలలను కల క్షీరాబ్ధిలో నేను నా స్వరూపమును తెలియని సమయమున. ఇపుడు అతడు నిలచి ఉండునది, కూర్చుని ఉండునది, శయనించునది నా మనస్సులోనే) అని తిరుమழిశై యాழ్వార్లు, "వడ తడముమ్ వైకున్దముమ్ మదిళ్ తువరాపదియుమ్ ఇడవకైకళ్ ఇకழ்న్దిట్టెన్పాల్ ఇడవకై కొణ్డనైయే" (ఉత్తరదిక్కులో ఉన్న క్షీరాబ్ధి, శ్రీవైకుంఠము, ప్రాకారములను కల ద్వారక- అనే గొప్ప స్థలాలు అన్నిటినీ ఉపేక్షించి నా వద్ద వాసస్థానమును కల్గి ఉన్నావే ! ఇదేమి ఆశ్చర్యము !) అనియు, "అనన్దన్ పాలుమ్ కరుడన్ పాలుమ్ ఐదునొయ్ దాక వైత్తెన్ మనన్దనుళ్ళే వన్దు వైకి వాழ చ్చెయ్దాయ్ ఎమ్బిరాన్" (ఆదిశేషునిపట్ల, గరుడునిపట్ల ఆదరము చాలా అల్పముగా కల్గి ఉండి నా హృదయములోకి వచ్చి, నిలచి ఉండి నన్ను ఉజ్జీవింపచేసితివి స్వామీ !)అని పెరియాழ్వార్లును సాయించిరి. వేదముకూడ "నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్కరా" అను మొదలగు సందర్భములలో ఈ విషయమును తెలిపినది. "లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః, యేషా మిందీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః" (ఎవరి హృదయములో నల్లకలువవలె నల్లని అతసీసుమవర్ణుడగు భగవానుడు చక్కగా వేంచేసి యున్నాడో, వారికే లాభము, జయమును కల్గును. వారికి అవమానము ఎట్లు కల్గును?) అని ఋషులును ఈ విషయమును పల్కిరి. "నఞ్జీయర్ కోయిలుక్కు ఎழுన్దరుళానిఱ్క, వழியిలే పిళ్ళానై క్కణ్డు, ఈశ్వరునుక్కు స్వరూపవ్యాప్తియో? విగ్రహవ్యాప్తియుమ్ ఉణ్డో?" ఎన్ఱు పిళ్ళానై క్కేట్క, భాష్యకారర్ తోழ అరుళిచ్చెయ్దుకొణ్డు పోన్దదు స్వరూపవ్యాప్తియా యిరుక్కుమ్; అకిలుమ్, ఎమ్బార్ ఒరునాళ్ "ఉపాసకానుగ్రహార్థమాక ఆశ్రితరుడైయ నెఞ్జిలే విగ్రహత్తోడే వ్యాపిత్తిరుక్కుమ్" ఎన్ఱు అరుళిచ్చెయ్య క్కేట్టేన్- ఎన్ఱు పణిత్తాన్" (నఞ్జీయర్ కోవెలకు వేంచేయుచు, దారిలో పిళ్ళాన్‌ను చూచి, భగవానునకు స్వరూపవ్యాప్తి మాత్రమేనా? విగ్రహవ్యాప్తి కూడ కలదా? అని పిళ్ళాన్‌ను అడుగగా, భగవద్రామానుజులు స్పష్టముగా అనుగ్రహించినది స్వరూపవ్యాప్తియే. అయినను,



ఎమ్బార్ ఒకనాడు- ఉపాసకులను అనుగ్రహించుటకొఱకై ఆశ్రితుల హృదయము లలో విగ్రహముతో వ్యాపించియుండును అని చెప్పగా వింటిని- అని పిళ్ళాన్ పల్కిరి) అనుచు ఈడువ్యాఖ్యలో ఉట్టంకింపబడిన ఐతిహ్యము ఈ సందర్భమున అనుసంధేయము. శ్రీపిళ్ళైలోకాచార్యులవారును- "అంతర్యామిత్వ మావదు- అంతః ప్రవిశ్య నియంతావా యిరుక్కై. స్వర్గనరకప్రవేశాది సర్వావస్థైకళిలుమ్ సకలచేతనర్క్కుమ్ తుణైయాయ్, అవర్కళై విడాదే నిఱ్కిఱ నిలైక్కు మేలే శుభాశ్రయమాన తిరువేనియోడే కూడిక్కొణ్డు, అవర్కళుక్కు ధ్యేయనాకైక్కాకవుమ్, అవర్కళై రక్షిక్కైక్కాకవుమ్ బంధుభూతనాయ్ క్కొణ్డు హృదయకమలత్తిలే ఎழுన్దరుళి యిరుక్కుమ్ ఇరుప్పు" (అంతర్యామిత్వమనగా- లోపల ప్రవేశించి నియంతయైయుండుట. స్వర్గనరక ప్రవేశాదులైన అన్ని అవస్థలయందు చేతనులందఱికిని సహాయభూతుడై, వానిని విడువకనేయుండు స్థితికి మించి, శుభాశ్రయమగు దివ్యమంగళవిగ్రహముతో వేంచేసియుండి, వారికి ధ్యేయుడగుటకొఱకును, వారిని రక్షించుటకొఱకును సకలవిధబంధువైయుండి, వారి హృదయకమలములో వేంచేసియుండు స్థితి) అని తత్త్వత్రయములో అనుగ్రహించిరి.

(హృషీకేశః)- "హృష్" అను ధాతువు ఆనందమును తెలుపును. 'క' అను పదము సుఖము అను అర్థము నిచ్చును. ఇందులకు "కం బ్రహ్మ" అను వేదవాక్యమును గమనింపనగును. 'ఈశ' అను పదము ఐశ్వర్యమును కలవాడని చెప్పును. కావున హృషీకేశుడను నామమునకు హర్షమును, సౌఖ్యమును, ఐశ్వర్యమును కలవాడను అర్థము స్ఫురించును. "హర్షాత్ సౌఖ్యాత్ సుఖైశ్వర్యాత్ హృషీకేశత్వ మశ్నుతే" (హర్షమును, సౌఖ్యమును, సుఖమగు ఐశ్వర్యమును కలవాడగుటచే హృషీకేశుడై యుండు స్వభావమును పొందుచున్నాడు)అని పురాణములలో చెప్పబడినది. "సూర్యాచంద్రమసోః శశ్వదంశుభిః కేశసంజ్ఞితైః, బోధయన్ స్వాపయంశ్చైవ జగ దుత్తిష్ఠతే పృథక్, బోధనాత్ స్వాపనా చ్చైవ జగతో హర్షణం భవేత్, అగ్నీషోమకృతై రేవమ్ కర్మభిః పాండునందన! హృషీకేశోఽహ మీశానో వరదో లోకభావనః" (కేశములు అనబడు సూర్యచంద్రకిరణములచే నేను లోకములోనున్నవారిని అందఱిని నిద్ర లేపుచు, నిద్రపుచ్చుచు వెల్గుచున్నాను.

ఇట్లు ప్రబోధించుటచేతను, నిద్రింపజేయుటచేతను లోకమునకు హర్షము కల్గును. పాండవా ! సూర్యచంద్రులను గొని చేయు ఈ కార్యములచే ఈశ్వరుడను, వరముల నిచ్చువాడను, లోకభావనుడను అగు నేను హృషీకేశుడని అనబడు చున్నాను) అని భారతము మోక్షధర్మములో హృషీకేశశబ్దముయొక్క వేఱొక అర్థము వివరింపబడినది. **"సూర్యరశ్మిః హిరణ్యకేశః పురస్తాత్"** (సూర్యకిరణములు భగవానుడగు హరియొక్క, కేశములనబడుచున్నవి) అని వేదమును ఈ అర్థమును తెలియపఱచినది. **'కేశ'** శబ్దముచే భగవానుని కేశపాశము చెప్పబడుచున్నదని గ్రహించి, **"హిరణ్యకేశః"** అనునట్లు చూచువారికి హర్షమును కల్గించు కేశములను కలవాడని హృషీకేశ నామమునకు అర్థమును గ్రహింపవచ్చును. కేశవుడను తిరునామమునకును ఇట్టి అర్థమును చెప్పబడినది. అచట అనుసంధింబడిన ప్రమాణములు ఇచటను స్మరింపతగినది. తన దివ్యచేష్టితము లతో భక్తుల మనస్సును, ఇంద్రియములను లోబఱచుకొనువాడను అర్థమునుకూడ ఈ నామమునకు చెప్పవచ్చుననుటను- **"ఏర్ విడై శెఱ్ఱు ఇళమ్ కన్ఱు ఎఱిన్దిట్ట ఇరుడీకేశా !"** ఇత్యాది ప్రయోగములవలన భావ్యము. బ్రహ్మాదుల ఇంద్రియము లను సైతము ఆకర్షించి స్వాధీనముచేసికొని, వారు తనను కీర్తించునట్లు చేయుననుటను గోదాదేవి **"ఎత్తిశైయుమ్ అమరర్ పణిన్దేత్తుమ్ ఇరుడీకేశన్"** అనుచు పల్కిరి. ఇట్టి పలు అర్థములను కల్గినది అయినను, ''అంతర్యామియై, ఇంద్రియములను నియమించి, వేంచేసియుండువాడు'' అను అర్థమే ఇచట ముఖ్యముగా గ్రహింపతగినది.

ఇక, పెరియాళ్వార్ తిరుమొళిలోని ఈ నామపాశురము, దాని భావము-

> **కారిగైయార్క్కు మునక్కు మిళుక్కుఱ్ఱెన్ కాదుగళ్ వీఙ్గి యెరియిల్**
> **తారియాదాగిల్ తలైనొన్దిడుమెన్ఱు విట్టిట్టేన్ కుఱ్ఱమేయన్ఱే**
> **శేరియ ప్పిళ్ళైగళెల్లారుమ్ కాదు పెరుక్కి త్తిరియుమ్ కాణ్డీ**
> **ఏర్విడై శెఱ్ఱిళఙ్గన్ఱెఱిన్దిట్ట విరుడీకేశా ! వెన్తన్ కణ్ణే !**

'నా చెవులు వాచి, మంటపుడితే నన్ను చూచి నవ్వే స్త్రీలకు కాని, నా చెవులలో పోగును పెట్టే నీకు కాని కలిగే లాభం ఏదైనా ఉన్నదా'' అని శ్రీకృష్ణుడు



పలుకగా అపుడు యశోద ఈ విధంగా అన్నది - "నీవు ఇంకా బాల్యదశలో ఉన్నపుడు "పోగును పెట్టడం సహించలేకపోతే బిడ్డకు శిరోవేదన కలుగుతుంది"- అని తలచి విడచిపెట్టాను. ప్రేమతో ఆ విధంగా విడచిపెట్టడం నా తప్పే కదా ! అందమైన ఋషభరూపాన్ని ధరించి వచ్చిన అసురుని సంహరించి, చిన్న లేగదూడ రూపంలో వచ్చిన వత్సాసురుని విసరే దండంగా చేసికొని కపిత్థ (వెలగ) వృక్షంపై విసరిన హృషీకేశా ! నాకు నేత్రభూతుడా ! ఈ రేపల్లెలోని పిల్లలు అందఱి చెవులు పెద్దవే, పోగులు ధరించడాన్ని చూస్తున్నావు కదా !

తిరువాయ్‌మొళిలోని ఈ నామపాశురం, దాని భావము-

> **ఇరుడీకేశ నెమ్బిరాన్ ఇలఙ్గై యరక్కర్‌కులమ్**
> **మురుడు తీర్‌త్తపిరాన్ ఎమ్మానమరర్ పెమ్మా నెన్జెన్ఱు**
> **తెరుడియాగిల్ నెఞ్జే ! వణఙ్గు తిణ్ణ మఱియఱిన్దు**
> **మరుడియేలుమ్ విడేల్ కణ్డాయ్ ! నమ్బి పఱ్పనాబనైయే,**

మనసా! నీకు తెలివి ఉంటే "హృషీకేశా !'' అని "నా స్వామీ'' అని, "లంకలోని రాక్షసకులానికి చెందిన క్రూరరావణాదులను నిరసించిన స్వామీ !- అని, నిత్యసూరినాథా ! అని పల్కి అతనికి నమస్కరించు. ఈ విషయాన్ని దృఢంగా తెలిసికో. తెలిసిన తర్వాత కలత చెందినదానవైనా, గుణపూర్ణుడైన పద్మనాభుని విడువడుసుమా !

పన్నిరునామంలోని ఈ నామపాశురం, దాని అర్థం-

> ఎన్నిడికేశ నిఱ కీళ్ఇడక్కళుత్తు ఎన్ఱివఱ్ఱి
> నన్నిలై మిన్నురువాయ్ నాలు ముఙ్కరఙ్కొణ్డు అళిక్కుమ్
> పొన్నకిల్ శేర్‌న్దలైక్కుమ్ పునల్ వేకై వడకరైయిల్
> తెన్ననుకన్దు తొళునేన వేదియర్ దెయ్‌వమున్ఱే

పొన్ అకిల్ శేర్‌న్దు = బంగారమును, అగరుకట్టెను చేర్చి, అలైక్కుమ్ పునల్ = కొట్టుకొని వచ్చు జలమును కల, వేకై వడ కరైయిల్ = వేగవతీనది ఉత్తరతీరములో, తెన్నన్ ఉకన్దు తొళుమ్ = పాండ్యప్రభువు సంతోషముతో కొలుచుచున్న, తేన వేదియర్ =తేనమ్ పాక్కమ్‌లోని వైదికశ్రేష్ఠుల, ఒన్ఱు దెయ్‌వమ్ = అద్వితీయ

దైవమగు, వరదరాజస్వామి, ఇడికేశన్ ఎన్ ఇఱై = హృషీకేశుడను నా స్వామియై యుండి, కీழ் ఇడ క్కழுత్తు ఎన్డు = అధోభాగము, కంఠముయొక్క ఎడమవైపు (అను), ఇవఱ్ఱిల్ = ఈ స్థానములో, నల్ నిలై మిన్ ఉరువాయ్ = చక్కగా, స్థిరముగానున్న మెఱుపుయొక్క కాంతిని కలవాడై, నాలు ముఱ్కరమ్ కొణ్డు = నాల్గు (ముద్గరములను) సమ్మెటలను ఆయుధములుగా గొని, అళిక్కుమ్ = రక్షించును.

**"ఇరుడీకేశన్"** అను పదము ఛందస్సుకు అనుకూలముగా **"ఇడికేశన్"** అని మాఱినది. ఇచటి మూర్తి - హృషీకేశుడు. వర్ణము- విద్యుద్వర్ణము. ఆయుధములు- నాల్గు సమ్మెటలు. చోటు - అధోభాగము. పుండ్రస్థానము - కంఠము ఎడమవైపు.

కాంచీపురమునకు మిక్కిలి సమీపములో **"తేనమ్ పాక్కమ్"** అను ఒక గ్రామము కలదు. దానిని కాంచీపురములోని ఒకభాగమే అని అనవచ్చును. ఆ ఊరిలో పాంచరాత్రాగమమునందు నిష్ణాతులైన, పరమవైదికులైన భాగవతులు వేంచేసియుండిరి. వారు వంశక్రమానుగతముగా వరదరాజస్వామిని తమ కులదైవముగా తలచి, పాంచరాత్రాగమానుసారము ఆరాధన చేయుచుండిరి అని, వారి గొప్ప గుణములను చూచిన పాండ్యదేశప్రభువు ఒకరు వారికి గొప్ప సమ్మానమును చేసి, వారికి నమస్కరించెననియు ఒక ఐతిహ్యము ఈ పాశురమువలన, పెద్దలవలన కొనసాగిన కర్ణపరంపరవలన తెలియుచున్నది. మఱియు, కాంచీపురము పాండ్యమండలములో కొంతకాలముపాటు చేరియుండెనని, అపుడు పాండ్యప్రభువు వరదరాజస్వామి కృపవలన అతిశయమును పొంది, ఉజ్జీవించుటవలన అతడు వరదరాజస్వామిని సేవింపవచ్చెనని తెలుపు కొన్ని శాసనములు కలవనియును పెద్దలందురు.

దేవదేవికయా దేవ్యా శ్రితం వామాంససంశ్రితమ్ ।
చతుర్ముద్గర మభ్యేమి హృషీకేశం తటిత్ప్రభమ్ ॥

## (11) పద్మనాభః

హృత్పద్మే పద్మనాభో మే సహస్రార్క సమప్రభః ।
సర్వాయుధః సర్వశక్తిః సర్వజ్ఞః సర్వతోముఖః ॥



ఇట్లు విభవమూర్తులను, అంతర్యామి అవతారమును అనుభవించిన పిదప, ఈ మూర్తులకన్నిటికిని మూలావతారమై వెల్గువాడును, పద్మనాభుడను ఈ తిరునామమును కలవాడగు క్షీరాబ్ధినాథుని వర్ణించుచున్నది- పద్మనాభుడను తిరునామము. ఇచట కొన్ని అంశములు తెలియదగినవి కలవు. అనిరుద్ధ నారాయణుడే బ్రహ్మను సృష్టించెనని, అన్ని అవతారములకు అతడే మూలమూర్తి అని తెలుపు ప్రమాణములు పూర్వమే చూపబడినవి. పద్మనాభుడను పేరువలన బ్రహ్మరుద్రులకు నడుమ చెప్పబడు శ్రీవిష్ణుమూర్తియే బ్రహ్మను సృష్టించెనని తోచుచున్నది. **"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్"** అని పాలకడలిలో నిద్రించు భగవానుడే కృష్ణుడు మొదలగు అవతారమూర్తులకు మూలభూతుడని చెప్పబడుచున్నది. ఇది ఎట్లు పొసగును? అనినచో, అనిరుద్ధునివలన క్షీరాబ్ధినికేతనుడు అవతరించుచున్నాడని, అతనివలన మిగిలిన అవతారములు ఏర్పడుచున్నవని తలచినచో అవతారమూర్తులకు అనిరుద్ధుని, క్షీరాబ్ధినాథుని మూలమూర్తిగను గ్రహింపవచ్చును. **"పద్మనాభాదికాః సర్వే...... అనిరుద్ధా త్సముత్పన్నాః దీపాద్దీపా ఇవేశ్వరాః"** అని ముందు ఉద్ధరింపబడిన ప్రమాణముతోను ఇది పొసగును. మహాప్రళయములో అనిరుద్ధుడు, నైమిత్తికప్రళయములో క్షీరాబ్ధినాథుడును బ్రహ్మను సృష్టింతురనియు చెప్పవచ్చును. లేక, ధర్మైక్యమువలన ఇద్దఱును బ్రహ్మోత్పాదకులుగా చెప్పబడుచున్నారనియు భావింపవచ్చును. పురుషసూక్తమునందుకూడ **"పాదోఽస్య"** అని అనిరుద్ధుని ప్రస్తావించి, **"ఇహాభవాత్పునః"** (ఇచట మఱల అవతరించిరి) అని అతని అవతారభూతుడగు క్షీరాబ్ధినాథుడు చెప్పబడినట్లుగను, **"తతో విష్వఙ్ వ్యక్రామత్"** అని వారి అవతారవ్యాప్తిని చెప్పినట్లుగను, **"తస్మా ద్విరాడజాయత"** అని ఆ క్షీరాబ్ధినాథునివలన బ్రహ్మ ఉత్పన్నుడైనట్లు చెప్పబడినట్లుగను అర్థము చెప్పవచ్చును. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రములోకూడ **"పద్మనాభోఽమరప్రభుః"** అని వ్యూహములో నాల్గవది అగు అనిరుద్ధునిగూర్చి, 'పద్మనాభః ప్రజాపతిః" అని మొదటి అవతారమైన విష్ణువునుగూర్చియు పద్మనాభశబ్దము ప్రయోగింపబడుట యును, ''పద్మనాభః ప్రజాపతిః'' అను సందర్భమున భాష్యములో **"నైమిత్తికసృష్టిప్రళయ విషయం చైతత్ దృష్టాంతమ్"** (ఈ బ్రహ్మసృష్టి నైమిత్తిక

సృష్టి ప్రళయ విషయమునకు సంబంధించినదని చెప్పనగును) అని భట్టర్ అనుగ్రహించుటయును ఇచట స్మరింపనగును. ఇక, పద్మనాభనామముయొక్క విశేషార్థమును కొంత అనుసంధించెదము.

**(పద్మనాభః)- "సర్వజగత్కారణం పద్మం నాభౌ యస్య సః"** (జగత్తుల కన్నిటికిని కారణమైన పద్మమును నాభిలో కలవాడు ఎవడో అతడు) అని శంకరభాష్యములో ఈ నామము వివరింపబడినది. **"పామరు మూవులకుమ్ పడైత్త పఱ్పనాబా ! వో"** (స్థావర జంగమాత్మకమై నిండిఉండు ముల్లోకములను సృష్టించిన పద్మనాభా !) అని ఆళ్వార్లు, **"ఊళ్ళి ముదల్వన్ పాళ్ళియమ్ తోళుడై పఱ్పనాబన్"** (చేతనాచేతనములకు కారణభూతుడైన, విశాలమైన, సుందరమైన భుజములను కల పద్మనాభుని తిరుమేనివలె దేహము నల్లనిదై, అని గోదాదేవియు పద్మనాభశబ్దార్థమును వివరించిరి. **"ధాతోత్థానః సంవిశతి పంచవర్షశతాని తు"** (పద్మసంభవుడగు బ్రహ్మ తామరపూవులో జన్మించినవాడై అయిదువందల ఏండ్లు ప్రవేశించెను) అని, **"తత్తు నాభ్యాం పుష్కరం ప్రాదుర్భవతి"** (సర్వలోకమును ధరించు నారాయణుని నాభిలో తామర పుట్టినది) అని, **"అజస్య నాభా వధ్యేకమర్పితమ్"** (జన్మ లేని స్వామినాభిలో ఒక తామరపూవు ఆవిర్భవింప జేయబడినది) అనియు **"యన్నాభిపద్మాదభవ న్మహాత్మా ప్రజాపతి విశ్వసృట్ విశ్వరూపః"** (లోకమును రూపముగా కలవాడు, లోకమును సృష్టించువాడును అగు బ్రహ్మ ఎవరి కమలమునుండి ఆవిర్భవించెనో) అని మహోపనిషత్తులో, **"బ్రహ్మ వై బ్రహ్మాణమ్ పుష్కరోఽసృజత్"** (బ్రహ్మము చతుర్ముఖుని తామరపూవులో ఆవిర్భవింపజేసినది) అని అధర్వణవేదమునందును, **"స ప్రజాపతి రేవ పుష్కరపర్ణే సమభవత్"** (ఆ బ్రహ్మ ఒక్కడే భగవానుని నాభీకమలములో ఆవిర్భవించెను) అనియు - ఇట్లు పలు పలు వాక్యములతో వేదమునందును, **"యత్తత్ పద్మ మభూ త్పూర్వం తత్ర బ్రహ్మా వ్యజాయత, బ్రహ్మణ శ్చాపి సంభూతః శివ ఇత్యవధార్యతామ్, శివాత్ స్కంధ స్సంబభూవ ఏతత్ సృష్టిచతుష్టయమ్"** (భగవానుని నాభినుండి ఏ తామరపూవు పూర్వము పుట్టినదో, అందు బ్రహ్మ పుట్టెను. ఆ బ్రహ్మవలన శివుడు జన్మించెనని తెలియనగును. శివునివలన స్కంధుడు పుట్టెను. ఇది మొదట ఏర్పడిన నాల్గు విధములైన సృష్టి) అని



మహాభారతమునందు, **"కదాచిత్తస్య సుప్తస్య నాభ్యాం కామా దజాయత, దివ్య మష్టదళం భూరి పంకజం పార్థివం మహత్, యస్య హేమమయీ దివ్యా కర్ణికా మేరు రుచ్యతే"** (ఆ భగవానుడు ఒకానొక సమయమున యోగనిద్రలో నున్నపుడు అతని సంకల్పమువలన అతని నాభినుండి ఎనిమిది దళములను కల్గినది, పృథివీ సంబంధమును కల్గినది, మిక్కిలి పెద్దది, అందమైనది అగు తామరపూవు ఆవిర్భవించినది. దానియొక్క బంగారుమయమైన, అందమైన కర్ణిక మేరుపర్వతమైనదని చెప్పబడుచున్నది) అని పాద్మపురాణములో తెలుపబడినది. **"నావియుళ్ నఱ్కమల నాన్ముకనుక్కొరుకాల్ తమ్మనై యానవనే!"** (నాభిలో మొలచిన గొప్ప పద్మమునుండి పుట్టిన బ్రహ్మకు అతడు వేదాలను కోల్పోయి చింతించు కాలమున తల్లివలె వానిని అనుగ్రహించినవాడా!) అని పెరియాళ్వార్లు, **"నాట్టై ప్పడై యెన్రయన్ ముదలా త్తన్ద నళిర్మామలరున్ది వీట్టై ప్పణ్ణి విళైయాడుమ్ విమలన్తన్నై క్కణ్డీరే!"** (లోకాలను సృష్టించు - అని బ్రహ్మమొదలగు ప్రజాపతులను సృష్టించిన చల్లని, పెద్ద తామరపూవును కల నాభి అను ఇంటిని సృజించి క్రీడించు పరమపావనుడైనవానిని చూచితిరా !) అని గోదాదేవి, **"తామరైమేల్ అయనవనై ప్పడైత్తవనే!"** (తిరునాభీకమలములో బ్రహ్మను సృష్టించినవాడా !) అని కులశేఖరాళ్వార్లు, **"పోదు తఙ్గు నాన్ముకన్ మకన్ అవన్ మకన్ శొలిల్ మాదు తఙ్గు కూఱన్ ఏఱ తూర్తి ఎన్రు వేదనూల్ ఓదుకిన్ర తున్మై అల్లదిల్లై మఱ్ఱురైక్కిల్"** (నాభీకమలంలో పొందికగా ఉండు బ్రహ్మ పుత్రుడు. ఇంకను చెప్పినచో, పార్వతి నివసించు సగభాగమును కలవాడు, వృషభమును వాహనముగా కలవాడగు రుద్రుడు అతనికి మనుమడు- అని ఈ రీతిలో వేదమనెడి శాస్త్రము పల్కునది సత్యము. ఈ విధముగాకాకుండ వేఱొక విధమున చెప్పినచో అది అసత్యము) అని తిరుమళిశైయాళ్వార్లు, **"అయనై పడైత్త దోరెళిల్ ఉన్ది"** (బ్రహ్మను సృష్టించిన, అద్వితీయమైన, ప్రకాశించు నాభి) అని తిరుప్పాణాళ్వార్లు, **"అఙ్గమలత్తయన్"** (అందమైన నాభీకమలములోని బ్రహ్మ) అని, **"ఒరువనై ఉన్దిపూమేల్ ఓఙ్గు విత్తు"** (ఒకనిని - బ్రహ్మను నాభీకమలములో సృష్టించి) అనియు తిరుమఙ్గైయాళ్వార్లు, **"శెయ్య మఱైయాన్ నిన్ ఉన్దియాన్"** (ఋజువైన వేదమును అభ్యసించు బ్రహ్మ నీ నాభీకమలములో ఉన్నాడు) అని,

**"నాన్ముకఙ్ఞ్ పూవ్మేల్ పకరమత్తై ప్పయన్ద పణ్బన్"** (నాభీకమలంలోని చతుర్ముఖునకు వాసస్థానమును అనుగ్రహించి, ఇతరులకు ఉపదేశించు రీతిలో వేదమును అనుగ్రహించిన సద్గుణశీలి) అని పొయ్కైయాళ్వార్లు, **"ఇరున్దణ్ కమలత్తిరుమలరినుళ్ళే తిరున్ద తిశైముకనై త్తన్దాయ్"** (విశాలమైన, చల్లని నాభీకమలము లోపల సమర్థుడైన చతుర్ముఖుని సృష్టించితివి) అని పూదత్తాళ్వార్లు, **"అలరెడుత్త ఉన్దియాన్"** (వికసించిన తామరపూవును కల నాభిని కల్గినవాడు) అని పేయాళ్వార్లు, **"ఒరు తానాకి త్తెయ్వ నాన్ముక క్కొళుముళై ఈన్ఱు ముక్కణీశనొడు తేవు పల నుదలి మూవులకుమ్ విళైత్త ఉన్ది మాయక్కడవుళ్ మాముదలడియే"** (ఉపాదానకారణముగా తానే అయినవాడై, చతుర్ముఖదేవుడను పూర్ణమైన అంకురమును, త్రినేత్రుడైన రుద్రునితోపాటు పలువురు దేవతలను సృష్టించి, వీరిని సృష్టి - సంహారములకు యోగ్యులుగా సంకల్పించి, ముల్లోకములను సృష్టించిన నాభిని కలవాడై, ఆశ్చర్యభూతుడైన పరదేవతయై, పరమకారణభూతుడైన పురుషోత్తముని శ్రీపాదములను) **"పామఱు మూవులకుమ్ పడైత్త పఱ్బనాబా!"** అని అని నమ్మాళ్వార్లును భగవానుడు సర్వజగత్కారణమైన పద్మమును నాభిలో కల్గి వెల్గుచుండుటను దర్శించి, అనుభవించిరి. **"అజనిష్ట చ కస్య నాభేః"** (ఎవని నాభినుండి ఈ లోకము ఆవిర్భవించినదో) అని ఆళవన్దార్ కూడా పల్కిరి. **"త్రయో దేవా స్తుల్యా స్త్రితయ మిద మద్వైత మధికం త్రికా దస్మా త్తత్త్వమ్ పర మితి వితర్కాన్ విఘటయన్, విభో ర్నాభీపద్మో విధిశివనిదానం భగవతః తదన్యద్భ్రూభంగీపరవ దితి సిద్ధాంతయతి నః"** (త్రిమూర్తులును సమానులు, ముగ్గురును ఒక్కరే, ముగ్గురికంటె విలక్షణమైన వేఱొక పరతత్త్వము కలదు- అను వితండవాదములను భగ్నము చేయుచు, బ్రహ్మరుద్రులకును మూలకందమైయున్న శ్రీరంగనాథుని నాభీకమలము ఆ స్వామి తప్ప మిగిలిన అన్నియు అతని కనుబొమల కదలికలను అనుసరించి వర్తించునవి- అను సిద్ధాంతమును మనకు తెలియజేయుచున్నది) అని పరాశరభట్టరును తెలియజేసినట్లు పరతత్త్వనిరూపణమును ఈ నామము చేయుచున్నది.

**(పద్మనాభః)- "పద్మ మివ నాభిః యస్య సః"** (తామరపూవువంటి నాభి ఎవనికి కలదో అతడు) అను అర్థమునుకూడ గ్రహింపవచ్చును. **"హృత్పద్మస్య నాభౌ మధ్యే ప్రకాశమానత్వాత్ వా పద్మనాభః"** (హృదయకమలములో నడుమ



ప్రకాశించుటచే పద్మనాభుడనబడుచున్నాడు) అని శంకరులు భట్టర్‌ను వివరించిరి. **"కొప్పూళిల్ ఎళు కమల పూ అళకన్"** అని గోదాదేవి ఈ అందమును వర్ణించినది. విష్ణుసహస్రనామములో కూడ **"హృషీకేశ"** నామమునకు పిమ్మట ఈ పద్మనాభనామము పఠింపబడినది.

ఇపుడు పెరియాళ్వార్ తిరుమొళిలో ఈ నామ పాశురము, దాని భావము-

**కణ్ణై క్కుళిర క్కలన్దెఙ్గుమ్ నోక్కి క్కడికమళ్ పూఙ్గుళలార్గళ్**
**ఎణ్ణత్తుళ్ళెన్ఱు మిరున్దు తిత్తిక్కుమ్ పెరుమానే ! ఎఙ్గళముదే !**
**ఉణ్ణ క్కనిగళ్ తరువన్ కడిప్పొన్ఱుమ్ నోవామే కాదు క్కిడువన్**
**పణ్ణైక్కిళియ చ్చగడ ముదైత్తిట్ట పఱ్బనాపా ! ఇఙ్గే వారాయ్**

మనస్సు చల్లబడేటట్లు నీవు నీ కళ్ళను గోపికల నేత్రాలలో కలిపి వారి రూపాన్ని పూర్ణంగా చూచి, పరిమళించే పుష్పాలను అలంకరించుకొన్న కేశాలను కల ఆ స్త్రీల మనస్సులలో ఎల్లప్పుడూ నిలచి ఉండి ఆనందించే గొప్పతనాన్ని కల మా అమృతస్వరూపా! నీవు తినడంకోసం నేరేడు పండ్లను ఇస్తాను. కర్ణాభరణాన్ని ఏమీ నొప్పి లేకుండేటట్లు నీ చెవిలో అలంకరిస్తాను. అసురావిష్టం అయిన శకటాన్ని కూలగొట్టిన పద్మనాభా ! ఇక్కడకు రా !

ఇపుడు తిరువాయ్మొళిలోని ఈనామపాశురము, దాని భావము.

**పఱ్బనాబ నుయర్వఱవుయరుమ్ పెరున్తిలోన్**
**ఎఱ్బర నెన్నై యాక్కిక్కొణ్డు ఎనక్కే తన్నై త్తన్ద**
**కఱ్బగమ్ ఎన్నముదమ్ కార్ముగిల్ పోలుమ్ వేఙ్గడనల్**
**వెఱ్బన్ విశుమ్బోర్ పిరాన్ ఎన్దై తామోదరనే**

లోకం అంతా వ్యక్తం కావడానికి (సృష్టింపబడడానికి) కారణం అయిన (నాభీ) కమలాన్ని నాభిలో కలవాడు, ఇంతకంటె వేఱయిన గొప్పది ఎక్కడ లేదు అనేటట్లు గొప్ప, అపారమైన శక్తిని కలవాడు, నాపట్ల ఆదరాన్ని కలవాడు, నన్ను సృష్టించి, అంగీకరించి, నాకే అసాధారణం అయేటట్లు తనను తాను అనుగ్రహించిన కల్పవృక్షంవంటివాడు, నాకు పరమభోగ్యుడు, కాలమేఘంవంటివాడు,

శ్రీవేంకటాచలం అనే గొప్ప పర్వతాన్ని నివాసంగా కలవాడు, నిత్యసూరులకు నాథుడు, ఆశ్రితవిధేయుడు అయిన భగవానుడు నాకు స్వామి.

పన్నిరునామంలోని ఈనామపాశురము, దాని భావము-

**ఎమ్ పఱ్పనాబను మెన్ పిన్ మనమ్ పఱ్ఱి మన్ని నిన్ఱు**
**వెమ్ పొఱ్కదిరవ నాయిర మేనియ మెయ్యురువాయ్**
**అమ్ పొఱ్కరజ్గళిల్ ఐమ్పడై కొణ్డు అఞ్జలెన్ఱళిక్కు**
**శెమ్పొఱ్ఱిరుమదిళ్ శూళ్ శిన్దురాశల చ్చేవకనే**

శెమ్ పొన్ తిరు మదిళ్ శూళ్ = ఎఱ్ఱని బంగారముతో నిర్మించిన, అందమైన ప్రాకారములు చుట్టియున్న, శిన్దురాశల చ్చేవకన్ = హస్తిగిరిలోనున్న మహావీరుడగు వరదరాజస్వామి, ఎమ్ పఱ్పనాబనుమ్ = మన పద్మనాభుడై, ఎన్ పిన్ = నా వెనుక భాగమును,మనమ్ = మనస్సును, పఱ్ఱి మన్ని నిన్ఱు = ఆశ్రయించి, స్థిరముగా నుండి, వెమ్ పొన్ = వేడిగానున్న ఎఱ్ఱని,ఆయిరమ్ కదిరవన్ = వేయిమంది సూర్యులతో, మేనియ మెయ్ ఉరువాయ్ = సమమైన తిరుమేని వర్ణమును కలవాడై, అమ్ పొన్ కరజ్గళిల్ = అందమైన, ఎఱ్ఱని శ్రీహస్తములలో, ఐమ్బడై కొణ్డు = పంచాయుధములను దాల్చి, అఞ్జల్ ఎన్ఱు = భయపడకుము అనుచు (పల్కి), అళిక్కుమ్ = కాపాడును.

ఇచటి మూర్తి పద్మనాభుడు. వర్ణము - సూర్యవర్ణము. ఆయుధములు- శంఖ, చక్ర, ఖడ్గ, గదా, ధనుస్సులు అను పంచాయుధములు. స్థానము -మనస్సు. పుండ్రస్థానము - (నడుము) వెనుకభాగము.

పృష్ఠే సుహృదయా దేవ్యా మహాలక్ష్మ్యా విరాజితమ్ ।
పంచాయుధమ్ పద్మనాభం ప్రణమామ్యర్కరోచిషమ్ ॥

## (12) దామోదరః

ఇట్లు సకలావతారమూలమూర్తియైన పద్మనాభావతారము అనుభవింప బడినది. అనంతరము ఆ భగవానుని ముఖ్యావతారమగు కృష్ణావతారము దామోదరనామముతో అనుభవింపబడుచున్నది. పద్మనాభనామముతో



అవతారములో పరత్వమును పూర్ణముగా కల్గియున్నాడని తెలుపబడినది. ఒక గొల్ల వనితకు (యశోదకు) కట్టుబడి, ఆమెచే కొట్టబడిన సౌలభ్యముయొక్క పర్యంతసీమలోని అభినివేశమును ఈ దామోదర నామము తెలుపుచున్నది. **'దామ'** అను పదమునకు దార మని అర్థము అగుటచే, దారమును నడుమున కలవాడని దామోదరనామముయొక్క అర్థము. **"తయో ర్మధ్యగతం బద్ధం దామ్నా గాఢం తయోదరే, త తశ్చ దామోదరతాం స యయౌ దామబంధనాత్"** (ఆ యశోదచే నడుమున దారముతో కట్టబడినవాడై, ఆ వృక్షముల నడుమ వెడలెను. దారముచే కట్టబడుటచే దామోదరుడై యుండు స్వభావమును అతడు పొందెను) అని పురాణము చెప్పినది. **"దామ్నా చైవోదరే బద్ధ్వా ప్రత్యబధ్నా దులూఖలే"** (దారముచే నడుమున కట్టి, ఱోలుకు బిగించి కట్టెను) అని విష్ణుపురాణములో ఈ తిరునామము వివరింపబడినది. అందఱికంటె అధికుడుడైన స్వామి ఒక గోపవనిత చేతిలో కట్టుబడియుండుటను జూచి, **"ఎత్తిఱమ్! ఉరలినోడు ఇణైన్దిరున్దు ఏజ్గియ ఎళివే"** అని నమ్మాళ్వార్లు ఆఱు నెలలు మోహమును పొందిరి. **"ఏవం లక్ష్మ్యా అపి స్పృహణీయచాతుర్యోఽపి సన్, యశోదాదామని గలితజలః సంశ్రిత వాత్సల్యాత్ బభూవ"** అని భట్టర్ ఈ అర్థమును భాష్యములో పల్కిరి. **"కణ్ణినుణ్, శిఱుత్తాంబినాల్ కట్టుణ్ణ ప్పణ్ణియ ప్పెరు మాయన్"** అని మధురకవి యాళ్వార్లు, **"కణ్ణి క్కుఱుజ్కయిఱ్ఱాల్ కట్టుణ్డాన్"** అని తిరుమజ్గైయాళ్వార్లును ఈ సౌలభ్యమును కీర్తించిరి. **"దామాని లోకనామాని ధారతి యస్యోదరాంతరే, తేన దామోదరో దేవః శ్రీధర స్తు సమాశ్రితః"** (దామశబ్దముచే చెప్పబడు వేదములో నున్న నామరూపములన్నియు ప్రళయకాలములో అతని నడుములో వెలుగుచున్నవి. కావున శ్రీధరుడు దామోదరుడగుచున్నాడు) అని పురాణములో చెప్పబడిన అర్థమును గ్రహింపవచ్చును. **"దామోదరనై త్తనిముదల్వనై ఞాలముణ్డవనై"** అని నమ్మాళ్వార్లు ఈ అర్థమును తెలిపిరి. **"దమాదిసాధనేన ఉదారా ఉత్కృష్టా మతి ర్యా తయా గమ్యత ఇతి దామోదరః"** (దమము మొదలగు సాధనములతో గొప్పదియై వెల్గు బుద్ధి **'దామోదరా'** అనబడును. ఆ బుద్ధిచే తెలియబడువాడు దామోదరుడు) అని శంకరులు అర్థమును చెప్పిరి. **"దమాత్ దామోదరం విదుః"** (దామోదరని దమముతో తెలియుదురు) అను భగవద్వచనము ఈ అర్థమునకు

ప్రమాణము. "దేవానాం సుఖశంసిత్వాత్ దామాత్ దామోదరం విదుః" (దేవతలకు సుఖమైనవానిని ఉపదేశించుటచేతను, దారముచే కట్టబడుటచేతను దామోదరుడని తెలిసికొనుచున్నారు.) అను ప్రమాణము యొక్క రీతిలోను అర్థము చెప్పవచ్చును. దీనిని భట్టర్‌కూడ వివరించిరి.

ఇట్లు పంద్రెండు నామముల అర్థము వివరింపబడినది. వాసుదేవాది నాల్గు వ్యూహమూర్తులనుండి ముగ్గురు ఉన్నట్లును, వీరు లలాటము మొదలగు అవయవములలో నుండి, శరీరమును రక్షింతురని, ధ్యానించువారి తాపములను పోగొట్టుదురనియు పాంచరాత్రశాస్త్రములో చెప్పడిన క్రమమును బట్టి. ఈ కేశవాది నామములు వారిని తెల్పుచున్నవనియు చెప్పవచ్చును.

పెరియాழ్వార్ తిరుమొழிలోని ఈ నామపాశురము, దాని భావమును-

వా వెన్టు శొల్లి యెన్ కైయై ప్పిడుత్తు వలియవే కాదిల్ కడిప్పై,
నోవ త్తిరిక్కిలునక్కిజ్జ్ఞழுక్కుఱ్ఱెన్ కాదుగళ్ నొన్దిడుమ్ కిల్లేన్,
నావల్పழజ్గొణ్డువైత్తేన్ ఇవై యాణాయ్ నమ్బీ ! మున్ వఞ్జమగళై
చ్చావ ప్పాలుణ్డు శగడిఱ ప్పాయ్‌న్దిట్ట తామోదరా! ఇజ్గే వారాయ్.

శ్రీకృష్ణుడు యశోదను చూచి "నేను నీ చెవిలో పోగును పెట్టేటట్లు ఇక్కడకు రా'' అని పల్కిన ఆమె చేతిని పట్టుకొని, "చెవి నొప్పి పుట్టేటట్లు కర్ణాభరణాన్ని ఇపుడు బలవంతంగా పెడితే నీకు కల్గిన లాభం ఏమి ? నా చెవులు నొప్పిపుడతాయి. దానిని సహించగల బలాన్ని కలవాడను కాను'' అని అంటూ అడ్డు పల్కగా, అపుడు యశోద- "గుణపూర్ణా ! నీకు ఇష్టం అయిన నేరేడుపండ్లను తీసికొని వచ్చాను. వీటిని చూడు. పూర్వం వంచనను కల పూతన నశించేటట్లు ఆమె స్తన్యాన్ని పానం చేసి, శకటాసురుడు చచ్చేటట్లు కాళ్ళతో తన్నిన (విదల్చిన) దామోదరా ! ఇక్కడకు రా !

## ఫలశ్రుతి

వార్ కాదు తాழ ప్పెరుక్కి యమైత్తు మకరక్కుழై యిడవేణ్డి
శీరాలశోదై తిరుమాలై చ్చొన్న శొల్ శిన్దైయుళ్ నిన్టు తికழ



పారార్ తొల్ పుగழాన్ పుదువై మన్నన్ పన్నిరునామత్తాల్సొన్న
ఆరాద వన్దాది పన్నిరణ్డుమ్ వల్లార్ అచ్చుదనుక్కడియారే.

యశోదాదేవి స్వభావసిద్ధంగానే పెద్దవిగా ఉన్న కర్ణాలను ఇంకా వేలాడేటట్లు పెంచి వృద్ధిచేసి, మకరకుండలాలను పెట్టాలని అభిలషించి, శ్రియః పతి అయిన కృష్ణుని గొప్పతనం తగ్గకుండా ఉండేటట్లు పిలిచిన పల్కులు తమ మనస్సులో స్థిరంగా నిలచి ప్రకాశించగా, భూలోకం పూర్ణమైన, ప్రాచీనమైన కీర్తిని కలవారు, శ్రీవిల్లిపుత్తూరుకు నిర్వాహకులు అయిన పెరియాழ్వార్లు ద్వాదశనామాలతో కలిపి పల్కుతూ అన్దాది ప్రక్రియలో కూర్చినవి అయిన పన్నెండు పాటలను అభ్యసించ గల్గినవారు భగవానునకు అభిమతకైంకర్యాన్ని చేయగలరు.

తిరువాయ్‌మొழிలో దామోదరనామాంకితమైన పాశురము, దాని భావమును-

తామోదరనై త్తనిముదల్వనై ఞాల ముణ్డవనై
ఆమో తర మఱియ ఒరువర్‌క్కెన్టే తొழுమవర్‌గళ్
తామోదర నురువాగియ శివఱ్కుమ్ తిశైముగఱ్కుమ్
ఆమో తర మఱియ అమ్మానై యెన్నాழிవణ్ణనైయే

దామోదరుడనే నామాన్ని కలవాడు, సాటి లేని జగత్కారణభూతుడు, ప్రళయకాలంలో లోకాలను తన ఉదరంలో పెట్టుకొని రక్షించినవాడు అయిన స్వామిని వివేచించి తెలిసికోవడానికి ఎవరికీ సాధ్యం కాదని నిశ్చయించుకొని, నమస్కరించినవారై భగవానునకు అవయవభూతులైన శివునకు, బ్రహ్మకు సముద్రవర్ణుడైన ఆ భగవానుని పరిచ్ఛేదించి పల్కడానికి సాధ్యమా !

## ఫలశ్రుతి

వణ్ణ మామణిచ్చోదియై అమరర్‌తలైమగనై
కణ్ణనై నెడుమాలై త్తెన్‌కురుగూర్ చ్చడకోపన్
పణ్ణియ తమిழ்మాలై ఆయిరత్తుళ్ళివై పన్నిరణ్డుమ్
పణ్ణిల్పన్నిరునామప్పాట్టు అణ్ణల్ తాళణైవిక్కుమే.

నల్లని వర్ణాన్ని కల నీలమణియొక్క కాంతివంటి కాంతిని కలవాడై, నిత్యసూరినిర్వాహకుడై, శ్రీకృష్ణునిగా అవతరించినవాడై, ఆశ్రితులపట్ల అంతు లేకుండా ఉండే వ్యామోహాన్ని కలవాడైన భగవానునిగూర్చి ఆళ్వార్లు అనుగ్రహించిన ద్రావిడపాశురమాల అనే ఈ వేయి పాశురాలలోను రాగంతో కూడిన, ద్వాదశనామగర్భితం అయిన ఈ పన్నెండు పాశురాలు భగవానుని శ్రీపాదసన్నిధికి చేర్పిస్తాయి.

విశే :- ఈ దశకంలోని పాశురాలలో ఆళ్వార్లు భగవన్నామాల అర్థాన్ని తమ విషయంలో అన్వయించుకొంటూ "ఎన్ మాదవన్", "ఎన్ కోవిన్దన్", "ఎన్ వామనన్", "ఎన్ శ్రీదన్", "ఎన్ ఇరుడీకేశన్" అని పలునామాలను అను సంధించారు. "నాన్ తోఱ్ఱ తుణై. మాతవనాన- నారాయణన్- ఎన్నై" అని, శ్రీమన్నారాయణన్ ఎనక్కు స్వామి ఎన్నై'' అని, ''కృష్ణావతారముమ్ తమక్కెన్దిరుక్కిఱార్" అని, "వామన వేషత్తై క్కాట్టి ఎన్నెఞ్జై త్తిరుత్తి త్తన్దాయ్" ఇత్యాదిగా నమ్బిళ్ళై ఈ విషయాన్ని తమ వ్యాఖ్యలో వివరించారు. అందువల్ల భక్తులు ఈ నామార్థాలను తమపట్ల అనుసంధించుకోవడం వారి భక్తిప్రకర్షకు సూచిక.

పన్నిరు నామములోని ఈ నామపాశురము, దాని అర్థమును-

**తామోతర నెన్తన్ తామజ్జనాలు కరజ్గళిఙ్కొణ్డు**
**ఆమో తర మెన వాకత్తిలుట్పుఱమ్ పిఙ్కళుత్తుమ్**
**తామోరిళజ్గతిరో నెన వెన్తుళ్ళిరుళఱుక్కు**
**మా మోక మాఱ్ఱు మదిళత్తియూరిన్ మరకతమే**

మా మోకమ్ మాఱ్ఱుమ్ = గొప్ప అజ్ఞానమును పోగొట్టుచున్న, మదిళ్ అత్తియూరిల్= ప్రాకారములు చుట్టియున్న హస్తిగిరిలో (నున్న), మరకతమ్ = మరకతమణివంటి వరదరాజస్వామి, ఎన్తన్ దామోదరన్ = నా దామోదరుడై, నాలు తామజ్గళ్ = నాల్గు పాశములను, కరజ్గళిల్ కొణ్డు = శ్రీహస్తములలో దాల్చి, తరమ్ ఆమో ఎన = (ఈ) గొప్పతనము (ఇతరులకు)ఉన్నదా అనునట్లు, ఆకత్తిన్ ఉళ్ పుఱముమ్ = శరీరము లోపల, బయట, పిన్ కళుత్తుమ్ = కంఠము వెనుకవైపు (నిలచి యుండి), తామ్ ఓర్ ఇళమ్ కదిరోన్ ఎన = తాను ఒక ఉదయించుచున్న



సూర్యుడనునట్లు, (వర్ణమును కలవాడై), ఎన్ ఉళ్ ఇరుళ్ అఱుక్కుమ్ = నా మనస్సులో (నుండు అజ్ఞానమనెడి) చీకటిని పోగొట్టును.

ఇచటి భగవన్మూర్తి - దామోదరుడు. వర్ణము-ఉదయించు సూర్యుడు. ఆయుధములు - నాల్గు పాశములు. స్థలము - శరీరములో లోపల, బయట. పుండ్రస్థానము -కంఠము వెనుక భాగము.

## ఫలశ్రుతి

**కత్తి త్తిరియు జ్కలైకళై వెల్లు జ్కరుత్తిల్ వైత్తు**
**పత్తిక్కుఱు తుణై పన్నిరునామమ్ పయిల్‌పవర్క్కు**
**ముత్తిక్కు మూల మెనవే మొళిన్ద విమ్మూన్ను నాన్గుమ్**
**తిత్తిక్కు మెజ్కళ్ తిరువత్తియూరరై చ్చేర్‌పవర్క్కే**

కత్తి త్తిరియుమ్ = (సారము లేక, కేవలము ఆడంబరముతో), అఱచుచు తిరుగుచున్న, కలైకళై = (నిష్ఫలములైన)విద్యలను, వెల్లుమ్ = వాదములో జయింపగల (శక్తిని కల్గిన), కరుత్తిల్ = మనస్సులో, పత్తిక్కు ఉఱు తుణై = భగవద్భక్తికి తగిన సాధనమైన, పన్నిరునారుమ్ = (కేశవుని మొదలుగాగల) పండ్రెండు నామములను, వైత్తు = ఆధారముగా చేసికొని, పయిల్ పవర్క్కు = అనుసంధానమును చేయువారికి, ముత్తిక్కు మూలమ్ = మోక్షమునకు కారణమగును, ఎన మొళిన్ద =అని చెప్పబడిన, ఇమ్మూన్ను నాన్గుమ్ = ఈ పండ్రెండు పాశురములును, ఎజ్గళ్ తిరువత్తియూరరై శేర్‌పవర్క్కే = మా హస్తిగిరి నాథుని ఆశ్రయించిన భాగవతులకే, తిత్తిక్కుమ్ = (మనస్సునకు) మధురమైయుండును. (ఆనందమును కల్గించునదియై యుండును.)

శ్రీ వరదరాజస్వామి శ్రీపాదములలో అభినివేశమును కల భాగవతులకు పరమభోగ్యమైన ఈ ప్రబంధమును అనుసంధించువారికి భగవద్భక్తి వృద్ధియగును. వారు ఉపాయమును అనుష్ఠించి, మోక్షమును పొందుదురు.

**సదా కకుద్గతం లోకసుందరీపతి మవ్యయమ్ ।**
**దామోదరం చతుష్పాశ మింద్రచాపనిభం భజే ॥**



**శిఱన్దార్ కెర్పుతున్జెయామ్ శెజ్గణ్మాల్నామమ్**
**మఱన్దారై మానిడమా వైయేన్ - అరన్దాజ్గుమ్**
**మాదవనే! యెన్నుమ్ మనమ్ పడైత్తు మఱ్ఱవన్పేర్**
**ఓదువదే నావినాలుళ్ళు (ఇరణ్డామ్ తిరు - 44)**

ఓ మనసా! శ్రీవైష్ణవోత్తములకు ఉజ్జీవించడానికి సహాయమైన అయిన పుండరీకాక్షుని తిరునామాన్ని మఱచినవారిని నేను మానవులుగా నా మనసులో లెక్కించను. ధర్మాన్ని స్థిరంగా ప్రతిష్ఠించే ఓ శ్రియఃపతీ! అని పిలిచి ఆహ్వానించి మనస్సును కలిగిఉండడమేకాక, ఇంకా అతని తిరునామాలను జిహ్వాతో ఉచ్చరించడమే మనకు తగినదని మనసులో భావించు.

**రమాదయిత! రంగభూరమణ! కృష్ణ! విష్ణో! హరే!**
**త్రివిక్రమ! జనార్దన! త్రియుగనాథ! నారాయణ!**
**ఇతీవ శుభదాని యః పఠతి నామధేయాని తే**
**న తస్య యమవశ్యతా నరకపాతభీతిః కుతః ॥**

**(అభీతిస్తవం-7)**

కేశవాదిద్వాదశానాం నామ్నా మాంధ్రగిరాఽర్పితా।
నివృతిః శింగరార్యేణ ప్రీణయేన్మానసం హరేః ॥